సరస్వతీ గ్రంథమండలి : ౪౫

# సేవాశ్రమం

## మొదటి భాగము

శ్రీమతి దామెర్ల భ్రమరాంబ
శ్రీమతి కొండ విజయలక్ష్మీబాయి

పబ్లిషర్సు: అడ్డేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# శ్రీభగవద్గీతా గర్భిత భావబోధిని

శ్రీ కోకా వెంకటరామానుజులు నాయుడుగారు రచించినది.

తెనుగులో, శ్రీమద్భగవద్గీతకు ఇంత చక్కని మహాభాష్యం మరొకటి లేదు. శ్రీ నాయుడుగారు భగవద్గీత అంతా చిరకాలం పారాయణ చేసీ, మననం చేసీ, మథించీ తాము తెలుసుకున్న గూఢార్థాలన్నీ లోకశ్రేయస్సుకోరి యీగ్రంథరూపంగా భద్రపరిచి మనకు ప్రసాదించారు. వారు. ప్రతీ శ్లోకానికీ ముందు ప్రతిపదార్థం ఇచ్చారు. తరవాత ప్రశ్నోత్తరాల రూపంగానూ వివరణరూపంగానూ గూఢార్థాలన్నీ ఉల్లేఖించారు. ఈగ్రంథం పరిశీలించకుండా ఎవరైనా సరే "మేము భగవద్గీత చదివాము" అనుకోవడం సాహసం అనిపించుకొంటుంది. రాయలుసైజున 724 పేజీలూ, 16 పేజీల అవతారికగల గొప్పగ్రంథం. కాలికో బైండు చెయ్యబడ్డది. కాని వెలమాత్రం పరమ సులభం 6-0-0.

# శ్రీ త్యాగరాజస్వామి కీర్తనలు

సంపాదకులు — ఘృష్ణస్థానం నరసింహభాగవతులవారు.

ఇందులో, మేళకర్త రాగాల వరసను 505 కీర్తనలూ, 19 పవ్వళింపు కీర్తనలూ వున్నాయి. ఘనరాగపంచకం కీర్తనలకుమాత్రం మొదట స్వరం చేర్చబడివుంది. తక్కిన కీర్తనలన్నీ మూలం మాత్రమే ముద్రించబడ్డాయి. కఠినపదాలకు అర్థమున్నూ తెలుపబడ్డది. 16 పేజీల శ్రీ త్యాగరాజస్వామి చరిత్ర గలదు. మొదట మేళకర్తరాగాల వరసనూ, చివర అకారాదిగానూ కీర్తనల సూచిక చేర్చబడ్డది. దళసరి కాగితాలు. చక్కని బైండు. వెల 5-0-0 మాత్రమే.

# మంగళహారతులు, శ్రీకృష్ణసేవ.

శ్రీమతి కొచ్చెర్లకోట వీరలక్ష్మమ్మగారు రచించినవి.

ఈ రెండు పుస్తకాల్లోనూ స్త్రీలకందుబాటుగా ఉండే శైలిలో చక్కని మాదిరులలో 150 పాటలకు తక్కువకాకుండా ఉన్నాయి. అన్నీ భక్తిరసం ఉట్టిపడేవి, శ్రీరామ, శ్రీకృష్ణుల సేవను తెలియచేసేవిని. దేనికదే వెల 1-0-0

☞ మా పుస్తకములు పేరుపడ్డ అన్ని బుక్ షాపులలోను ఈ ధరలకు దొరుకును.

సరస్వతీ గ్రంథమాల: ౪౯
రాఘవరావు సంపాదితము

# సేవాశ్రమం

మొదటిభాగము

శ్రీమతి దామెర్ల భ్రమరాంబ
శ్రీమతి కొండ విజయలక్ష్మీబాయి



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# పీ ఠి క

శ్రీమతి దామెర్ల భ్రమరాంబగారును, శ్రీమతి కొండ విజయ లక్ష్మీబాయిగారును హిందీభాషనుండి తామాంధ్రీకరించిన 'సేవా శ్రమ' మను నవలకుం బీఠిక వ్రాయుమని నన్నుం గోరిరి. ఇట్లు కోరుట నన్ను మిక్కిలి గౌరవించుట యని నేను భావించెదను. ఏలయన, నిట్టి గ్రంథములకుం బీఠికలు వ్రాయువా రాంధ్రదేశమున ననేకులు గలరు. స్వల్పప్రయత్నముతో ననేకులు లభించుచుండఁగా దూరమున నున్న నన్నీపనియందు నియోగించుట నాభాగ్య మని చెప్పక తప్పదు. ఇట్లు వారు కోరుటకు నాయందుఁ గల గుణవిశేషము కారణము గాదు. వారికి నాయందు గల పక్షపాతమే ముఖ్యకారణము. ఈ పక్షపాతమునకుఁ హేతువు లేకపోలేదు. రాజమహేంద్రవరములో దామెర్లవారి కుటుంబమునకును, నాకును రమారమి 45 సంవత్సరముల నుండి యత్యంతమైత్రి గలదు. వారికుటుంబమునకుఁ జిరపరిచితుఁడ నగుటచేత శ్రీయుత భ్రమరాంబగారును, నామెతోడి సఖ్యసంబంధములచేత విజయలక్ష్మీబాయిగారును నాకీగౌరవము గలిగించిరి. ఇది వఱకు నేను గొందఱుమిత్రుల గ్రంథములకుం బీఠికలు వ్రాసి యిచ్చితిఁ గాని, యీపీఠిక వ్రాయునప్పుడు గలిగిన యానందము నా కేవఱు కెన్నఁడుఁ గలుగలేదు. తత్కారణ మిది. ఆంధ్రదేశనారీమణులు పురుషులవలెనే నవీనపద్ధతులఁమీఁద నాంధ్రభాష నభ్యసించి, పాండిత్యము సంపాదించి, దేశోపకారకములై భాషౌన్నత్యము గలిగించునట్టి సద్గ్రంథముల వ్రాయునట్టి మహాపర్వదినము లెప్పుడు వచ్చునా యని యానుదినముల నిమిత్తమై నే నెదురుచూచుచుంటిని. ఈ కోరికతోడనే నా గురువు లగు శ్రీ కందుకూరి వీరేశలింగము

పంతులుగారు గూడ స్త్రీవిద్యకు నమిశ్రప్రోత్సాహ మొసఁగిరి. ఆంధ్ర దేశ్యమాత కడుపు చల్లఁగాఁ గొంతకాలమునుండి కవనమునందు, వచన రచనమునందుఁ బ్రౌడతనముఁ జూపెడి నాఁడుబిడ్డలను గడుపు చల్లఁగాఁ గనుచున్నది. ఆయువతీమణుల గ్రంథము లాంధ్రజనమనో రంజకములై, వీనుల విందులై, కనుల పండువులై, హస్తాలంకారము లై గృహభూషణములై విరాజిల్లుచుండుట దేశముయొక్క యదృష్టము. ఈ గ్రంథము స్త్రీరత్నములు రచియించిన దగుటచేతను, నా స్త్రీరత్నములు నాకుటుంబములోనివంటివారే యగుటచేతను, నాచిరకాల మనోరథమును సిద్ధి నొందించినవారిలో వీరుచుఁ జేరుటచేతను, నే నీపీఠిక సంతోషపూర్వకముగా వ్రాసితిని.

ఈనవల యాంధ్రీకరణ మైనను రసపుష్టి గలిగి, స్వకపోల కల్పితమైన గ్రంథమువలెనే హృదయంగమమైయున్నది. శైలియు మనో హారముగా నున్నది. 'పురంధ్రీణాం చేతః కుసుమసుకుమారం హి భవతి' అని భవభూతి చెప్పియున్నాఁడు. స్త్రీల మనస్సులు పూవులు వలె మెత్తని వని దీనియర్థము. వారి హృదయములవలెనే వారి మాటలును దేనిలో తేటలవలెఁ దియ్యనై యుండు టాశ్చర్యముగాదు. ఈ నవలయందలి మాటల పొందికలు మిక్కిలి యందములై మధుర ములై పాఠకమహాశయులకు నానందము గలిగించు ననుట యతి శయోక్తిగాదు. వీరు గ్రంథ మంతయు గ్రాంథికశైలినే వ్రాసిరి గాని, పలుతావుల సంధులు కలుపవలసినచోటఁ గలుపక, వాక్యమధ్యములం దచ్చు లచ్చులనై యుంచుట కేమికారణమో తెలియదు. రెండవ కూర్పునకైన వారు సవరించిన మిక్కిలి బాగుండును. రసపూరితమై భావగర్భితమైన యీగ్రంథ మాంధ్రలోక మందలి పాఠకమహాశయు లకు సర్వవిధముల నానందకరమై యుండు నని తలంచెదను. ఈ కాంతామణు లిరువురు నింక నిట్టి గ్రంథము లనేకములు రచియించి

మాతృభాషాసేవయుఁ బరమార్థములను నాంధ్రభాషాసేవయుఁ జేసి, ఆంధ్ర పడంతులకు సన్మార్గదర్శినులై కృతకృత్యు లగుదురు గాక యనియు సర్వశ్రేయోదాయకుఁడగు పరమేశ్వరుఁడు వీరి యుద్యమమును కొనసాగించుఁగాక యనియుఁ గోరుచున్నాను.

రాజమహేంద్రవరము, }
29—2—33 }

ఇట్లు
చిలకమర్తి లక్ష్మీనరసింహము.



# విజ్ఞప్తి

"సేవాశ్రమము" అను నీనవల, సుప్రసిద్ధ హిందీనవలారచకు లగు శ్రీయుత ప్రేమచంద్ గారి "సేవాసదనము" అను నవల కను వాదము.

సేవాసదనమును తెనుగులో అనువదించుటకు దయతో మా కనుమతి నిచ్చిన శ్రీ ప్రేమచంద్ గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

మరియు నీనవల ననువదించుటలో మాకు ప్రోత్సాహ మొసర్చిన శ్రీయుత మదునూడ ఆంజనేయులు గారికిని, కల్లికోట కళాశాల ఆంధ్రోపాధ్యాయులగు కావ్యతీర్థ శ్రీ నేమాని నరసింహశాస్త్రిగారికిని, మా కృతజ్ఞతాపూర్వకవందనములు.

ఇట్లు
విధేయురాండ్రు,
దామెర్ల భ్రమరాంబ
కొండ విజయలక్ష్మీబాయి

ప్రతిమనుజుడు తన దుష్ప్రవర్తన విషయమై యొకప్పుడు కాకపోయిన నొకప్పుడైనను, పశ్చాత్తాపము పొందుట సహజము. ధర్మపురం ఇనస్పెక్టరు నరసింహారావు తన మంచినడతను తలచుకొని లోక విరుద్ధముగ, పశ్చాత్తాప పడుచుండెను. ఆయన యీయుద్యోగములో ప్రవేశించి, దరిదాపు ఇరువదియైదు సంవత్సరములు కావచ్చెను. కాని అతడెన్నడును, తన కర్తవ్యమును మరచి ప్రవర్తించి ఎరుగడు; ఆశా పిశాచమునకు లోబడి, తనగౌరవ మర్యాదలను గోల్పోయి యుండలేదు. కాని ఇన్ని సంవత్సరములు గడచిన తర్వాత నిప్పుడాతడు, తన యమాయకత్వమును, మంచి నడవడిని తలచుకొని తనలో తానే విసుపు జెందుచుండెను. నరసింహారావు భార్య జగదాంబ పతిభక్తి, దైవభీతి గల సాధ్వీమణి. ఆమె సహవాసమువలన, నరసింహారావు గౌరవ మినుమడించుచుండెను. ఇప్పుడు జగదాంబయందు కూడ తమ సద్వర్తనములు సత్యసంధతలు, వ్యర్థము లయిపోవునేమో యనెడి వ్యాకులభావ ముదయింప జొచ్చెను.

కపిల నరసింహారావు ఉదారస్వభావి. సజ్జనుడు. ఆయన తనకంటె తక్కువ యుద్యోగస్థులను, అన్నదమ్ములవలె ప్రేమించుచుండెను. కాని యిట్టిప్రేమ, వారిని సంతోష పెట్టజాలకుండెను. "ఈయన సౌమ్యత వలన మాకేమిలాభము మాకడుపులు నిండకపోయిన తర్వాత? ఎన్ని తాపులు పడినను ఎన్ని చీవాట్లు తినినను, కడుపునిండ తిండి దొరకుచుండిన బాధలేదు. ఎండిపోయిన రొట్టెముక్క వెండి పళ్లెములో పెట్టిన, కమ్మని పూరీతో సమానమగునా? ఇట్టి సజ్జనుని బట్టుకొని, మేమెట్లు నెగ్గగలము." అని వారిలో వారెల్లప్పుడును,

నణగుకొనుచుండిరి. పై అధికారులుకూడ నితనిని జూచిన ముఖము ముసుపులే. తక్కిన ఠాణాలకు బోయినప్పుడు వారికి, మంచి ఆదర సత్కారములు, విందులు, బాగుగ జరుగుచుండెడివి. ఇంతేకాక సజ్జనులనియు, బహుమతులనియు, పేర్లుజెప్పి ధనముకూడ బాగుగ దొరకుచుండెడిది. కాని నరసింహారావు ఠాణాలో నిట్టి సత్కారము లెక్కడ? తాను లంచము పుచ్చుకొనడు. ఒకరికివ్వడు. తాను పుచ్చుకొనిన గదా పై అధికారులకు దానిచ్చుట. అతని నడవడిజూచి, పై అధికారులు, క్రింది యధికారులు, లోభియనియు, గర్వియనియు, నిర్లక్ష్యపు మనిషియనియు, నిందింపజొచ్చిరి.

నరసింహారావు నిజముగా వారనుకొనునట్లు లోభికాడు. ఆతడు స్వాభావికముగా షోకుదారి మనిషి కాడు. కాని తన ఆలుబిడ్డలను సుఖపెట్టుట, తనకర్తవ్యమని, ఆతనియుద్దేశ్యము. అతని కుటుంబ మంతయు కలసి నలుగురు మనుష్యులే. అనగా ఆతడు, భార్య, ఇరువురు కుమార్తెలు. ఇనస్పెక్టరునకు కొమార్తెలన్న ప్రాణము. వారి కెల్లప్పుడును, రకరకముల బట్టలు, ఆటవస్తువులు తెప్పించి యిచ్చుచుండెడివాడు. బజారులో ఏవైనను, క్రొత్తరకపు బట్టలుగాని, ఆట వస్తువులుగాని, కనబడిన యెడల అవి తన కొమార్తెలకు కొని ఇచ్చు వరకు ఆతని మనస్సు ఒప్పెడిదికాదు. తన యిల్లు మంచిమంచి వస్తువులతో అలంకరించుట యన్న నతనికి మిక్కిలి సరదా. ఎక్కడ ఏ మంచి వస్తువు దొరకిన నది తనయింట్లో నుండవలసినదే. కుమార్తెలకు చదువు చెప్పుటకును, ఊలుపనులు మొదలైనవి నేర్పుటకును ఆతడొక దొరసానిని నియమించెను. అప్పుడప్పుడు తానుకూడ స్వయముగా వారిని పరీక్షించి వారి తెలివితేటల కానందించుచుండును.

జగదాంబ మంచి నేర్పరియగు ప్రౌఢ. "కొంచెమాలోచించి చూచిన చెప్పెదను. మన వేదాదిధర్మములు చెడిపోయినను, పిల్లలకు పెండ్లియైనను చెయ్యవలెగదా? అప్పుడు డబ్బుకొరకు ఎవరి కాళ్లు పట్టుకొన్న నెవరిచ్చెదరు? ఇప్పుడు మనము పిల్లలకు ముఖమల్ బట్టలు వేసి, క్రింద నడవనియ్యకుండ గారాబముగా పెంచగానే సరి పోయినదా? వారి భావిసౌఖ్యమునుగూడ కొంచెమైన నాలోచించవలదా?" యని జగదాంబ భర్త నెల్లప్పుడును మందలించు చుండెను. "ఇదివర కేలాగు జరుగుచున్నదో యిక ముందుకూడ అలాగే జరుగు నని భార్యమాటల నాతడు నవ్వుతాలక్రింద త్రోసి వేయుచుండెను. "ఒక్కొక్కప్పుడు, ఇటువంటి సంగతులు చెప్పి నాకెందుకు చింత గలుగజేసెదవు?" అని భార్యపై చికాకు పడు చుండెను. ఈ ప్రకారముగా కొన్ని దినములు గడచిపోయెను. బాలిక లిద్దరు, కమలసుశీలలు వృద్ధిపొందుచుండిరి. పెద్దకుమార్తె కమల మిక్కిలి పొగరైన బాలిక. చంచలభావముగల యభిమానవతి. చిన్న కుమార్తె సుశీల, సాధుస్వభావముగల గాంభీర్యవతి. కమల యెల్లప్పుడును తన తోడిబాలికలకంటె అధికముగా నుండవలెనని కోరుచుండెడిది. తండ్రి బజారునుండి ఏదైన మంచివస్తువులు దెచ్చినప్పుడు చెల్లెలికంటె ముందు తానె మంచివస్తువుల నేరి తీసికొనుచుండెడిది. సుశీల ఆ మిగిలిన వస్తువులతోనె తృప్తిపొందుచుండెడిది.

జగదాంబ పూర్వాచారము ననుసరించి, తనకూమార్తెల ఋణము నుండి తాము శీఘ్రముగా విముక్తి పొందవలెనని కోరుచుండెను. కాని నరసింహరావు బాలిక లింకను వివాహయోగ్యలు కాలేదనియు, బాల్యవివాహములు శాస్త్రవిరుద్ధములనియు జెప్పి, ఆమెను సమాధాన పరచుచుండెను. వార్తాపత్రికలయందు వరశుల్క నిరసనము గురించిన వ్యాసములు చదివినప్పుడాతడు చాలా సంతసించుచు నిక రెండుమూడు సంవత్సరములలో నీకట్నముల దురాచారముడిగిపోవు

ననియు, అప్పుడు నిశ్చింతగ తన కొమార్తెలకు వివాహములు చేయవచ్చుననియు, ఆయన తలచుచుండెను.

ఈ ప్రకారముగ కొంత కాలము గడచెను. ఇంతలో, కమలకు పదహూరు సంవత్సరములు నిండ వచ్చెను. దినమంతయు చెట్టు నీడను హాయిగ నిదించి, సాయంకాలము మేల్కొని, తన కెదురుగా నున్న పెద్ద కొండను జూచి, కలవరపడు మనుజునిరీతి నరసింహారా విప్పుడు కలవర పడజొచ్చెను. మునుపటివలె కబుర్లు చెప్పుచు కాలము గడపుట కిప్పుడు వీలులేదు. అతని పూర్వపు టాలోచన లన్నియు, వ్యర్థము లయ్యెను. ఇప్పుడాతడు వరాన్వేషణార్థము తత్తరపడ సాగెను.

నరసింహారా విప్పుడు అనేక స్థలములనుండి వరుల విషయమై సమాచారములు తెప్పించ సాగెను. నాగరిక కుటుంబములతో సంబంధము చేయవలెనని ఆతని కెంతో యభిలాష. అటువంటి వారికి కట్నముల యాశ యుండదనియు, పిల్లలు సౌఖ్యపడెదరనియు ఆతని యభిప్రాయము. కాని పెండ్లికుమారుల కట్నములు వారి విద్యనుబట్టి పెరుగునని తెలిసినప్పు డాయన కాశ్చర్యము కలిగెను. జాతకములు చూచిన తర్వాత, కట్నముల విషయము వచ్చినప్పుడు నరసింహారావు మతిపోవుచుండెను. కట్నముల బేరము నాలుగైదు వేల వరకు పెరిగిపోవుచుండెను. అందువలన విధిలేక అట్టి సంబంధ ములు వదలుకొన వలసి వచ్చుచుండెను. ఈ విధముగ ఆరుమాస ములు గడిచెను. తన స్థితిని తలచుకొన్న కొలది ఆతనికి మతి పోవు చుండెను. కొన్ని నాగరిక కుటుంబముల వారు ఆయన యెడల సానుభూతిని జూపుచుండిరి. కాని ఆశతో ఆయన సంబంధం విషయమై వారిని అడిగినప్పుడు, "అయ్యా! మేమును నిట్టి దురాచారముల కొడ విముఖులమే. కాని ఏమి చేయుదుము? క్రిందటి సంవత్సరమే

కదా మా అమ్మాయికి వివాహము జేసితిమి. అచ్చముగా కట్నము నకే రెండు వేలును, పెండ్లి ఖర్చుల నిమిత్తము రెండు వేలును ఖర్చా నవి. ఈ సొమ్ము ఎట్లు ప్రాప్తి యగునో మీరే చెప్పండి" అని జబాబు చెప్ప మొదలు పెట్టెను. ఇట్టి మాటలు నరసింహారావును నిరుత్తరునిగ జేసి వైచెను ఇంతకంటె చతురుడైన మరియొక మహా నుభావుడు, "అయ్యా! ఇనస్పెక్టరుగారు! నా కొడుకును ఇన్ని సంవ త్సరములు అష్టకష్టములు పడి పెంచి పెద్ద వానిని జేసితిని. చదువు సంధ్యలకై వేలకు వేలు ఖర్చుపెట్టితిని. దీనివలన నా కుమారుడెంత సౌఖ్యపడునో మీ కుమార్తెకూడ నంత సౌఖ్యపడును కదా? ఈ భార మంతయు నే నొక్కడనే భరింపవలెనో లేక మన మిద్దరము సమానముగ భరింపవలెనో, శెల వియ్యండి." అని చమత్కారముగ పలికెను. ఇటువంటి మాటలు వినుచున్నప్పు డాతనితల బగుల పెక్కి-పోవుచుండెను. నరసింహారావున కిప్పుడు తన సత్యశీలత యందును, న్యాయప్రవర్తన యందును, పశ్చాత్తాపము కలుగు చుండెను. గర్వము శిథిలము కాజొచ్చెను. "నేను పాపమునకు వెరచి కదా, ఈ విపత్తు తెచ్చిపెట్టుకొంటి" నని తనలో తాను కుంద నారంభించెను.

ఒక దినమున భార్యాభర్త లిరువురు నేమి చేయుటకును పాలు పోక, విచారగ్రస్థులై యొకచోట మౌనముగ కూర్చుండిరి. కొంత సేపటికి నరసింహారావు మౌనము విడచి భార్యతో నిట్లనియెను. "ఆలోచింపగ నీ ప్రపంచములో న్యాయమునకు స్థానము లేనట్లు తోచుచున్నది. నేనే యిదివరకు మనుష్యుల బుఱ్ఱగొట్టి, గొంతుకల బిసిగి దిట్టముగ లంచములు లాగి ధనము సంపాదించి యుండిన యెడల నీ మహానుభావు లందరు నాతో సంబంధము చేయుటయె మహాభాగ్య మని ఎంచి యుందురు. కాని ఇప్పుడు వారు నాతో మాట్లాడుట కూడ తమ గౌరవమునకు లోపమన్నట్లు నన్ను చూడగనే, నేనొక్కడ,

నశింపవలసినదే. మహాంతు అర్థములో బలముతో మదించిన గురి వలె ముప్పదిమంది గుండాలు సాధువేషములో నుండి, వారి సత్యము సాము కసరత్తులు చేయుచు, పాలు మిఠాయిలతోను, భంగు చిలుములతోను మత్తెక్కియుండిరి. అట్టి మూర్ఖుల కెదురాడుట కెవ్వరు సాహసింప గలరు? పంతులు ప్రపంచ స్వభావము బాగుగ నెఱిగిన వాడగుటచే, అధికారులను మంచి మంచి ఫలహారోపహారములతో తృప్తి పరచుచు తన పనులలో వేసికొనుచుండును. అందువలన ప్రతి యుద్యోగికిని పంతుల యెడలను, మహాంతు నెడలను అభిమాన ముండుట సహజము.

మహాంతు తన గ్రామములకు వెళ్ళునప్పుడు పరివార సహితముగ రాజ ఠీవితో వెళ్ళుచుండెను. ముందు వాయిద్యములు, జండాలు తర్వాత ఏనుగపైన కేసరితో శరభయ్య పంతులు ముఖమునఁ దెలగపాలు గల వెండి పల్లకీలో మహాంతు, గుఱ్ఱములపైన రామనామపు పతాకములు ధరించిన సాధు పటాలము, వీరి యందరి వెనుక బండ్లపైని భోజన సామగ్రి, గుడారములు వరుసగ అట్టహాసముగ బయలుదేరే వారు. అతడే గ్రామమున బస చేసిన ఆ గ్రామస్థులు ఫకీరులు కావలసినదే. ఈ సంవత్సరము మహాంతు తీర్థయాత్రలు చేసి వచ్చిన తర్వాత నొక పెద్ద యాగము చేసెను. ఒక నెల వరకు హోమ కుండము విరామము లేక నేతిధారలచే ప్రజ్వరిల్లు చుండెను. ఆ యజ్ఞమునకు సుమారు పదివేల మంది సాధువులు ఆహ్వానింపబడిరి. యాగవ్యయము నిమిత్తము, మహాంతు ఆజ్ఞ ప్రకారము ఒక్కొక్క రైతువద్ద ఐదేసి రూపాయలు వసూలు చేయబడెను. పంటలు పండిన వారు సంతోషముతో నిచ్చిరి. పండనివారు దుఃఖపడుచు బదులు చేసి యిచ్చిరి. అట్లు కూడ దొరకనివారు నోటు వ్రాసి యిచ్చిరి. కొందరు తమ స్త్రీల సొమ్ములను తాకట్టు పెట్టి యిచ్చిరి. పంతులు

వసూలు చేసుకొనుటయు వసూలు కాకపోవుటయును కూడనా? కాని యొక ముసలి బీదరైతు మాత్రము సొమ్మియ్యజాలనని ధిక్కరించెను. అసలే కొన్ని సంవత్సరములనుండి వాని పంటలు పోవుచుండెను. అందువలన వాడు తిండికి లేక మలమల మాడుచుండ, పంతులు శాస్త్రుల క్రింద వాని ఇల్లు వాకిలి జప్తు చేసియు, వానిచేత నోటు వ్రాయించుకొనియు, మిక్కిలి చిక్కులు పెట్టెను. తిరిగి ఇప్పుడీ సొమ్ము ఇమ్మనగానే వానికి మితిమీరిన కోపము, దుఃఖము కలిగి, "నేను సొమ్ము నివ్వను." అని స్పష్టముగ జెప్పివేసెను. అట్టి వానిని శరభయ్య పంతులా క్షమించుట ?

ఒకనాడు పంతులాజ్ఞానుసారము గుండా లందరు కలసి ఆ రైతు కాళ్లు చేతులు కట్టి బలవంతముగ పంతులు యెదుటకు నీడ్చుకొని వచ్చిరి. అప్పుడా రైతు కోపము పట్టజాలక పంతులును కసిదీర తిట్టెను. అందుపై నాతఁ డుగ్రుడై వానిని మెత్తగా తన్నించి, మహంతు ప్రోత్సాహముపైని ఆ రాత్రి వానిని బలవంతముగ చంపించెను. తెల్లవారగనే చౌకీదారులు శవమును జూచి, హత్యనుగురించి ఠాణాలో రిపోర్టు చేసిరి. ఇన్‌స్పెక్టరు రిపోర్టంతయు జదివి, దయామయుడగు ఈశ్వరుడు తన వలలోనికి బంగారు పిట్టను వదలెనని చాల సంతోషించి, హత్యవిషయమై దర్యాప్తు చేయుటకు ప్రారంభించెను. కాని పంతులుకు, మహంతునకు, వ్యతిరిక్తముగ సాక్ష్యము జెప్పుట కెవ్వరు సాహసింపజాలరైరి. ప్రతి మనుజుడు చాటుచాటున మాత్రము జరిగిన సంగతంతయు ఇన్‌స్పెక్టరుతో జెప్పుచుండెను. ఈప్రకారము నాలుగు రోజులు గడచెను. మొదట మహంతు నిశ్చింతగా నుండెనుగాని, ఇన్‌స్పెక్టరు ఈ విషయమై చాల శ్రద్ధగాను, పట్టుదలగాను, పని చేయుచున్నాడని తెలిసి భయపడ జొచ్చెను. చివరకు పోలీసు వారి నోళ్ళు కట్టదలచి, ఇన్‌స్పెక్టరుగారి వద్దకు తన గుమాస్తా

శరభయ్యను బంపెను. ఇరుపక్షములు వారికి బేరములు జరుగసాగెను. మొదట నరసింహారావు లంచము పుచ్చుకొననట్లు నటించి, తర్వాత మహాంతు నుద్ధరింప దయదలచినట్లు కబుర్లు చెప్పి, మూడు వేల రూపాయ లిచ్చిన యెడల నే చిక్కులు లేకుండ వ్యవహారమును పరిష్కరించెదనని యొప్పుకొనెను. గుమాస్తా మహాంతుతో జరిగిన సంగతు లన్నియు జెప్పెను.

నరసింహారావు తాను చేసిన పని గురించి తర్క వితర్కములు జేసికొనుచు, ఆలోచనా సముద్రములో మునిగిపోయెను. ఒకవైపున ధన లాభము, కష్టవిమోచనము. రెండవ వైపు ఆత్మ నాశనము, పాప భీతి. పుచ్చుకొనుటకు మానుటకుకూడ వాని మనస్సు పాలుపోక పరిపరి విధముల పరితపించుచుండెను. విషము కొని తెచ్చుటకును, దానిని త్రావుటకును, చాల భేదము కలదు. ఇంతవరకు, న్యాయమార్గ మవలంబించి, ఇప్పుడు తన ఆత్మను, మర్యాదను, బలి యొసంగవలసి వచ్చినందుల కాతనికి చాలదుఃఖము కలుగుచుండెను. “ఇదివరకే ఈ పనిని నేను జేసిన యెడల బంగారు మేడలుకట్టి కాలు మీద కాలువేసికొని, హాయిగ సుఖించి యుందును. కాని ఇంతవరకు పేరుప్రతిష్ఠలకొరకు కష్టపడి, ఈ ముసలికాలములో నా కళంకము దెచ్చికొనుట ? అయ్యో ! కాని ఈ విషయములో నాతప్పే మున్నది ? సాధ్యమైనంత వరకు న్యాయముగానే సంచరించితిని. నా భోగవిలాసముల కొరకు నే నేమియు కక్కుర్తి పడలేదు. దేశకాల పాత్రల ననుసరించియు, బంధువుల అనాదరణము బట్టియు, వరకట్న పిశాచ ప్రోద్బలమునను, నీ యన్యాయ మార్గమున ప్రవేశింప వలసివచ్చినది. ఇందులో నా తప్పావంతయు లేదు. ఇప్పటికి సహితము ఈశ్వరుని ఎదుట నాయాత్మ పవిత్రముగనే యున్నది.” అని తనలో తానే మనస్సును సమాధానపరచుకొను చుండెను. ఇదివర కెన్నడును లంచ

గుమా—తెచ్చాను కాని మహంతుగారు...................

నర—(జేబులోని నోట్లకట్టల జూచుచు) నీ కొక్క దమ్మిడీ తక్కువైనను పుచ్చుకొనను.

గుమా—నాకు రావలసిన దాని మాటేం చెప్తారు?

నర—మీకు రావలసిన దేదో మహంతు వద్దే పుచ్చుకోండి.

గుమా—నూటికి రెండు చొప్పున కమీషను నాకు మామూలు. ఇవ్వక తప్పదు.

నర—ఇందులోనుండి ఒక్క దమ్మిడీయైనను మీ కివ్వజాలను. నా యాత్మను అమ్ముకొని సంపాదించిన డబ్బుకాని ఇది నుం ఒకటి కాదు. (మనస్సులో నింక నిక్కడ ఆలస్యము జేసిన, ఎవరైనను వచ్చెదరనియు, ఇంటివద్దే సొమ్ము పుచ్చుకొనిన నే బాధ లేదనియు, భావించి) ఒకసారి నాతో మా యింటికి రండి. అక్కడ వ్యవహారము పరిష్కరించుకొందము.

వాకిట బండి సిద్ధముగ నుండెను. ఇద్దరును బండి నెక్కి బయలు దేరిరి. నరసింహారావునకు ఎగిరి ఇంటిలో పడవలెనన్నంత తొందరగ నుండెను. చురుకుగ తోలుటలేదని బండివానిని పదేపదే అదలింప సాగెను.

వారిల్లు చేరునరికి పదునొకండు గంట లయ్యెను. ఇన్స్పెక్టరు శరభయ్యతో కూడ గదిలో ప్రవేశించి గది తలుపులోపల గడియ వేసెను. వెంటనే గుమస్తా సంచిని విప్పి, ఆయన యెదుట పెట్టెను. అందులో కొన్ని కాసులు, కొన్ని నోట్లు కొంత నగదుకూడ నుండెను. ఎంత సొమ్మున్నదో తిన్నగ జూచుకొనకుండగనే, ఆతడు తక్షణమే సంచిని తీసికొని బీరువాలోపెట్టి తాళము వేసెను.

జగదాంబ ఇంతవరకు భర్తకొరకు నిరీక్షించుచుండెను. ఆయన గుమాస్తాను సాగనంపి వచ్చుచుండుటను జూచి, "ఇంత ప్రొద్దుపొయ్యే

వరకు ఏమి చేయుచున్నావు!" అని ప్రశ్నించెను.

నర—పని అటువంటిది సంభవించినది. అదికాక వెళ్ళవలసిన స్థలముకూడ చాల దూరము.

ఏదో కొంత విధముగ భోజనముచేసి ఆయన పరుండెను. కాని నిద్రపట్టలేదు. జరిగిన సంగతిని భార్యతో చెప్పుటకు ఆతడు సంకోచించుచుండెను. జగదాంబకుకూడ నిద్ర వచ్చుటలేదు. భర్తనైఖరి జూడ ఆమెకుకూడ ఆందోళన కలుగ నారంభించెను. చివరకు నరసింహారా విట్లనెను. "నీవు నదియొడ్డున నిలువబడి నప్పుడు; నీవెనక వైపు నుండి పులి వచ్చిన నేమి చేసెదవు?"

జగ—(ప్రశ్నయొక్క అర్థము తెలిసికొని) నదిలోని కురికెదను.

నర—ఎరిగి, ఎరిగి నదిలో పడుటకు తెగించెదవా?

జగ—ఆ. పులి నోట్లో పడుటకంటె నదిలో నురుకుటయే యుత్తమము.

నర—మంచిదే. నీ యింటికి నిప్పంటుకొని, తలుపు తీసికొని పైకి వచ్చుటకు వీలు లేనప్పుడేమి చేసెదవు?

జగ—మేడపై నుండి క్రింద కురికెదను.

నర—ఈ ప్రశ్నలయొక్క అర్థము నీకు బోధపడినదా?

జగ—(దీనభావముతో భర్తవైపు జూచుచు) ఏమి? నే నంత మూర్ఖురాలనా?

నర—(విచారముతో) నే నాపదలలో జిక్కుకొంటిని. రక్షింపబడెదనో, మునిగిపోయెదనో తెలియదు.

## 3

నరసింహారావు లంచము దీసికొనుటయేగాని, దానిని రహస్యముగ నుంచువిధ మెరుగడు. ఈ విషయమింక ఆయనకు క్రొత్త. శరభయ్యా

పంతులు (తనలో) : "నే నష్టకష్టములుపడి పనియంతయు చక్కబెట్టితిని. ఇట్టివిషయములలోనా, నన్ను మోసముచేయుట ? రాత్రియనక, పగలనక, యీ వ్యవహారము నిమిత్తము ఈయన యింటిమూడుచుట్లు తిరిగితినే ఏమి ? తాను జీతమిచ్చియుంచిన నౌఖరు ననుకొన్నాడు కాబోలు ? మహాంతు పట్టుబడిన నాకేమి విడుదలైన నాకేమి ? ఈ యినస్పెక్టరుకు కోపమువచ్చిన నాకేమి భయము ? నాకేమైనను లాభించునని కదా యింతవరకు కష్టపడితిని ?" అని కోపముతో ననుకొనుచు నరసింహారావు యింటినుండి తిన్నగా ఠాణాకువెళ్ళి, అక్కడి ఉద్యోగస్థులతో జరిగిన సంగతంతయు జెప్పివేసెను.

ఠాణాలోని వారందరును, "బాగున్నది. మాతోనా యీ తమాషా ? లంచపుసొమ్మంతయు, తానొక్కడు కాజేసికొని మమ్మందరను వస్తువెట్టవలె ననుకొన్నాడు కాబోలు ? ఈ సొమ్మేలాగు అరిగించుకొంటాడో మేము చూస్తాము. ఈతనిని మువ్వతిప్పలు పెట్టకపోతే మేము సర్కారునౌఖర్లముకాము." అని రౌద్రపూరితులై పలుకజొచ్చిరి.

నరసింహారావు వివాహప్రయత్నములలో మునిగి తేలుచుండెను. వరుడుత్తమకులీనుడు. సౌందర్య విద్యాగౌరవములు కలవాడు. ఇద్దరు వియ్యాల వార్లకు ఉత్తరప్రత్యుత్తరములు జరిగి, సంబంధము నిశ్చయమయ్యెను.

ఇక్కడ నుద్యోగస్థులందరు జరిగిన సంగతంతయు, పై అధికారులకు అర్జీమూలముగ తెలియజేసిరి. వారును, రహస్యముగ దర్యాప్తుజేసి సంగతినంతయు బయలుదీసిరి.

ఈ విధముగ నొకమాసము గడచెను. ఆ మరునాడు రావుగారింట్లో ప్రధానము జరుపుటకు ముహూర్తము నిశ్చయింపబడెను. ఆనాడు సాయంకాలము ఇనస్పెక్టరు ఠాణాలో కచ్చేరి చేయుచుండెను.

ఇంతలో పోలీసు సూపరింటెండెంటు ముగ్గురు ఇనస్పెక్టర్లతో వచ్చు చుండుటజూచి, ఆతడు కలవరపడసాగెను. ఒక ఇన్‌స్పెక్టరు ముందు నకు వచ్చి, నరసింహారావు భుజముపైని చెయ్యివేసి, ఎరెస్టువారంటు నాతనికి జూపెను. దానిని జూచినతోడనే రావుముఖము వెల వెల పోయెను. ఆతడు నిర్ఘాంతపోయి వడకజొచ్చెను. సిగ్గుచేత తలవంచు కొనెను. ఇదివరకు గర్వముతో తలనెత్తి తిరుగు నాతడిప్పుడు తన తోటి ఉద్యోగస్థుల యెదుట తలవంచవలసి వచ్చెను. పెక్కుమంది దోషులను పట్టి శిక్షించు నాతడిప్పుడు తానే దోషియై తనక్రింది ఉద్యోగస్థుల రోషభాషణలకు లొంగవలసి వచ్చెను. ఇదివరకున్న మంచిపేరంతయు నొక్కక్షణములో నూనుమైపోయెను.

సూప—మంచిది. నరసింహారావు! నీవు నీ విషయమై ఏమైనను చెప్పుకొనెదవా?

నర—(మనస్సులో) ఏమి చెప్పుదును? నేను నిరపరాధినని చెప్పు దునా? లేక యిదియంతయు నా తాబేదారుల మాయాతంత్ర మని చెప్పుదునా? అని పరిపరివిధముల ఆలోచింపసాగెను. కాని అబద్ధ మాడుటలో ఆతనికంత చతురతలేదు. ఆతని యాకారవికారములు, చూపులు, ఆతనిని "ఈతడపరాధి" అని చాటుచున్నట్లుండెను. హైరోడ్డున పోవువాడు సందులలో పడిన తప్పక తనత్రోవను మరచి పోవును. నరసింహారావు యొక్క అంతరాత్మ "చేసిన పాపమనుభ వింపుము" అని వెయ్యిబాణములతో వేధించుచుండెను. పాముపుట్టలో చెయ్యిపెట్టి దేవుడా, నీదే భారమనిన అదికఱవక మానునా!

సూప—ఏమైనను చెప్పుకొనెదవా?

నర—అయ్యా! ఔను. నేనపరాధముచేసితిని నాకు తగిన దండన విధింపుడు. నీచగౌరవమును కొరకు అందరికన్నను కప్పి అనుచిత కార్యమును చేసితిని. అందుకు తగినశిక్ష అనుభవింపవలసినదే! న్యాయ

ధర్మములు నన్నాపజాలక పోయినవి. నేను తప్పక శిక్షార్హుడనే. కాని యొక్కసారి నే నింటికిపోవుటకుమాత్రమనుమతి దయచేయుడు. తరువాత మీ యధీనుడనయ్యెదను.

ఈ మాటలువిని మిగిలిన ఉద్యోగస్థులు నిర్ఘాంతపోయి "ఈయనకు మతిపోవుచున్నది కాబోలు! వెఱ్ఱివానివలె పలుకుచున్నాడు. తానింత న్యాయస్థుడైయుండ యెడల యిట్టినీచకార్య మేలచేయవలెను? పాపము చేయుటేకాని దానిని భరించుటచేతకాదు." అని వారిలో వారను కొనసాగిరి.

సూపరింటెండెంటు దయతలచి, ఆతనొకసారి నింటికి పోవుట కను మతి నిచ్చెను.

ఇంటివద్ద ఎక్కువసందడిగా నుండెను. జగదాంబ ప్రధానము నిమి త్తము కావలసిన పసుపు, కుంకుమ, పండ్లు, బట్టలు, మిఠాయిలు పళ్లె ములలో నొకచో సర్దించుచుండెను. ఇంతలో నరసింహారావక్కడకు వచ్చి "జగదా! రహస్యమంతయు బయలుపడిపోయినది. నేను పట్టు పడిపోతిని." అని దీనస్వరముతో పలికెను. జగదాంబ తెల్లపోయి ఆయనవైపొక్కసారి జూచెను. తోడనే ఆమెముఖము వెలవెల బారెను. కన్నులవెంబడి నీరు కాల్వలుకట్టి కార నారంభించెను.

నరసి—ఎందుకు విచారించెదవు? చేసినపాప మనుభవింపక తప్పునా? నా కిక నొకక్షణములో సంకెళ్లు తగిలించెదరు. నీ వెంతమా త్రము విచారింపకుము. చేసినపాప మనుభవించుటకు నేను సిద్ధపడియే యున్నాను. నా విషయమై మాత్రము వ్యర్థముగా ధనము ఖర్చుచేసి వకీళ్లను పెట్టవద్దు. ఈ పాపప్రాయశ్చిత్తము వలననేపుచ్చుకున్న ధనము పవిత్రమగును. ఈ సొమ్ము నీవు కమలవివాహమున కుపయోగింపుము. ఇంతలో నొక్కవస్తువైననను నా విషయమై ఖర్చుచేసిన నాకు చాలదుఃఖము కలుగును. నా గౌరవము, నా జీవితము, నాయుంచి

మీరు అన్నియు నాశనము చేసితిరి కాని, నేనొక ఋణమునుండి విముక్తుడ నైతినికదా ? యనియు, నా ప్రియమైన కమల సౌఖ్యపడును కదా ! యనియు సంతోషించుచున్నాను.

జగదాంబ రెండుచేతులతోను గుండెబాదుకొనుచు, తనదుర్దశకు మిక్కిలి విలపించుచుండెను. విచారమామెను పిడుగడచినట్లు చేసి వేసెను. ఆమె ఆకాశమునైపు జూచుచు, ఆర్తస్వరముతో "అయ్యో! ఇటువంటి ఆపద సంభవించునని కలలోనైన నెరుగనుకదా! మొదలే తెలిసినయెడల నాకుమార్తె నే బీదవానికో కట్టిపెట్టి యుందును. లేక విషముపెట్టి చంపివేసియుందును." అని ఏడ్చి యేడ్చి, క్రిందపడిపోయి తిరిగి నిద్రలోనుండి తెలుక్కుపడి లేచినట్లు లేచి, ఒక్కదాటునపోయి భర్త రెండుచేతులనుపట్టుకొని "ఈ రూపాయలను పెంటలోపోయుడు. వీటిని తీసుకునిపోయి, ఆ దుర్మార్గుడు, మహాంతు ముఖముమీద విసరి కొట్టుడు. నా కూతురుపెండ్లి కాకపోయిన పోవుగాక. అయ్యో! దేవుడా! నన్నెందుకు తీసికొనిపోవు? నా కిప్పుడు సిగ్గులజ్జలేమిటి? పోయి ఆదొరగారి కాళ్లమీద పడెదను."

నర—కావలసినదేదో అయిపోయినది. ఇప్పుడెంత దుఃఖపడినను లాభములేదు.

జగ—నన్ను దొరగారివద్ద కొకసారి రానిమ్ము. నేనాతనికాళ్లు, కడుపులు పట్టుకొని, "ఈ రూపాయలు మీరు తీసికొని, ఏ శిక్షవిధించెదరో దానిని నాకే విధింపుడు. నేనే దోషురాలను. ఈ పాపమంతయునాదే" అని మొఱపెట్టుకొనెదను.

నర—గట్టిగా కేకలువేయకుము. పైన అందరూ మూగుచున్నారు.

జగ—నన్ను దొరవద్దకెందుకు తీసికొనిపోరు? ఆయన తప్పక ఆడదాని మొఱను వినును.

నర—ఈలా విను. ఇది ఏడ్చుటకు సమయము కాదు. నేనిప్పుడే

అధికారుల చేతులలో జిక్కుకుంటిని. ఇక నేలాగున నైనను తప్పించు కొనుటకు వీలులేదు. ధైర్యముగానుండుము. పిల్లల నడలగొట్టకు. దైవ కృపయున్న యెడల తిరిగి కలుసుకొనెదము.

ఇట్లు చెప్పుచు నరసింహారావు పైకి పోబోవుచుండెను. ఇంతలో కుమార్తెలిరువురు ఆయనను పట్టుకొనిరి. జగదాంబ వారిని రెండు చేతులతోను కౌగలించుకొనెను. ముగ్గురుకలసి బిగ్గరగా నేడ్వనాగిరి. నరసింహారావు వీరిగతి ఇకనేమగునో యని యనుకొనుచు "హా! దైవమా! దీనరక్షకా! ఆర్తజనశరణ్యా! నీవే వీరికి దిక్కు" అని విచారింపజొచ్చెను.

ఒక్క క్షణములో నాతడు వారిని విడిపించుకొని పైకిపోయి రక్షక భటుల ఆధీనమయ్యెను.

తల్లి పిల్లలు మువ్వురు నేలబడి, విలపించి, విలపించి వివశులైరి. సంతోషముతో సందడిగానున్న గృహ మొక్కసారి శోకముతో నిండి పోయెను.

## 4

నరసింహారావన్న నాపట్టణములో నందరకు చాల గౌరవము. ఈదుఃఖ వార్త వ్యాపించగనే, పట్టణమంతయు గగ్గోలుపడసాగెను. కొందరు తగుమనుష్యులు, జామీనుమీాద ఆయనను విడుదలచేయుమని దొర గారిని ప్రార్థించిరి. కాని జామీనుమీాద విడుదలచేయుట కాయధి కారి ఇష్టపడలేదు.

వారమురోజులు తర్వాత నరసింహారావుమీాది కేసు విచారణ ప్రారంభించిరి. మహాంతుకూడ పట్టుపడిపోయెను. రెండు కేసులు కూడ కొన్ని నెలలవరకు జరిగెను, చివరకు రావుకు ఐదు సంవత్సరములు

శిక్ష విధించ బడెను. మహాంతునకు కేవలము సంవత్సరములు ఖైదు, ఆయన ముఖ్యానుచరులకు కొందరికి ద్వీపాంతరవాస శిక్షయు విధింపబడెను. శరభయ్యగారు తమ గొప్పసహాయులచే తమ కీర్తి యుపాయమును కాకుండ తప్పించుకొనెను.

జగదాంబ పుట్టినింటివారు రావుగారివారు వారిది రామవరము. ఆమెకు రామనాధమను నొక సోదరుడు కలడు. నరసింహారావుగారిని ధూర్తుడనియు, నీచుడనియు నిందించుటవలన రామనాధం వారియింటికి వచ్చుట మానుకొనెను. కాని ఈ దుర్వార్తలను విని, నిలువలేక చెల్లెలివద్దకు వచ్చి, ఓదార్చి ఆమెను నిద్దరు బిడ్డలను తనయింటికి తీసికొని పోయెను. నరసింహారావు వెళ్లిపోవుచున్నప్పుడు, లంచపు సొమ్మునుండి ఒక్క దమ్మిడీ యైనను, కేసువిషయమై ఖర్చుపెట్ట వద్దని ఖచితముగా చెప్పియుండెను. శిక్ష అనుభవింపక తప్పదని ఆతడదివరకే నిశ్చయించుకొనెను. కాని జగదాంబ ఊరుకొనలేక కేసు విషయమై ధనము విరివిగా వెరజల్లెను. చివరవరకు న్యాయవాదులు, విడుదల తప్పక యగునని ధైర్యము చెప్పుచుండిరి. జడ్జీగారి తీర్పు పైని హైకోర్టుకు అపీలుకూడ చేయబడెను. మహాంతునకు శిక్ష తగ్గలేదు, కాని నరసింహారావుకు మాత్రమొక సంవత్సరము శిక్ష తగ్గింపబడెను.

పుట్టినింటిలో నున్నప్పటికిని, జగదాంబకు చాల కష్టముగ నుండెను. ఆమె చాలరోజులకు పుట్టినింటికి వచ్చెను. కాని ఆమెను ప్రేమించి, ఆదరించు తలిదండ్రు లిప్పుడీలోకములో లేరు. అన్నిటి కంటె మిక్కిలి దుఃఖకారణము, ఆమె కక్కడ ఆదరసత్కారములు లేకపోవుటయే! ఆమె వదినెగారు కామేశ్వరమ్మ ఎల్లప్పుడు, మూతి ముడుచుకొని ధుమధుమ లాడుచుండెడిది. ఆమె నిత్యము ఇరుగు పొరుగులకు పోయి, ఆడపడచుమీద నేరములు చెప్పుచుండెడిది.

ఆమె కుమార్తె లీలావతికూడ కమలాసుశీలలతో చనువుగా నుండక యెసనుగా నుండిరి. ఇదియంతయు జూడ సౌర్యవంతురాలగు జగదాంబకు చాల కష్టముగ నుండెను.

ఇప్పుడు జగదాంబవద్ద లంచపుసొమ్ములో నొక్క దమ్మిడీయైనను మిగులలేదు. అందువలన కమల వివాహవిషయమై అన్నతో నేమియు అనలేకుండెను. ఈవిధముగ కొన్నిదినములు గడచిపోయెను. మొదట నరసింహారావు కమలకు నిశ్చయించిన సంబంధము తప్పిపోయెను. మొగపెండ్లివారు కమలను జేసికొనమని జెప్పివేసిరి.

రామనాథమునకు మేనకోడలి వివాహవిషయమైన చింత పట్టుకొనెను. ఆయనకు తీరికయైనప్పుడెల్లను, సంబంధము వెతకుటకు బయలుదేరుచుండెను. ఆతడు సంబంధముకొర కేదైనను, గ్రామమునకు వెళ్లినప్పుడు, ఆగ్రామములో పెండ్లిచేసికొన నాసపడు ముసలివారు మీసములకు రంగువేసికొని, మంచిబట్టలను ధరించి పడచువారివలె నటించుచుండిరి. తమ కుమారులకు వివాహముచేయ నిచ్ఛగించు తలిదండ్రులు తమ గొప్పదనము నగపరచుచు, మధ్యవర్తులచే సంబంధము విషయమై మాట్లాడించుచుండిరి. సంబంధము చేసికొనదలచు నాడువారు ఆతడు గ్రామములో నున్నంతకాలము చెరువునుండి నీళ్లు తెచ్చికొనుట మొదలైనపనులు మానివేసి ఇంటియందే యుండెడివారు.

కాని రామనాథమునకు మాత్రము, అంత విద్యావతియు, రూపవతియు నగు కమలను మూర్ఖుడును, పల్లెటూరి వాడును నగు వరునకు కట్టిపెట్టి, ఆమె జీవితమును దుఃఖములపాలు జేయుటకు మనసొప్పకుండెను. చివరకాతడు పట్టణములందు వరులను వెదకుటకు నిశ్చయించెను. అక్కడ కమలకు తగిన వరులగుపడుచుండిరి. కాని వారి ఆశనుజూచి ఆతడు హతాశుడగుచుండెను. రామనాథము

యొక్క కులగోత్రములు విని, ఇష్టములేనిచో పెద్దమనుష్యులతోనైనచో సంబంధముచేయుట కొరకనిరి. కాని పట్నమున లుండవలెననియు ముద్దు ముచ్చటలు తీరవనియు వెనుకతీసిరి. కొన్ని సంబంధములు రామనాథ మునకు నచ్చలేదు. తక్కువవారితో సంబంధముచేయుట కాతనికి మనస్కరించలేదు. ఈవిధముగ కొన్ని నెలలు గడచిపోయెను. సంబంధములు సెతకకపోక రామనాథుని ప్రాణము విసుగుచుండెను. తుద కాతడు రూపవిద్యాగుణములు లటులుంచి, గోత్రకులము సరిపోయిన వరుడు దొరకిన చాలునని చూచుచుండెను.

ఇంతలో మాఘమాసము వచ్చెను. ఒకనాడు ప్రొద్దుటే రామనాథము చెల్లెలివద్దకు వచ్చి, ఆమెతో "జగదా! మనోరథము పూర్తి యైనది. కళ్యాణపురపు సంబంధము నిశ్చయమైనది."

జగ—అబ్బా, ఇన్నిరోజులకు నీవు పడినశ్రమ ఫలించినది. పిల్ల వాడేమి చదువుచున్నాడు?

రామ—చదువు కాదు. ఉద్యోగమే! ఒక యంత్రాలయమునందు పదునేను రూపాయల ఉద్యోగములో నున్నాడు.

జగ—ఇల్లు వాకిళ్లున్నవా?

రా—పట్నములలో ఎవరి కిల్లు వాకిళ్లు ఉంటాయి! అందరు అద్దిళ్లలోనే ఉంటారు.

జగ—తల్లిదండ్రులు, అన్నదమ్ములు, మొదలైనవా రున్నారా?

రామ—తల్లిదండ్రులు చనిపోయిరి. అన్నదమ్ములు, అక్క చెల్లెండ్రు మరియెవ్వరు లేరు.

జగ—పెండ్లికొడుకు వయస్సెంత?

రామ—రమారమి మూడుపదు లుంటవి.

జగ—చూచుటకు రూపసియేనా?

రామ—పట్నములలో కురూపులే ఉండరు. అందమైన క్రాపిం

గులుతోనే, శుభ్రమైన బట్టలతోను షోకుగా ఉంటారు. ఇక గుణశీలములు, రూపసంపదలు, అడిగేదేమిటి? పట్నాలకైతే రత్నములు దొరుకుతాయి. వరుని పేరు రామప్రసాదరావు.

జగ—ఐతే, రెండవవివాహమై వుంటుంది.

రామ—కానీ, రెండవవివాహమే! ఐతేమాత్రం బాధేమిటి? పట్నములలో ముసలివారే వుండరు. యువకులు బాలకులుగ మారుతారు. ముసలివారు యువకులుగా మారుతారు. వారి విలాసచర్యలు చెప్పేదేమిటి? పట్నవాసస్థులు ఎప్పుడును యువకులుగానే ఉంటారు. ముసలివారు ఉండనేవుండరు

జగ—వారిది మర్యాదగల కుటుంబమేనా?

రామ—అత్యంతరమేమి! చింతలూరి పాపయ్యగారి మనుమడు. ఇంకా మూడేళ్లు రెండుమొన్నొక్కవే! బాగావున్నదా సంబంధము? నీకు నచ్చినదా?

జగ—(విచారముతో తలవంచి హీనస్వరముతో) మీకిష్టమైన నాకునిష్టమే.

౫

ఫాల్గుణమాసములో కమల వివాహము జరిగెను. వరుని జూడగనే జగదాంబ "అయ్యో! కూతురి గొంతుక తెగనిక త్తితో కోసితిని గదా!" అని మిక్కిలి దుఃఖించెను.

మరియొక మాసములోనే కమల అత్తవారింటికి వెళ్లెను. ఆయిల్లు చూడగానే ఆమెకు గుండెలలో రాయి పడెను. ఇల్లు చాల చిన్నది. చిన్న గదులు రెండు, ఒక వంటవసారామాత్రమే యుండెను. గోడలన్నియు చౌడుపట్టి యుండెను. ఇంటిలోనికి వెలుతురు గాని, గాలి

గాని వచ్చుటకు ఎక్కడను కిటికీలు లేవు. ఆ యిల్లొక చిన్న సందులో నుండెను. కాలువల కంపు భరింప శక్యము కాకుండెను. ఆ యింటికి మూడు రూపాయలద్దె. ఇంటిలో నొక ముసలియామె సంరక్షకు రాలుగనుండి, అన్ని పనులు చక్కబెట్టు చుండుటచేత కమల యెట్టి సంసార తాపత్రయము లేక నిశ్చింతగ కాలము గడపుచుండెను. కాని ఎండకాలములో కలరా వ్యాపించినందున, ముసలామె దానికి కబళమయ్యెను. అప్పుడు కమలకు చాల చిక్కు సంభవించెను. ఐదారు రూపాయ లిచ్చినగాని వంటకత్తె దొరకదు. రెండుమూడు రోజులీ కారణముచేత పొయ్యిలో పిప్పినను వెయ్యలేదు. పాపము! రామప్రసాదు కమలకేపనియు చెప్పలేక పోయెడివాడు. అందువలన రెండుమూడు రోజులు పూటకూటింటినుండియే అన్నము తెప్పించెను. కమలయందలి మోహముచే ఆతడామె నెల్లప్పుడును సంతోషపెట్టుటకే ప్రయత్నించుచుండును. నాల్గవరోజు రామప్రసాదు తెల్లవారు ఝాముననే లేచి, గిన్నెలు, చెంబులు తోమి, ఇల్లువాకిలి శుభ్రపరిచి బిందెలలోనికి నీళ్ళుతోడి యుంచెను. కమల నిద్రనుండిలేచి యీపని యంతయు జూచి నిర్ఘాంతపోయి, యీపని తన భర్తయే చేసె నని తెలిసికొని చాల నొచ్చుకొనెను. సాయంత్రమామెయే భర్త యింటికి వచ్చుసరి కింటిపని యంతయు స్వయముగా జేసెను. పాప మామె యెన్నడును పనిపాటలు చేసి యెరుగదు. అందు త పని చేయలేక యొకప్పుడు దుఃఖపడుచుండును. కాని కొద్దిదినములలో కమలకు పనులుచేయుట అలవాటయ్యెను. ఇప్పుడామెకు పనులు చేయుట కొంత సులువుగానే యుండెను. ఆమె పనిపాటలు జూచిన రామప్రసాదుకు ప్రపంచము జయించినంత సంతోషముగనుండెను. ఆతడు తన మిత్రులతో "నిజముగా నాభార్య మణిపూసవంటిది. అంత గొప్పయింటి పిల్లయైనప్పటికి అంతపనియు తానే స్వయముగా

జేయును. ఇక ఆవంట కమ్మదనము చెప్పలేను. అమృతమే!'' అని తన భార్యను ప్రశంసించుచు చెప్పుచుండును. ఆతనికి నెలజీత మంత గానే సొమ్మంతయు కమలచేతికే యిచ్చివేసెను. ఇక నామెయానంద మేమనిచెప్పను! ఇక మాటికి మాటికి భర్త నొకడమ్మిడీయైన నడుగ నవసరములేదు. ఆరూపాయల నామె తన యిష్టమువచ్చినట్లు ఖర్చు పెట్టవచ్చును, కొనుక్కొని చిరుతిండ్లు కూడ తినవచ్చును. ఆమెకు సంసారము పొదుపుచేయు నేర్పులేదు. అందువలన అవస రానవస రములు జూడకుండ ఖర్చుపెట్టసాగెను. ఈ కారణముచేత నెలజీత మంతయు నిరువది రోజులలోనే ఖర్చైపోయెను. రామప్రసాదీసంగతి విని నిర్ఘాంతపోయెను. ఇప్పుడు నెలాఖరువరకు గడచుట యెట్లు? ఈ సంగతి తలచుకొనగనే ఆతని గుండెలలో పెద్దరాయి పడినట్లా యెను. నిలుచున్నపాటున సొమ్మెక్కడ దొరకును? రామప్రసాదు స్వతహాగా లోభిఐనను భార్యమీద ప్రేమచే జీతమంతయు ఆమె చేతిలో పోసెను. భార్య ఫలహారము తయారుచేసినప్పుడెల్ల ఆతనికి కంటకముగా నుండును. పప్పులోనికి మరియొక గరిటెడు నెయ్యి ఎక్కువవేసిన, ఆతనికి గుండెలలో శూలముపెట్టి పొడిచినంత కష్ట ముగా నుండును. కమల అనవసరముగ ఎక్కడెక్కువ వండునోయని. ఆతని దృష్టి యెల్లప్పుడును వంటపొయ్యి దగ్గరనే యుండును. పప్పు, బియ్యము మొదలైనవి అశ్రద్ధగా నిక్కడ, అక్కడ పారపోసిన ఆత నికి చాల చికాకుగ నుండెడిది. కాని కమల మోహనరూపము జూడ గనే ఆమెను ఏమనుటకును ఆతనికి నోరు వచ్చెడిది కాదు.

ఆ రోజు ఎక్కడతిరిగినను అప్పు పుట్టనందున రామప్రసాదు హతాశుడై ఇంటికివచ్చి భార్యతో "రూపాయలను సులభముగ నీవు ఖర్చు పెట్టివేసితివి. ఇప్పుడు డబ్బెక్కడినుండి వచ్చును?'' అని విచారముతో ననెను.

కమ—నేనేమి మిఠాయి లనవసరముగ ఖర్చుపెట్టితినా?

రామ—అనవసరమనుకొంటినా? గాని ఆ సొమ్ము నెల ఖర్చుకు సరి పోవునట్లు ఆలోచించి నీవు ఖర్చుపెట్ట వలసియుండెను.

కమ—అంత తక్కువ సొమ్ముతో నెలరోజు లెట్లుగడచును?

రామ—ఐతే నన్నేమి చేయమన్నావు? నా కంతకంటె శక్తి లేదు.

అంతకంతకు మాటలు పెరిగిపోయెను. చివరకు శౌర్యవంతురాలగు కమల కోపముతో తన పోచీని తీసి తనఖాపెట్టి సొమ్ము తెమ్మని యిచ్చెను. రామప్రసాదు చికాకుపడుచు ఆవస్తువును తీసికొని వెళ్లిపోయెను.

ఇంతటినుండి పాపము కమలయొక్క జీవనము కష్టమయ్యెను. ఆమె చిన్నతనములో అతిగారాబముగ పెరిగి కావలసిన నగలెల్ల పెట్టుకొని ఇష్టమువచ్చిన బట్టల కట్టుకొనేది. ఆమెకు చిన్నప్పటినుండి చిరుతిండ్లు బాగుగా అలవాటు. కాని యిప్పుడు దొంగతనముగ తానొక్కతెయె తిన మొదలుపెట్టెను.

## ౬

క్రమముగా కమలయొక్క సౌందర్యాతిశయములు, తెలివితేటలు ఆపేటలో వినికిరయ్యెను. ఇరుగు పొరుగు స్త్రీలు వారి యింటికి వచ్చి ఆమెతో స్నేహముచేయు నారంభించిరి. కమల వారియెదుట షోకుగా నుండవలెననియు, వారిచే గౌరవము పొందవలెననియు, తాపత్రయ పడుచుండెడిది. ఏలాగైనను గొప్పయింటిపిల్ల అగుటవలనను, ఆమె విడువడియుండు డాబు దర్పములు, గొప్పతనము కనబడుచుండెను

వారందరు ఆమెను గౌరవభావముతో జూచుచుండిరి. వారు తనను గొప్పచేయుటచేత ఆమె మనస్సులో ఆనందించి వారి ఎదుట వారి గొప్పలు చెప్పుచుండెడిది. తన పుట్టినింటినుండి తెచ్చిన పట్టుచీర, పట్టుజాకెట్టు వారందరు వచ్చినప్పుడు కట్టుకొని చూపుచుండెడిది. తనకున్న మంచి బట్టలతోను, ఎదురుగానున్న దండెములపైని అందరకు అగుపడేలాగున వ్రేలాడవేసి తన దర్జాను కనబరచుచుండెను.

ఎవరు ఏ క్రొత్త బట్టను కొనుక్కొన్ననూ, ఎవరు ఏ క్రొత్త నగ చేయించుకొన్ననూ, తొలుత కమలకు జూపించి, ఆమె సలహాను పొందుచుండిరి. వారికామె బాగుగా సలహాలనిచ్చెను. కాని లోపల తన దురదృష్టమునకు మిక్కిలి విచారించుచుండెడిది. "అందరు క్రొత్త క్రొత్త నగలు, బట్టలు కొనుక్కొనుచుండగా మాకు భోజనమునకు జరుగుటయే కష్టముగానున్నది. అయ్యో! ఏమి! నేను వీరందర కన్నను కూడ నిర్భాగ్యురాలనా!" అని విచారించి, తన దుర దృష్టమును నిందించుకొనుచుండెడిది.

ఈ ప్రపంచమంతయు భోగవిలాసములతోనే యున్నదని ఆమె భావించెను. కాని తృప్తియే సుఖదాయకమని ఆమె ఎరుగదు. ఆమె హృదయము అసంతృప్తితో ఎల్లప్పుడు వ్యాకులపడుచుండెను.

ఈదినములలో రామప్రసాదు డబ్బు కొరకు చాల తంటాలు పడుచుండెను. యంత్రాలయమునుండి వచ్చిన తోడనే ఒకసెట్టివద్ద లెక్కలను వ్రాసి రాత్రి ఎనిమిదిగంటలకు ఇల్లు చేరుకొనుచుండెను. ఆపద్దులు వ్రాయుటవలన ఆతనికి మరి ఐదురూపాయలు నెలకు దొరకుచుండెను. ఎంత కష్టపడుచుండినను సంసారము జరుగుట చాల కష్టముగానుండెను. "అయ్యో ఏమియు వెనుక వేయలేక పోవు చున్నానే గదా!" యని ఆతడు విచారించుచున్నప్పుడు కమల ఆతని వద్దకు వచ్చి తన దురదృష్టమును నిందించుకొనుచుండును.

ఆమెకు తన భర్త తనను ప్రేమించుచున్నాడను సంతోష మున్నను పట్టుబట్టలు లేవనియు, వాసన నూనెలు లేవనియు ఆమె యాతని నెల్లప్పుడు వేధించుచుండెను. ఇంక నూరుకొనిన లాభము లేదని ఆమెను ఖాయిదాపెట్టుట కాతడు నిశ్చయించుకొనెను.

కమల తన స్నేహితురాండ్రకుపదేశించుటయే గాక వారి వలన గూడ కొన్ని సంగతులు నేర్చుకొనెను. మనము సాంసారికజీవనము నెడల ఎంత అజ్ఞానులము? సంసారమును నడుపుట కెట్టి శిక్షయు నవసరము లేదని తలచుచున్నాము. బొమ్మలతో నాడుకొను బాలికలును స్నేహితురాండ్రతో సంతోషముగా కాలము గడపు కన్యకలును, గృహస్థురాండ్రగుటకు తగిన వారని తలంచుచున్నాము. లేశమైన నాలోచింపక అజ్ఞాన బాలబాలికల మెడలకు సంసారమను పెద్ద బరువును కట్టుచున్నాము. ఇట్టి స్థితిలో మన హిందువుల సంసార జీవనము దుఃఖభాజనమగుటలో నాశ్చర్యమేమున్నది?

ఏ స్త్రీలతో కమల స్నేహము చేయుచున్నదో వారు తమ భర్తలను తమ సౌఖ్యముల దీర్చు యంత్రములని తలంచెడి రకమువారు. భర్త ఎటువంటివాడైనను సరియే. తన భార్యకు సొగసైన నగలను, అందమైన బట్టలను, కావలసిన చిరుతిండ్లను కొనియిచ్చిన యోగ్యుడనియు లేనియెడల చేతకానివాడనియు వారి భావము. కమల ఈ యుపదేశమునే వారి వలన పొంది, తాను కోరిన వస్తువులు భర్త కొని ఇవ్వలేనప్పుడును, ఏ విషయమందైనను తనను చీవాట్లు పెట్టినప్పుడును, ఆమె ఆతనికి పురుషుల యొక్క విధులను గూర్చి ఉపదేశించుచుండెను.

ఆ వీధియందు రసిక పురుషులకు షోకుదారులకు లోటులేదు. బడినుండి వచ్చి పోవు యువకులు కమల ఇంటివైపు జూచుచు పోవుచుండెడి వారు. కొందరు రసికు లటువైపు పోవునప్పుడు శృంగార

గీతములను పాడుచుండెడి వారు. కమల ఎంత పనిలోనున్నను ఆ పాటలు చెవుల బడగానె గుమ్మము వద్దకు పోయి ప్రక్కనుండి తొంగి చూచుచుండెడిది. ఆమె చంచలహృదయమున కట్లు చూచు చుండుట వలన ఆనందము కలుగుచుండెడిది. కమల చెడ్డతలంపుతో కాక కేవలము తన సౌందర్యమును యౌవనము నితరులకు జూపి వారి హృదయముల నాకర్షింప జేయుట కిట్లు జేయుచుండును. ఇతరు లామెను జూచి భ్రమించుటయే ఆమె కానందము.

## ౨

కమల ఇంటి యెదుట రామతిలకమను వేశ్య యొక్క మేడ కలదు. ఆమె దినమున కొక్కరీతి సింగారించుకొనుచు రసికుల హృదయముల నాకర్షించుచుండును. ఆమె గృహ మెల్లప్పుడును, సంగీతములతోను, రసికుల హాస్యసల్లాపములతోను, ప్రతి ధ్వనించుచుండును. అప్పు డప్పు డామె గుఱ్ఱపు బండిపైని షికారునకు కూడ పోవుచుండును. కమల, ఆమె నెల్లప్పుడు నీచముగ జూచుచు, అసహ్యించుకొను చుండును. వేశ్యలు కులహీన లనియు, దుశ్చారిత్ర లనియు, తమకాశ లనుచే యువకులను తమ మాయలలో పడవేసికొందు రనియు, ఆమె యభిప్రాయము. రామతిలక యింటికి పెద్దమనుష్యు లెవ్వరును రారని యును, ఎవ్వరో రసికులు మాత్రము వచ్చుచుందురనియు, ఆమె తలచుచుండెను. రామతిలకయు పెక్కుసార్లు కమలను తనయింటికి రమ్మని సంజ్ఞ చేసి పిలచెను. కాని ఆమెతో మాట్లాడుటకూడ అవమాన మని తలచి కమల అటువైపైనను జూచుట మానివేసెను.

“నేను దరిద్రురాలను, దీనురాలను, ఐనప్పటికి ఉత్తమ కులస్థురా లను. నన్నందరును సన్మానించి గౌరవించెదరు. ఈ వేశ్య ఎంత

రా. ప్ర.—మర్యాద లోపమని తలచిన నెందుకు వచ్చెదరు?

కమ—మీరుకూడ అక్కడకు వెళ్లుటకు సంకోచింపలేదా?

రా. ప్ర. —ఇందరు పెద్దమనుష్యులు వెళ్ళగ నాకెందుకు సంకోచము? అదిగాక మా షాహుకారు కూడ నీసభకు వచ్చినాడు.

కమ—(విచారముతో) వేశ్యలను తగు మనుష్యులు నీచదృష్టితో జూచెదరని నేను భావించితిని.

రా. ప్ర.—ఔను. అటువంటివారు కూడ అక్కడక్కడ కలరు. ఇప్పటి ఆంగ్లేయ విద్యార్థికులు, వేశ్యల నంత నీచదృష్టితో జూచుచుండుటలేదు. అదికాక రామతిలకము పాటకచ్చేరీయన్న ఈ పట్టణమునం దెంతయో ప్రసిద్ధి.

ఆకాశమంతయు మేఘములచే నావరింపబడియుండెను. గాలిలేక ఆకైనను అల్లాడుటలేదు. దినమంతయు శ్రమపడి పనిచేసిన రామప్రసాదు ప్రక్కచేరగనే గాఢనిద్ర జెందెను. కాని కమలకుమాత్రమీయాలోచనలవలన చాల సేపటివరకు నిద్ర పట్టలేదు. మరుసటి దినము సాయంకాలము, మామూలుప్రకారము కమల వీధియరుగుపై కూర్చుండెను. ఆ సమయమున రామతిలకముకూడ వీధి వసారాలోనికి వచ్చెను.

కమ—(ఆమెను పలుకరించి) రాత్రి మీయింటివద్ద సభ బాగుగ జరిగినదే.

రామ—(తన గొప్పతనమంతయు ఆమెకు బోధపడినదికదా యను గర్వముతో చిరునవ్వునవ్వుచు) ఔను. బాగానే జరిగినది. రాత్రి దేవునకు భోగము చేయించిన మిఠాయి మీకు పంపెదను. బ్రాహ్మణులచేతనే తయారు చేయించితిని. పుచ్చుకొనుటకేమీ అనుమానించకండి.

కమ—(నవ్వుచు) సరే. పతే పంపు.

# ౮

కమల అత్తవారింటికి వచ్చి సంవత్సర మారుమాసము లయ్యెను కాని యింతవరకు ఆమెకు పుట్టింటికి పోవు భాగ్యము కలుగలేదు తల్లివద్దనుండి అప్పుడప్పు డుత్తరములు మాత్రము వచ్చుచుండెను. మొదటి రోజులలో కమల తాను సౌఖ్యముగ నుంటిననియు, తన కొరకు బెంగపెట్టుకొన వద్దనియు, తల్లికి జవాబు వ్రాయుచుండెను. కాని ఇప్పుడామె వ్రాయు నుత్తరాలలో తన దురదృష్టమును వెళ్ళ బోసుకొనుచుండెను. "నేనేమి అపకారము చేసితినని నన్నీనూతి లోనికి త్రోసితిరి ? నా గొంతుక తెగసిగ త్రోసినారు. ఉండు టకా ఇల్లులేదు. కట్టుకొనుటకా శుభ్రమైన బట్టలేదు. కడుపునిండ తినుటకైనను అన్నములేదు. నాకర్మమిట్లు కాలినది." అని దుఃఖ పడుచు వ్రాయుచుండును.

పూర్వమువలె నిప్పు డామె తన పుట్టినింటివారి గొప్పల నిరుగు పొరుగు వారితో చెప్పుట మానివేసెను. పూర్వము పొగడిన నోటితోనే భర్తను వారిముందు నిందించుచుండెను. "నేను దిక్కులేని దానను. మావాళ్లు నేను చచ్చిపోతి ననుకొంటిరో ? లేక ఇక్కడ సంపదలతో తులతూగు చుంటిననుకొంటిరో ? నాయుబుసైనను తలపెట్టుట మానివేసిరి. నాబాధలు దేవునికే యెరుక. ఎవరితో చెప్పుకొనను ?" అని వారివద్ద తనదుఃఖమును వెళ్ళబోసుకొను చుండును.

కమల మునుపటివలె తనభర్త ఎడల గౌరవము జూపుట మాని వేసెను. తనదుర్దశ కంతకును, ఆతడే కారకుడని ఆమె యుద్దేశ్యము. ఒక్కొక్కప్పుడామె చాల ప్రొద్దెక్కిన తర్వాత లేచి, వేళకు వంట చేయకపోవుటవలన రామప్రసాదు భోజనముచేయకయే పనికిపోవలసి

అప్పుడప్పుడు తన స్నేహితురాండ్రవద్ద రామాయణమును జదువుచు అందలి నీతిని వారికి బోధించుచుండెను. దీనివలన ఆమెమనస్సునకు కొంతశాంతియు, తృప్తియు కలుగుచుండెను.

అది చైత్రమాస మగుటవలన శ్రీరామనవమి ఉత్సవము లతి వైభవముతో జరుగుచుండెను. ఒకరోజు కమల తన స్నేహితురాండ్రతో రామమందిరము జూచుటకు వెళ్లెను. మందిరములు కడు సొగసుగ నలంకరింపబడి యుండెను. విద్యుద్దీపములకాంతియం దవి మరింత రమ్యములుగ కనబడుచుండెను. ఆరోజున రొక్కుటమెక్కువగ నుండెను. ఇసుకవేసిన రాలుటలేదు. ఒక మందిరమువద్ద పాటకచేరి జరుగుచుండెను. సంగీతము అతిమధురముగ వినబడుచుండెను. కమల మందిరమునుండి పాట యెవ్వరుపాడుచుండిరో యని కుతూహలముతో తొంగిచూచెను. రామతిలకమే సభ్యులమధ్య కూర్చొని రాగాలాపన జేయుచుండెను. సభ్యులలో చాలమంది పట్టెనామముల పెట్టికొనియు, విభూతి రాసికొని రుద్రాక్షమాలలను ధరించియు, పరమభక్తులవలె కనబడుచుండిరి. ఇంకను ఆసభయందు రకరకముల పెద్దమనుష్యులు కూడ కలరు. వీరిలో చాలమంది ప్రతిదినము గోదావరిస్నానము జేయుచుండుట జూచి వారెంతయో నిష్ఠాపరులని కమల యనుకొనుచుండెను. కాని అటువంటివారే వేశ్యాగానమువలన తన్మయత్వమునుబొంది స్వర్గసుఖము ననుభవించుచుండిరి. ఆవేశ్య ఎవరి వైపు తన చూపులను బరపి, అభినయము పట్టిన, వారు ధన్యులమని భావించి సంతోషించుచుండిరి. ఈదృశ్యము కమల నత్యాశ్చర్యవంతురాలినిగ జేసెను. ఆమె దేనిపై నాధారపడి, తాను ధన్యురాలని భావించెనో ఆగర్వమిప్పుడు సిథిలమయ్యెను. కమల యిక నొకక్షణమైన నక్కడ నిలువజాలకపోయెను. ఆమె తన మనస్సునందు, "ఏ వేశ్యకంటె నే నధికురాలనని భావించికొంటినో ఆవేశ్యయొక్క కృపాకటా

త్రమును, ఒక్క ధనమే కాక ధర్మముకూడ కాంక్షించుచున్నది. నిష్ఠాపరులు కూడ ఆమె నాదరించుచున్నారు. నీచురాలైన ఈ వేశ్యకు పవిత్రమైన దేవాలయములయందును, భక్తుల సభల యందును, సన్మానము జరుగుచుండగ, పవిత్రవంతురాలనని గర్వపడు చున్న నాకు, నిచట నిలుచుటకైనను, స్థలములేదా ?" అని తలపోసెను.

కమల ఇంటికివచ్చి విసుగుతో రామాయణమును నొక మూల బారవైచెను. ఇప్పుడు వ్రతములనుండియును, గోదావరిస్నానము నుండియును, ఆమె మనస్సు తిరిగిపోయెను. నావికుడులేని నావవలె ఆమె మన స్సిటునటు కొట్టుకొనుచు గందరగోళము పడుచుండెను.

౬

రామప్రసాదుని స్థితి చోరులమధ్య రూపాయల సంచినిబెట్టి దానిని కాపాడువాని విధమున నుండెను. ఇదివరకాతడు కమలను మిక్కిలి ప్రేమించుచుండెను. కాని ఇప్పుడామె ముఖముజూచిన ఆతని ఒడలు మండుచుండెను. ఇదివరకాతని సుఖమయునిగ జేయు ఆమెసౌందర్య మిప్పు డాతనిని దగ్ధముచేయు విషజ్వాలవలె నుండెను కమలను సుఖవంతురాలినిగ జేయుటకు రామప్రసాదు తనసర్వశక్తుల ప్రయత్నించెను కాని తనశక్తికి మించినపని నతడు చేయగలడా ? ఆమె గగన పుష్పములను కోరిన తేగలడా ?

రామప్రసాదున కిప్పుడిల్లు మార్చివేయవలెనను తలంపుపుట్టెను. ఈ యింటికి కొంచెమైనను వాకిలిగాని, పెరడుగాని లేదు. వీధిగుమ్మములో కూర్చొనవద్దని కమలతో జెప్పినప్పుడామె తెఱుకు బెఱుకు లేకుండ, "నేనా చీకటికొట్లో రోజల్లా పడిఉండలేనని" జవాబు చెప్పు చుండెడిది. ఇంటికి వాకిలియున్న యీజవాబు చెప్పలేకుండెడిది

యనియు, యిరుగు పొరుగుల చెడుసహవాసములవల్ల కమల యింత వరకు మాఱిపోయినదనియు, ఇల్లుమార్చిన నీ బాధ ఉండదనియు హితవుద్దేశించెను. ఆతడు మరియొక ఇంటికొరకు కూరంతయు గాలించెను. ఎక్కడను తగిన ఇల్లుదొరకలేదు. దొరకినను అద్దెమాట వినతోడనే యూరుకోనవలసి వచ్చుచుండెను.

ఒకనాడు రామప్రసాదు రాత్రి ఎనిమిదిగంటలకు ఇంటికి వచ్చుసరికి రామతిలకము తనమంచముపై కూర్చొని నవ్వుచు కమలతో మాట్లాడుచుండెను. ఈ దృశ్యమును జూచినతోడనే కోపముచే ఆతనిదేహము గడ గడ వడకసాగెను. రామతిలక మాయనను జూచినతోడనే లేచి నిలబడి, "సెట్టిగారివద్ద మీరు గుమాస్తాగా నున్నట్లు నాకు తెలియనే తెలియదు. తెలిసిన ఎడల ఈపాటికి మీ గురించి ఆయనతో సిఫారసుచేసి యుందును. సంగతి యిప్పుడే అమ్మగారివల్ల తెలిసినది. నేనంటే సెట్టిగారికెంతో అభిమానము." అని వినయముగ పలికెను. ఈ మాటలు వినగానే రామప్రసాదునకు, ఒరసిన పుండుపై నుప్పుజల్లినట్లయ్యెను. అతడు తనలో, నేనీ సానిదానిచేసిఫారసుచేయించుకొనునంతటి అప్రయోజకుడనా? ఇట్టి నీచపు సిఫారసులు నాకక్కర లేదు." అని అనుకొనుచు, ఆమెకు జవాబుచెప్పకయె నిర్లక్ష్యభావముతో అక్కడనుండి వెళ్లిపోయెను. ఆతనివైఖరి జూడగనే ఏదో గందరగోళము పుట్టకమానదని కమలకుతోచెను. కనుక ఆమె అందుకు సిద్ధపడియే యుండెను. రామప్రసాదు కోపమడచుకొనలేక రామతిలకము వెళ్ళిపోవగనే తనభార్యతో కఠినముగ, "నీకేమియు బుద్ధిలేదు. బొత్తిగ లక్ష్యపెట్టకుండ నున్నావు. రామతిలకముతో స్నేహము చేయవద్దని నీకెన్నిసార్లుచెప్పను?

కమ——(సావధానముతో) తప్పేమి? ఆమె మర్యాదలో తక్కువా? ధనములో తక్కువా? ఆమెతో మాట్లాడుటవలన నాక్కు నష్ట

మేమియు నగుపడలేదు. ఒకవేళ ఆమె చెడ్డదైయైనను మాట్లాడి నంతమాత్రమున మనకేమి నష్టము? నిజముగ నామెతలచిన, మన వంటివారిని పదిమందిని పోషించగలదు.

రా. ప్ర—నీవుతిరిగి నన్నెదిరించి, ఆ తలతిక్కమాటలనే ప్రారంభించుచున్నావా? ధనమున్న, కులగౌరవములు, మానమర్యాదలు రావు.

కమ—ఐతే, ధర్మప్రవర్తనవలన నివి వచ్చునా?

రా. ప్ర—ఆమె మహాధర్మప్రవర్తన కలదని అనుకొనుచున్నావు కాబోలు!

కమ—అదేమో ఆ సంగతి భగవంతునకే ఎరుక. కాని ధర్మపరులందరును, ఆమెను గౌరవించుచున్నారు. శ్రీరామనవమి యుత్సవములలో గొప్పపండితులు, నిష్ఠాపరులు, సభయందామె పాటపాడుచుండగ నేనుజూచితినిగాని ఎవరును ఆమెను అసహ్యించుకొనలేదు అగౌరవమును జేయలేదు. వారామెను ఆదరించుటయెగాక, ఆమె తమవైపుజూచినను, తమతో మాట్లాడినను మహాభాగ్యమని తలచుచుండిరి. వారామెను మనస్సునందాదరించుచుండిరో, తృణీకరించుచుండిరో దైవమునకే యెరుక. కాని చూచుటకు మాత్రము అందరును ఆమెను గౌరవదృష్టితో జూచుచున్నట్లగపడెను ఈప్రపంచములో పైసంగతులనుబట్టి చూచెదముకాని ఎవరిమనస్సులలో నేమున్నదో ఎవరికెరుక?

రా. ప్ర—ఐతే, నీవు పెద్దపెద్ద నామముల దిద్దినవారిని, రుద్రాక్షమాలలు మెడలో ధరించినవారిని మహాభక్తులనియు, నిష్ఠపరులనియు, తలచుచుంటివి కాబోలు! ఈ రోజులలో నీ వేషములన్నియు ధూర్తులనే ఆశ్రయించియున్నవి. వారితిలకములు, రుద్రాక్షమాలలు, విభూతిపెండెకట్లుజూచి ప్రజలు మోసపోవుచున్నారు. వీరు మహామూర్ఖులు,

నీచులు. భక్తియొక్కయు, ధర్మముయొక్కయు పవిత్రనామములను కళంకితము జేయుచున్నారు. భక్తులమనియు, విరాగులమనియు, పేర్లు పెట్టుకొని, భోగవిలాసముల ననుభవించు మహాపాపాత్ములు. రామతిలకముయొక్క ఆదరసన్మానములు వీరియొద్ద కాక మరియెక్కడ జరుగును?

కమ—(సం.భావముతో) ఈ మాటలన్నియు నన్ను తమాషా చేయుటకు చెప్పుచున్నారా? లేక నిజమా?

రా. ప్ర—(ఆమె అమాయకత్వమునకు జాలిపడుచు) లేదు. కమలా నేను నిజమునే చెప్పుచున్నాను. మన దేశమునందు సజ్జనులు లేకపో లేదు. కాని వారి వారిసంఖ్య చాలతక్కువ. వారు దయామయులు. సద్వర్తనులు. నిరంతరపరోపకారతత్పరులు. రామతిలక మప్సరసవలె శృంగారించుకొని వారివద్దకు వచ్చినను, వారామెవైపు కన్నెత్తియైనను జూడరు.

కమల నిర్ఘాంతురాలై తనభర్తయొక్క మాటలను తనమనస్సునందే తర్కించుకొనసాగెను.

## ౧౦

ఆ మరునటిదినమునుండియు కమల వీధిగుమ్మము వైపైనను వెళ్ళుట మానివేసెను. రసికయువకులు మామూలు ప్రకారము శృంగార గీతములు పాడుచు ఆమె గుమ్మముప్రక్క నుండియే పోవుచుండిరి. కాని కమలమాత్రము, మునుపటివలె వారి కగుపడుటలేదు. ఆమెను రామతిలక మెన్నియోసార్లు తన యింటికి రమ్మని పిలచెను. కాని శరీర మస్వస్థతగా నున్నదనియో, మరి యేదైన వంక జెప్పియో ఆమె యింటికి వెళ్ళకుండ తప్పించుకొనుచుండెను. రెండు మూడుసార్లు

రామతిలకమే వీరి యింటికి వచ్చెను. కాని కమల మునుపటివలె ఆమెతో మనస్సువిప్పి మాట్లాడలేదు.

కమల అత్తవారింటికి వచ్చి రెండు సంవత్సరములాయెను. ఆమె పట్టుచీరలు, జాకెట్లు శీఘ్రముగ చినిగిపోయినవి. ఇరుగు పొరుగు వారు మునుపటివలె నాదరముతో ఆమె మాటలు వినుటలేదు. ఆ బట్టలతోనే ఆ గౌరవముకూడ పోయినది. అందువలన ఆమె ఇప్పుడు మునుపటివలె నిరుగు పొరుగిండ్లకు వెళ్ళుట మానుకొనెను. వారు కూడ నిప్పుడంత తరచుగ నామె యింటికి వచ్చుటలేదు. కొంతసేపు చదువుకొనుచు, కొంతసేపు నిద్రపోవుచు కమల దినమంతయు నింటి యందే కాలము గడుపుచుండెను. ఆ చీకటిటిలో నెల్లప్పుడు పడి యుండుటవలన ఆమె కనారోగ్యము కలుగ నారంభించెను. తరచుగ జ్వరముచేతనో, తలనొప్పిచేతనో బాధ పడుచుండెను. సాధారణపు టింటిపనులుకూడ చేయుట కామెకు శక్తి లేకుండెను. శరీరము నీర సించి కమలమువంటి కమల ముఖము వాడి కళావిహీనమయ్యెను.

ఇందువలన రామప్రసాదు మనస్సు కలతగా నుండెను. అప్పు డప్పుడాయన కమలపై చికాకు పడుచు, "ఎప్పుడు చూచినను నీవు పరుండియే యుండెదవు. నాకు వేళకింత అన్నమైనను, వండిపెట్ట లేనప్పుడు నీవుండి యేమి ప్రయోజనము?" అని అనుచుండును. కాని వెంటనే ఆమె స్థితిని జూచి విచారపడి, తన స్వార్థపరత్వమునకు తను తానే నిందించుకొనుచుండును.

క్రమ క్రమముగ నీ యుపరి శుభ్రపు గాలివలననే కమలకీ రోగము సంభవించెనని ఆతనికి బోధపడెను. పూర్వము వీధి గుమ్మముపద్దకు వెళ్ళవద్దనియు, గోదావరీ స్నానమునకు పోవద్దనియు ఆటంక పరచిన ఆయనయే ఇప్పుడు వీధి తలుపులు తీసివేయుచు ఆమెను గోదావరీ స్నానమునకు వెళ్ళవలసినదని బలవంత పెట్టు

చుండెను. కమల సరసముగానున్నను, ఆయన బలవంతమును పలుక నిత్యమును స్నానమునకు పోవుచుండెను. వాడిపోయిన మొలక నీరు తగులగనే తిరుగ చిగుర్చ నారంభించెను.

అది హేమంతమాసము. ఒకరోజు ప్రాతఃకాలమున కమల యిరుగు పొరుగు వారలతో కలసి స్నానమునకు బయలు దేరెను. మార్గమందు జంతు ప్రదర్శనశాల, పూలతోట కలవు. అక్కడ పెక్కు రకముల జంతువులు, అనేక విధములగు పక్షులు వివిధములగు పాములుకలవు. స్నానమునుండి తిరిగి వచ్చునప్పుడు, ఆ వింతలను జూచుటకు వారు తమలో తాము నిశ్చయించుకొనిరి. కమల ఎన్నడును ఏజోలికిని పోక తిన్నగా యింటికి వచ్చెడిది. కాని ఆ రోజున సఖురాండ్ర బల వంతమువలన తానుకూడ వారితో పోవుట కొప్పుకొనెను.

కమల ఆవింతలనుజూచి అలసి అక్కడ వేయబడిన బెంచీపై కూర్చుండెను. ఆతక్షణమే “ఆ బెంచీపైన కూర్చున్న వారెవరు? సర్కారు ఆ బెంచీ నీకొరకే వేయించితి రనుకొంటివా? అక్కడనుండి వేగము లేచిపో.” అను కఠోరవచనము లామె చెవులబడెను. కమల బెదురుతో వెనుదిరిగి చూడగా, ఆగసరుచున్న తోటమాలి ఆమె కగుపడెను. కమల సిగ్గుపడి బెంచీనుండి లేచి, పక్షులను చూచు చున్నట్లు నిటునటు తిరుగ నారంభించెను. ఆమె తనలో “ఎందుకీ బెంచీపై కూర్చుంటినా?” యని పశ్చాత్తాప పడజొచ్చెను. ఇంతలో నొక గుఱ్ఱపుబండి వచ్చి ఆశాలయెదుట నాగెను. వనరక్షకుడు పరు గెత్తివచ్చి వినయముతో బండి తలుపును తెరచెను. అందునుండి ఇద్దరు స్త్రీలు దిగిరి. వారిలో నొకతె కమల ఎవరిని తనకొరకై హీన ముగ చూచుచున్నదో ఆ రామతిలకమే! వారిని జూడగనే కమల యొక చెట్టుచాటునకు పోయి నిలబడెను. ఆ స్త్రీలిద్దరు తోటనంతయు దిరుగుచు పక్షులకు పండ్లను దినిపించుచున్న, చేపలను జూచుటకు కుండు

వద్దకు పోయిరి. తోటమాలి చేతులు కట్టుకొని వారి వెనువెంట నౌకరువలె దిగుచుండెను. వారు చేపలను జూచుచుండగా వాడు పరుగెత్తిపోయి రెండు పూలగుత్తులను దెచ్చి వారికి సమర్పించు కొనెను. కొంతసేపైనతరువాత వారు కమల నేబెంచీనుండి వస రక్షకుడు త్రోలివేసెనో దానిపైని వచ్చి కూర్చుండిరి. ఆ భటుడు చేతులు కట్టుకొని ఒకని యొకప్రక్క నిలువబడెను. ఇది యంతయు జూడగా కమలకు పట్టరాని కోపమువచ్చెను. కన్నెర్రజేసెను. శరీరము ముచ్చెమటలు బోసి గడగడ వడకెను. ఆ వేశ్య లక్కడనుండి వెళ్లి పోయిన తోడనే ఆమె మహాకోపముతో నాడుసింగమువలె నొక్క దాటున రక్షకభటుని ముందుకుపోయి నిలచి కంపితస్వరముతో "అయ్యా! నీ తాతగారిసొమ్మా! నన్నా బెంచీనుండి తగిలివేసితివే! ఆ సానివాళ్ళ నేమనలేక పోయినావేమి! భటుడు నిర్లక్ష్యభావముతో "నీవు వారితో సమానమా?" యని ధిక్కరించెను. నిప్పుపై నెయ్యిపోసినట్టులీ మాటలామెకు మరింత కోపము కలిగించెను. ఆమె పండ్లు పటపట కొరుకుచు, 'మూర్ఖుడా! నోరుమూసికో. సైసాకొరకు సానివాళ్ళకాళ్లు పట్టుటకు నీకు సిగ్గులేదా! చూడు? నేనీబెంచీపై కూర్చుంటాను. ఏలాగు లేవతీసెదవో చూచెదను. వాడు మొదట కొంచెము జంకెను, కాని ఆమె బెంచీపై కూర్చొనగానే దగ్గరకువచ్చి అక్కడనుండి లేచిపొమ్మని గట్టిగా నద లింపసాగెను. కమలకు కోపముచే నోటివెంట మాటరాలేదు. ఆమె తోడి సఖులందరు వింతలను జూచి ఆవైపునకే వచ్చుచు నీ గడబిడ యంతయు జూచి అక్కడనే నిలువబడిపోయిరి. ఒక్కతె యైనను దగ్గరకు వచ్చి వానిని చీవాట్లుపెట్టుటకు సాహసింప లేకపోయెను.

ఇంతలో నురిదొక మోటారు వచ్చి యట నాగెను. భటుడు కమలను చెయ్యిపట్టుకొని లాగుటకు ప్రయత్నించు చుండగా ఆబండి

నుండి ఒక పెద్దమనిషి దిగి, కోపముతో వానినొక చరపకాయకొట్టి "ఏమిరా దౌర్భాగ్యుడా! ఎందుకామె చెయ్యిపట్టుకొని లాగబోవుచున్నావు! ఛీ! దూరముగా పో" అని గసిరెను. ఆ పెద్దమనిషిని చూడగనే తోటకాపరి తెల్లబోయెను. వాడు ప్రక్కకొదిగి "బాబు! క్షమించండి. ఈమె మీ తాలూకువారా! నాకు తెలిసినదికాదు."

పెద్దమనుష్యుడు కోపస్వరముతో "మాతాలూకు కానీ కాకపోనీ నీ వామె చెయ్యి నెందుకు పట్టుకొనబోవుచున్నావు! చూడు యిప్పుడే రిపోర్టుచేసి నీ నౌకరీ యూడదీయించెదను"

భటుడు చేతులు జోడించి అతని కాళ్లపై బడి యీ తప్పు క్షమించమని వేడుకొనసాగెను.

ఇంతలో బండిలో కూర్చొనియున్న స్త్రీ కమలను సంజ్ఞచేసి పిలచి 'వీడు నిన్నేమనుచున్నాడు?' అని ప్రశ్నించెను.

కమల—ఏమియులేదు. నేనీ బెంచీపై కూర్చుండగా లేచిపొమ్మని వీడు కసరుచున్నాడు. ఇప్పుడే ఇద్దరు వేశ్యలు ఈ బెంచీపై కూర్చొని వెళ్ళిరి. వారిని వీడేమియు ననలేదు. నేనా వేశ్యలకంటె యధమురాల నని కాబోలు వీనియుద్దేశము.

స్త్రీ—"రెండు డబ్బులకొరకు కక్కురితిపడు నిటువంటి తక్కువ వారితో మనము ఘర్షణ పడకూడదు" అనిచెప్పి ఆమెను సమాధాన పరచెను.

ఈ విధముగా నీ స్త్రీల కిద్దరకు పరిచయము కలిగెను. ఆ బండిలో నున్న, ఆమె పేరు సుభద్రమ్మ. వారి యిల్లు కమల యింటికి కొంచెము దూరముగా నుండెను. ఆమె భర్త హైకోర్టు వకీలు. భార్యా భర్త లిరువురు గోదావరి స్నానము చేసి వచ్చుచుండిరి. సుభద్రమ్మ కమలయొక్క రూపురేఖావిలాసాదులు, మాటల పొందిక చూచి, ఆమెయందు ప్రేమ కలదై, 'నిన్ను మీయింటివద్ద దిగబెట్టెదను'

అని చెప్పి తన బండిలో కూర్చుండ పెట్టుకొనెను. సుభద్రమ్మ పెని మిటి డ్రైవరు ప్రక్కను కూర్చుండెను. బండి బయులుదేరినది. కమలకు తాను విమానమెక్కి స్వర్గమునకు పోవుచున్నట్లుండెను. సుభద్రమ్మకు, అంత రూపవంతురాలుకాదు. నగలుకూడ విశేషముగ పెట్టుకొనలేదు. ఐనప్పటికి ఆమె సాధువర్తనము, శీలము, మర్యాద కమల మనస్సు నాకర్షించెను. లోలోన కమలకు ఆమె స్నేహితురాండ్రు కనబడిరి. ఎప్పుడైనను మీకిట్టి సౌభాగ్యము కలుగునా! యనునట్లు గర్వముతో, ఆమె కిటికీనుండి వారివైపు జూచెను. కాని సుభద్రమ్మ తన పూరియిల్లు జూచిన తన నెక్కడ నిరసించునో యని భయపడి, కమల మనస్సులో, 'కాను! నాబీదస్థితిని జూచి, ఆమె నన్నెట్లు గౌరవించు? ఐనను మాయిల్లు ఎటువంటిదో యీయామె కెట్లు తెలియును! ఆహా, ఈమె యెంత అదృష్టవంతురాలు! ఈమె భర్త దైవస్వరూపుడే! నీరు రాకపోయిన, ఆదుష్టుడు నన్నేమిచేసి యుండునో కదా! ఈ వకీలుగారు ఎంతమంచి వారు! ఎంతమంచి వారు కాకపోయిన, నన్ను బండిలో కూర్చుండనిచ్చి తాము పైన కూర్చుందురా! అని యనేక విధముల భావించుకొనుచుండెను.

కమల యీ భావనలలో మునిగి యుండగానే మోటారు వారి వీధి చేరెను. ఆమె సుభద్రమ్మతో, "కారు ఆపించండి. మాయిల్లు ఇచ్చటనే యున్నది." అని చెప్పెను.

సుభద్రమ్మ డ్రైవర్‌తో చెప్పి బండి నాపించెను. కమల బండి దిగుచు నొకసారి రామతిలక మింటివైపు గర్వముతో జూచెను! అప్పు డావేశ్య తన మేడవసారాపై పచారు చేయుచుండెను. వారిద్దరి దృష్టు లొక్కసారి కలసెను. రామతిలకము చూపులు "ఆహా! ఏమి యీ షోకు." అను నట్లుండెను. "బాగుగా చూడు నీరెవ్వరో. ఎన్ని జన్మములెత్తినను నిటువంటి సజ్జనులతో సమానముగ కూర్చుం

డు అదృష్టము నీకు కలుగదు.'' అని అనునట్లు కమల చూపు లుండెను.

కమల బండినుండి దిగి, కృతజ్ఞతతో సుభద్రమ్మవైపు జూచుచు, "నన్ను మీరెంతో ప్రేమతో ఆదరించి రక్షించినారు. మీ మేలె న్నటికిని మరువను. దయచేసి నన్ను మరచిపోకండి. నామనస్సెప్పుడు మీమీదనే యుండును.

సుభ—లేదమ్మా! నిన్నెందుకు మరచెదను! నీతో నొకసారి కలసి మాట్లాడుటకైన నిప్పుడు వేళలేదు. రేపు తప్పకుండ మాయింటి కొకసారి రా.

కమల తిరిగి ఆమెవద్ద శలవు తీసికొని యింటికి వెళ్లిపోయెను. ఆమెకు సుఖమయమైన స్వప్నమునుండి మెలకువ వచ్చినట్లయ్యెను. రామప్రసాదామెను జూచి "ఆ కారెవరిది? అని ప్రశ్నించెను.

కమల—అది వకీలుగారిది. జంతు ప్రదర్శనశాలలో ఆయనభార్య తో నాకు స్నేహమైనది. నన్నెంతో బలవంతపెట్టి, వారి బండిలో కూర్చుంటే కాని వప్పుకున్నారు కారు.

రామ—ఐతే, నీవు వకీలుగారితో కలిసే కూర్చున్నావా యేమిటి?

కమల—ఏమి మాటలాడుచున్నారు? పాపం మాయన డ్రైవరు పక్కను కూర్చున్నారు.

రామ—మోటారుమీద వచ్చినప్పటికీ యింత యాలస్యమై నదా?

కమల—నిజముగా నా భార్యాభర్తలవతార మూర్తులే!

రామ—ఆ. చాలుకే నీవర్ణన. వేగిరం వెళ్లి పొయ్యి రాజెయ్యి.

కమల—మీరా వకీలుగారి నెరుగుదురా!

రామ—ఇక్కడకు దగ్గరగానున్న వకీలుగారైతే కాకరపు కృష్ణ శర్మగారే.

కమల—మంచి తెల్లగాను బల్లగాను వుంటాడు. సులోచనములు కూడ పెట్టుకుంటాడు.

రామ—ఆఁ, ఆఁ, ఆతడే! వా రీవీధికి దగ్గరగానే ఉన్నారు.

కమల—ఆయన పేరుపట్ల వకీలేనా?

రామ—ఏమో? వారి జమాఖర్చులు నేనే మెరుగుదును? అప్పుడప్పుడాతనిని మాత్రము చూస్తూ ఉంటాను. చాలా మంచివారని వాడుక.

తన భర్తకీచర్చ అంత యిష్టముగా లేనట్లు తెలుసుకొని కమల మరి యా సంగతి మాట్లాడక వంట చేయుటకు వెళ్ళిపోయెను.

## ౧౧ °

మరునాడు కమల గోదావరి స్నానమునకు వెళ్ళలేదు. ఆరోజు ప్రొద్దుటంతయు, తనపట్టుచీరను, జాకెట్టును, మరమ్మత్తు జేసికొనుచుండెను.

మధ్యాహ్నము మూడు గంటలకు సుభద్రమ్మగారి దాసి కమలను పిలుచుకొని పోవుటకు వచ్చెను. సుభద్రమ్మ తన కొరకు మోటారుబండి పంపునని కమల అనుకొనెను. కాని పంప పోవుట వలన ఆమెకు కొంచ మాశాభంగము కలిగెను.

కమల దాసీదానితో సుభద్రమ్మగారి యింటికి వెళ్ళి, అక్కడ రెండు మూడు గంటలు సరదాగ కాలము గడిపెను. ఆమె కింటికి పోవుటకు బుద్ధి పుట్టలేదు. ఆమె అక్కడున్నంతసేపు తన పుట్టినింటి గొప్పలే చెప్పుచుండెను.

వారిద్దరకు స్నేహము రోజుకురోజు ఎక్కువగుచుండెను. సుభద్రమ్మ తానెక్కడకు వెళ్ళినను కమలను తనతో గూడ తీసికొని వెళ్లుచుండును. ఆమె నొక్క రోజు చూడ లేకపోయిన కమల కిప్పుడు తోచదు.

నీటినుండి పైనపడి కొట్టుకొను చేప నీటి యాధారము దొరకగనే సంతోషముతో ఎట్లు గంతులు వేయునో అట్లే స్నేహసుఖములో కమల తన కష్టములను మఱచి సంతోషముతో కాలము గడుపు చుండెను.

సుభద్రమ్మ ఏ పని చేయుచున్నను, కమల ఆమెకు సాయపడు చుండును. అప్పుడప్పుడు శర్మగారికి సుభద్రమ్మకు బదులు తానే ఫలహారము చేయుచుండును. ఇట్టి పనులు చేయుటయన్న ఆమెకు మిక్కిలి సరదా. సుభద్రమ్మవంటి సుశీలయు, కృష్ణశర్మవంటి సత్పురుషుడును నీ ప్రపంచములో మరి లేరనియే ఆమె యభిప్రాయము.

ఒకసారి సుభద్రమ్మకు కొన్ని రోజులవరకు జ్వరమెక్కువగ వచ్చెను. అప్పుడు కమలయే ఆమెకు సర్వోపచారములు జేసెను. ఆ వేళకు ఇంటికి వెళ్ళి ఏదో యొక విధముగ వంటచేసి భర్తకుపెట్టి వెంటనే సుభద్రమ్మవద్దకు వచ్చుచుండెను. కాని రామప్రసాదుకు మాత్రము మామె తరచుగ వారింటికి వెళ్ళుటేమియు నిష్టము లేకుండెను. అంత తరచుగ వారింటికి వెళ్ళవద్దని చాల సార్లతడు చెప్పెను. కాని ఆమె లక్ష్యపెట్టలేదు.

ఫాల్గుణమాసము వచ్చెను. సంవత్సరాదికి క్రొత్త బట్టలుకొనుక్కొనవలెనని కమల చాల సంతోషపడు చుండెను. పాపము రామప్రసాదునకు సెట్టివద్ద పనికూడ పోయెను. అసలు జీతము పదునేను రూపాయలతోనే గడుపుకొనవలసి వచ్చెను. కమల తనకు సేలము చీరను, పట్టుజాకెట్టును, కొనుమని భర్త నడిగెను. కాని యాతడు "ఆఁ, ఊఁ" అనుచునే కాలము గడిపివేయుచుండెను. "ఈ పాత బట్టలతో నేను సంవత్సరాదినాడు సుభద్రమ్మగారింటి కెట్లు వెళ్ళుదు" నని కమల విచారించసాగెను.

ఇంతలోనే జగదాంబ చనిపోయినట్లు రామనాథము వద్దనుండి

యుత్తరము వచ్చెను. కమలను ఒకసారియైనను వచ్చి చూడకపోవుట చేతను, ఆమె ఇక్కడ ఎన్ని కష్టములు పడుచున్నను, పుట్టినంటి కొక్క నాడైనను తీసికొని వెళ్ళలేకపోవుటచేతను, తల్లిమీద కోపమువచ్చి కమల మనస్సు విరిగిపోయెను. అందువలన ఆమె పోయిన వార్త తెలిసినప్పుడు కమలకు కలుగవలసినంత దుఃఖము కలుగలేదు.

ఆమె సుభద్రమ్మతో "అమ్మా, సుభద్రమ్మక్కా! నేను దిక్కుమాలినదాననై పోతిని. ఆనాటి ఆధారమునూ కూడ లేకుండపోయినది. పెట్టినను పెట్టకపోయినను తనతల్లియున్నదంటే ధైర్యము. ఎప్పుడును పండుగకు క్రొత్తబట్టలు కొనుక్కొనుట మామూలు. కాని ఈ దుఃఖవార్త వినిన తర్వాత నాకు క్రొత్తబట్టలు కొనుక్కొనుటకు బుద్ధిపుట్టలేదు. ఈ దుఃఖముతో మనస్సులోనె క్రుంగిపోవుచున్నాను. నా దుఃఖము దేవునకే యెరుక" అని చెప్పి దుఃఖింపసాగెను. అక్కడనున్నవారందరు ఆమెకు ధైర్యము చెప్పి, ఓదార్చిరి.

ఒకనాడు సుభద్రమ్మ, కమల కలసి రామాయణము చదువుచుండగ శర్మ సంతోషముతో ఇంటికివచ్చి, భార్యతో, "గెలిచితిని సుమా" యని ఉత్సాహముతో పలికెను.

సుభ—(ఆతృతతో) నిజమేనా?

శర్మ—ఇంకా అనుమానమేమిటి?

సుభ—సరే, ఐతే, మొదట నా రూపాయలు తెండి. మీ కక్కడ గెలుపు.

శర్మ—నీ రూపాయ లిస్తానులే. కొంచెము ఆగుము. స్నేహితులందరు గెల్చినందుకు విందు చేయుమని బలవంత పెట్టుచున్నారు.

సుభ—ఔను. చేయవద్దామరి? చేయుట న్యాయమే.

శర్మ—అల్పాహారం విందు మాత్రమే చేసెదనని చెప్పితిని. కాని

దానికి వారెంత మాత్రము సమాధానపడుటలేదు. [illegible] పాట పెట్టించమని కూడ చాల బలవంతపెట్టుచున్నారు.

సుభ—ఐతే ఆలాగే చెయ్యండి. మరొక మూడు నాలుగు వందలు కదా ఖర్చు. సంవత్సరాదికూడ వస్తున్నది. ఆ రోజునే పెట్టించండి. రెండు సంబళ్ళు కలసి వస్తాయి.

శర్మ—ఖర్చుమాట నేననుకోవడం లేదు కాని నా నియమము గురించి ఆలోచించుచున్నాను.

సుభ—సరి, ఒక్కసారి కేమిటి? మరేమీ ఫర్వాలేదులెండి.

శర్మ—ఎంత చెప్పినను నారాయణదాసు సమాధానపడడంలేదు. అతడేమి గందరగోళం తెచ్చిపెట్టుతాడో అని భయంగా నున్నది.

సుభ—అని అని అతడే ఊరుకుంటాడు. ప్రపంచంలో అందరును తనలాగే ఉండమంటే ఏలాగు సాగుతుంది?

ఎన్ని సంవత్సరములనుండియో ప్రయత్నము చేయగా చేయగా నీనాటి పురపాలక సంఘపు ఎన్నికలలో కృష్ణశర్మ జయము నొందెను. ఈ సందర్భముననే విందు సన్నాహములు జరుగుచున్నవి.

కృష్ణశర్మ సంఘ సంస్కరణవాది. ఐనను తన యుద్దేశానుసారము నడచుకొను నంతటి మనోబల మాతనికి లేదు. కొంత మనోదౌర్బల్యము వలనను, కొంత స్నేహితుల ఆక్షేపణల భయము వలనను, కొంత సరళస్వభావము వలనను కూడ ఆతడు తన సిద్ధాంతములను నిలువబెట్టుకొన జాలకుండెను.

నారాయణదా సతని ముఖ్య స్నేహితులలో నొకడు. వేశ్యావృత్తి దేశమునకు చాల అరిష్టదాయకమనియు, అట్టి చెడు వృత్తిని మానిపించవలెననియు ఆతని యుద్దేశము. ఈ వృత్తిని నశింపజేయుటకై, ఆతడొక సంఘమును స్థాపించెను. ఆ సంఘ సభ్యులలో శర్మ యొకడు. అందువలననే, పాటకచ్చేరీ పెట్టించిన నారాయణదా

నేమనునో యని అతడు భయపడు చుండెను. కాని స్నేహితుల నిర్బంధము వలనను, సుభద్రమ్మ ప్రోత్సాహము వలనను, చివరకు పెట్టించుటకే నిశ్చయించెను.

సంవత్సరాది పండుగ వచ్చెను. అతి సందడిగా అల్పాహారము లైన తర్వాత శర్మగారి కచేరీ చావడిలో పాట ప్రారంభ మయ్యెను. అనేకులు పెద్ద మనుష్యులు ఆహ్వానింపబడిరి. రామతిల కము సభ మధ్య నిలువబడి శృంగారాభినయము చేయుచు పాట ప్రారంభించెను. చావడియంతయు మెరపు దీపములతో వెలుగు చుండెను. అత్తరు, పన్నీరు మొదలగు సుగంధద్రవ్యముల సువాసన లచే ఆ స్థల మంతయు నిండిపోయెను. స్నేహితుల హాస్యాలాపనల తోను, ఆమోదప్రమోదములతోను, సంగీతములతోను, చావడి ప్రతిధ్వనించుచుండెను. కమలాసుభద్రలు ప్రక్కగదిలో కూర్చొని సంగీ తము వినుచుండిరి. సుభద్రమ్మకు రామతిలకముయొక్క సంగీత మంత రుచింపలేదు. "ఈపాటవిని సభికులెందుకంత పరవశులగుచున్నారో!" యని ఆమెకు ఆశ్చర్యముగా నుండెను. కమలకు సంగీతమన్న మిక్కిలి సరదా. ఆమెకు రాగజ్ఞానము, లయజ్ఞానముకూడ కొంత కలదు. ఏ వరుసనైన నామెకు వినీవినుటలోనే పట్టుపడుచుండును. రామతిలక ము పాడిన పాటను మెల్లగ తనలో తానే పాడుకొనుచు, నతన బాగుగా వచ్చినదని తనలో తానే సంతోషించుచుండెను. కాని ఆమె ధ్యానమంతయు నొక్క సంగీతము మీదనే లేదు. వందల కొలది పురుషులు రామతిలకము నైపే తదేకధ్యానముతో చూచు చుండుట ఆమె కనిపెట్టెను. ఆచూపులయం దెంతతృష్ణ! ఎంతవిన యము, ఎంత యుత్సాహము! వారు బొమ్మలవలె రామతిలకము యొక్క భావమునందును, అభినయమునందును, తన్మయులై తలల నాడించుచుండిరి ఆమె దృష్టి ఎవరిపైబడిన వారు తమ్ముతాము

ధన్యుల సాధకోపాయముండెను. [illegible] ఆశ్రయము పట్టిన వారు కుబేరసంపత్తి నొందినటులే [illegible]మును పొందుచుండిరి. ఆసభయం దొకరినిమించి నొకరు ధనవంతులు. ఒకరినిమించి నొకరు రూపవంతులు. ఒకరినిమించి నొకరు విద్వాంసులు. ఒకరినిమించి యొకరు సత్పురుషులు నుండిరి. [illegible], ఆవేశ్యయొక్క అభిప్రాయమునందే తత్పరులై యుండిరి. [illegible] కోరికలతోను, కుతూహలముతోను చిత్రించబడి యుండెను. [illegible] జూచి కమల తనలో "ఈ స్త్రీయందు మంత్రశక్తి యున్నదా? లేక సౌందర్యమా? ఔను ఆమె సౌందర్యవంతురాలే. అందులో సందేహము లేదు. కాని నేను మాత్రము సౌందర్యవంతురాలను కానా! ఆమెది చామనచాయ. నాది పచ్చని బంగారుచాయ. ఆమె లావుగా నున్నది. నేను సన్నగా నున్నాను." అని తర్కించుకొనుచుండెను.

కృష్ణవేణి గదిలో ఒక నిలువుటద్దముండెను. కమల ఆ యద్దము వద్దకు వెళ్లి, నిలబడి, తన ప్రతిబింబమును నఖశిఖ పర్యంతమును జూచుకొని, రామతిలకముయొక్క రూపమును తన మనస్సునం దూహించుకొనెను. తుదకు రామతిలకముకంటె తానే యెక్కువ సౌందర్యవంతురాల నని నిశ్చయించుకొని, సుభద్రమ్మవద్దకు వెళ్లి, "అక్కా! నేను నిన్నొక సంగతి నడిగెదను. మరియొకలాగనుకొనకండి. ఈ వేశ్య నాకంటె సౌందర్యముగ నున్నదా?"

సుభ—(ఆమెవైపు ఆశ్చర్యముగా జూచుచు, చిరునవ్వుతో) ఎందుకీలాగున నడుగుచున్నావు?

కమ—(సిగ్గుతో తలవంచుకొని) ఏమియులేదు. కాని చెప్పుదురూ.

సుభ—ఆమె నిత్యభోగిని కనుక ఆమె శరీరము సౌష్ఠవముగ నున్నది. కాని రూపురేఖలలో నీకు సరిరాదు.

కమ—(తనలో) తెచ్చిపెట్టుకొన్న సౌందర్యమును జూచియు, ఆనగలను, బట్టలనుజూచియు, ప్రజలెంపుకింత మోహపడి పోవు చున్నారు? నేనుకూడ ఆవిధముగ శృంగారించుకొని మంచి బట్టలను గట్టి నగలను ధరించినయెడల నారూపవిలాస మంతకంటె నాకర్షణీయ ముగ నుండదా? నాయౌవన మింతకంటె నెక్కువగ ప్రకాశింపదా? కాని నా కెక్కడనుండి వచ్చు నాశృంగారము? ఈ సభికులకంత ముద్దులగుట కామె కంఠస్వర మంత మాధుర్యముగనున్నదా? లేదు, లేదు. ఆ కంఠమునందంత మాధుర్యమెక్కడ? నాకంఠస్వర మంతకంటె నెంతయో శ్రావ్యముగ నుండును. నేనొక్కనెల సంగీతము నేర్చుకొన్నయెడల ఇంతకన్న నెంతయో శ్రావ్యముగ పాడగలను. ఆ వంకవంక జూపులు, ఆ చిరునవ్వులు నాకుకూడ చేతనవును.”

కమల చాలసేపటివరకక్కడనే కూర్చొనిన కారణముచే కార్యము ననుసంధానము చేయుచు, తుదకిట్లు నిశ్చయించెను. “ఆమె స్వతంత్రు రాలు, నే నస్వతంత్రను. ఆమె లోకనిందకు భయపడదు. నేను లోక నిందకు భయపడుచున్నాను. ఆమె వేశ్య. నేను సంసారిని. ఆమె కొమ్మలపై స్వేచ్ఛగ నెగురుపక్షి. నేను పంజరములో బంధింపబడిన చిలుకను. ఆమెకు సిగ్గులజ్జలు లేవు. నేను వాటికి కట్టుబడి యున్నాను. ఈ లోకనిందయే, ఈ కట్టుబడియే, నన్నొకనికి దాసిగా జేసినది.”

అర్ధరాత్రి యయ్యెను. సభకూడ సమాప్తమయ్యెను. సభికు లెవరి ఇండ్లకువారు వెళ్ళిరి. కమలకూడ తనయింటికి బయలుదేరెను. నాల్గు వైపుల అంధకారమయము. కమల మనస్సుకూడ అంధకారమయమే. ఇల్లు దగ్గరైనకొలదియు, ఆమె గుడికిపోవు మేకపోతువలె భయ పడుచు, మెల్లమెల్లగ నడచుచుండెను. అభిమానము, నీచత్వమునెడల నెట్లు విముఖమగునో అట్లే ఆమె హృదయముకూడ నింటినుండి విముఖత్వము పొందుచుండెను.

[illegible] మామూలు ప్రకారము రాత్రి తొమ్మిది గంటల ఇంటికి వచ్చెను. కాని ఇంటితలుపులకు తాళము వేయబడియుండెను. [illegible] ఎక్కడకు వెళ్లినదని యాతడు పొరుగింటామె నడిగెను. ఏదో పనిమీదుండి సుభద్రమ్మగారింటికి వెళ్లినదని యామె చెప్పి, కమల తన చేతికిచ్చిన ఇంటితాళము నిచ్చివేసెను. అతడు తలుపుతీసి లోపలకు వెళ్ళి వంటచేసి కమలరాక కెదురుచూచుచుండెను. పది గంటలైనను కమల రానందున విసిగి భోజనము చేయుటకు లోపలకు వెళ్లెను. కాని కమలపై కోపముచే నాతని కన్నమేమియు దిగలేదు. చికాకుతో ఆ వంట అంతయు ఆవల పారవేసి, తలుపు లోపల గడియవేసి, పరుండి తనలో "ఇక కమల వచ్చి తల పగలకొట్టుకొన్నను తలుపు తియ్యను. ఎక్కడకు పోవునో చూచెద" నని యనుకొనుచు నిద్రపోవుటకు ప్రయత్నించెను. కాని నిద్రపట్టలేదు. చీమ చిటుక్కుమన్నను కమల వచ్చినదేమోయని చేతికఱ్ఱ పుచ్చుకొని వీధిగుమ్మమువద్దకు వెళ్లు చుండును. నిజముగా అప్పుడు కమలయే వచ్చినయెడల చాల ప్రమాదము సంభవించియుండును. పదునొకండు గంటలు కొట్టినతర్వాత రామప్రసాదు నిద్రాదేవికి వశుడయ్యెను.

కమల తన ఇల్లు చేరగనే ఒంటిగంట కొట్టిన శబ్దమామె చెవుల బడెను. ఆశబ్దమామె రోమరోమముల నుండియు పొడుచుకొనిపోయి నట్లుండెను. ఆమె ఇప్పటివరకు పదునొకండు గంటలే యైనదను కొనెను. కాని ఒంటిగంట కొట్టినశబ్దము వినబడగనే ఆమె ప్రాణములు మీది కెగిరిపోయెను. కమల తలుపుసందునుండి లోపలకు తొంగిచూచెను. ఆగదిలో నొక చిన్నదీపము వెలుగుచుండెను. దాని పొగతో గదియంతయు నిండిపోయెను. రామప్రసాదు చేతిలో కఱ్ఱనుంచుకొని నిద్రపోవుచుండెను. ఆదృశ్యము చూడగనే ఆమె ఒడలు గడగడ వడకి తలుపు కొట్టుటకైనను సాహసము లేకపోయెను.

ఆమె తనలో, "ఇప్పుడెక్కడకు పోవుదును? శరర్మగారి వీధితలుపు మూసి ఈపాటికి నౌకర్లుకూడ నిద్రపోయియుందురు. గట్టిగా తలుపు కొట్టి పిలచిన తలుపు తీయుదురేమో! కాని వకీలుగారు నన్ను జూచి ఏమనుకొనెదరో! ఛీ! అక్కడకు వెళ్ళుట మంచిదికాదు. పోనీ ఈగుమ్మములోనే కూర్చుండెదను. ఒంటిగంట యైనదిగదా! మరి రెండు మూడు గంటలలో తెల్లవారుచున్నదగును." అని అనుకొనుచు వీధియరుగుపై కూర్చుండెను. కాని ఆమెగుండెలు గడగడ కొట్టుకొన నారంభించెను. "నన్ని చీకటిలో ఎవరైనను జూచిన నేమనుకొనెదరు? దొంగననుకొని తరుమరుకదా?" కమల ఇప్పుడు నిజముగ తన యింటికి తానే దొంగయయ్యెను.

ఆరోజున చలిగాలి విస్తారముగ వేయుచుండెను. కమల సన్నని పట్టుచీరను, పట్టుజాకెట్టును మాత్రమే ధరించి యుండెను. ఆచలిగాలి వలనను, భయమువలనను గుండెలలో వణకు పుట్టుచుండెను. మరియు ఆకాలువల దుర్గంధము భరింప శక్యముకాకుండెను. నాల్గువైపుల నుండియు మేఘము లాకాశము నావరించుచుండెను. రామతిలకము మేడనుండి వచ్చు దీపపు వెలుగుమాత్ర మాయంధకార మయమైన వీధిని దయతో జూచుచున్నట్లుండెను.

కమల తనలో "నే నెంతనిర్భాగ్యురాలను! తోటివారు హాయిగ పందిరిపట్టిమంచముపైని పండుకొని నిద్రించుచున్నారు. నేనో? నాదురదృష్టమున కేడ్చుచు నిక్కడ పడియున్నాను. ఈదుఃఖ మంతయు, నే నెందుల కనుభవించుచున్నాను? అద్దెకొంపలో పడియుండి, పండుకొనుటకు శుభ్రమైన పక్కయు, కడుపునిండ తినుట కన్నము లేక ఎల్లప్పుడు చీవాట్లు, దెబ్బలు తినుచు నెందుకీ బాధపడవలెను? మర్యా దను పాలించుటకేనా? కాని ఈప్రపంచము, నామర్యాదపాలన గురించి ఏమనుచున్నది? ఈప్రపంచదృష్టియందు దీనికేమి విలువ

గలదు? లేక నే నావిలువను తెలిసికొనలేకున్నానా? దసరాయుత్సవములయందు, మొహరంపండుగులయందు, దేవాలయములయందు, ఇంతయేల అనేకస్థలములయందు కూడ జూచితిని. ఇప్పటివరకు దుష్ప్రవర్తనులే వేశ్యలయందు మోహపరవశులగుచున్నారని తలచితిని. కాని ఈరోజున సచ్చరిత్రులే వేశ్యలను గౌరవించుచున్నారని బోధపడినది. వకీలుగారు ఎంత సత్పురుషులు! ఆయనకూడ నీరోజున రామతిలకము నెంతో గౌరవించిరి" అని ఈవిధముగ నాలోచించుకొనుచు, లేచి నిలువబడి, "ఏమైనను సరే తలుపుకొట్టి చూచెదను. ఈ యాపదకు భయపడుట కిదివరకు మాత్రము సుఖ మనుభవించుచున్నాను గనుకనా? రోజెల్లా రెక్కలు విరుగునట్లు ఇంటిచాకిరీ యంతయు జేసి ఇంతయన్నము దినుచున్నాను. దీనికేనా యింత రవ్వ?" అని ఎంత యనుకొన్నను రామప్రసాదు చేతిలోని కఱ్ఱ జూడగనే, ఆమె తలుపుకొట్టుటకు సాహసింపలేక పోవుచుండెను. ఎంత ప్రయత్నించినను ధైర్యము నిలువకుండెను. పశుబల మామె ధైర్యమును బారద్రోలుచుండెను.

ఇంతలో నకస్మాత్తుగ నిద్దరు రక్షకభటులు భుజములపై లాటీ కఱ్ఱల నుంచుకొని ఆవైపునకే వచ్చుచుండిరి. ఆ యంధకారములో వారి యాకారము లామెకు మిక్కిలి భయముకలిగించెను. ఆమె ముఖము భయముచే కళావిహీనమయ్యెను. ఎక్కడ దాగుకొనుటకును స్థలము కనబడలేదు. తా నక్కడనుండిన వారేమనుకొనెదరో యని దిగులుపడి తలుపు దబదబ కొట్టనారంభించెను. "ఎంత యరచినను తలుపు తియ్యరేమి? గంటైె ఒక్కలాగున నరచుచున్నాను. వినబడటం లేదా?" అని గట్టిగా పిలువసాగెను.

రామప్రసాదు—తులుక్కుపడి లేచి ధుమధుమలాడుచు వెళ్ళి తలుపు తీసెను.

కమ—(కృత్రిమ కోపముతో) ఎవరైనను ఇంత యొళ్లు తెలి యని నిద్ర యుండునా? రెండు గంటలనుండి ఇక్కడ ఈ చీకటిలో నిలువబడి పిలుచుచున్నాను. "ఊం." యని యైన ననుటలేదు. ఈ చలిలో నిలువబడలేక నావళ్లు కొయ్యబారి పోవుచున్నది.

రా. ప్ర—(కోపముతో) నన్ను మోసము చెయ్యకు. రాత్రి యంతయు నెక్కడ నుంటివో నిజముగా చెప్పు.

కమ—(నిర్భయముతో) రాత్రంతా యెక్కడా? సాయంత్రం సుభద్రమ్మగారింటికి వెళ్ళితిని. పాటకచ్చేరీ యగుచుండెను. అది పూర్తి యగువరకు ఆమె నన్ను బలవంతపెట్టి ఉంచివేసినది. అందు చేత ఆలస్యమైనది. పది కొట్టగానే ఇక్కడకు వచ్చితిని. రెండుమూడు గంటలనుండి గుమ్మము ముందర పడి ఒక్కలాగ అరచుచున్నాను. ఇప్పుడు ఒంటిగంటై యుంటుంది. నిద్దరమత్తునుండి ఇప్పుడెంత వేళ యైనదో మీకు తెలియుడంలేదు.

రా. ప్ర—నీవు పది గంటలకే వచ్చినావా?

కమ—(జంకు లేకుండా) ఆం. ఔను. పది గంటలకే వచ్చాను.

రా. ప—అది వట్టి అబద్ధం. నేను నా చెవులతో పదకొండు విని మరీ పడుకొన్నాను.

కమ—నిద్రమత్తులో ఏం తెలుస్తుంది. ఏవో గంటలు వినియుం దురు. గాని పద్దకొండని సమంగా లెక్కపెట్టారా ఏమిటి?

రా. ప్ర—ఇక. నా దగ్గర నీ తమాషా మాటలేమీ పనికిరావు. ఇంతసేపు ఎక్కడ నున్నావో నిజము చెప్పు. నీ వ్యాపారమంతా నాకు బోధ పడ్డాదిలే. నేనంత గ్రుడ్డివాడ ననుకొన్నావా? లేక ఆపాటి ప్రపంచజ్ఞానం నాకు లేదనుకొన్నావా? ఉన్నది ఉన్నట్టు చెప్పు. లేకపోతే నీపని పట్టిస్తాను.

కమ—మొందటినుండియు చెప్పుచునేయున్నాను. నేను సుభద్రమ్మగారి

యింటికి వెళ్లి పది పదకొండు గంటలకు వచ్చాను. మీరు నమ్మితే నమ్మండి లేకపోతే పోనియ్యండి. ఎప్పుడు ఒక్కటే అను మానం. పెట్టుపోతలు లేకపోయినా ఖాయిదాకు మాత్రం తక్కువ లేదు. ఒక నగైనా మంచి బట్టైనా లేదుకదా!

కమల ఇట్లనుచు గతుక్కుమని ఆగిపోయెను. తాను మిగుల మాటలాడుచున్నానని ఇప్పుడామెకు తోచెను. ఇదివరకు తాను గుమ్మ ములో కూర్చొని తలపోసిన మాటలన్నియు ఆమెకు జ్ఞప్తికి వచ్చెను. కాని సంఘ దురాచారములవల్లను, మనసునందలి తర్కవితర్కముల వలనను, అకస్మాత్తుగ ఏ మార్పును కలుగదు.

రామప్రసాదు కమలయొక్క తిరస్కారపు వచనములను విని స్థంభించి పోయెను. ఆమె యింత తిరస్కారముగ మాటలాడుట కిదయే మొదటి పర్యాయము.

రా. ప్ర—(క్రోధోన్మత్తుడై) నీ ఇష్టము వచ్చినట్లాట లాడుతూ వుంటే నేనేమీ అననని యీ నీ అభిప్రాయము? రాత్రంతా ఎక్క డున్నావని అడుగుతే ఇంత నిర్లక్ష్యముగా జవాబు చెప్తావా? ఏమీ? నీకు నేనంత చులకనగ కనబడుచున్నానా? పట్నవాసపు నీరు నీకు బాగా వంటపట్టినది. స్నేహితుల సహవాసములుకూడ నీకు ఎక్కువై పోయినవి. సరే. ఇక నీకు నాకు పొసగేటట్టుగపడదు. తరచుగ నిక్కడకు, నక్కడకు వెళ్ళవద్దని, సంబరాలకు, సభలకు వెళ్ళవద్దని ఎన్నిసార్లో బ్రతిమాలి మరీచెప్పాను. కాని కొంచెమైనా లక్ష్యపెట్టినావు కావు. రాత్రంతా నెక్కడనున్నావో చెప్పేవరకు నిన్ను గుమ్మములో అడుగు పెట్టనివ్వను. నిజము చెప్పకపోతె ఈ రోజునుండి నీకు నాకు సంబంధము తెగిపోయిందనుకో. తరువాత నీయిష్టము వచ్చినట్లే చేయవచ్చును. ఎక్కడకు వెళ్ళవలెనంటె అక్క డకు వెళ్ళవచ్చును.

కమ—(కాతరస్వరముతో) వకీలుగారింటికి తప్ప మరి నేనెక్కడకు వెళ్ళలేదు. మీకంత నమ్మకము లేకపోతే స్వయముగా వెళ్ళి వారిని కనుక్కోండి. పాటకచ్చేరీ అగుచుండుటవలన సుభద్రమ్మ నన్నింతకు రానిచ్చినదికాదు. అందువలననె ఇంత రాత్రియైనది.

రా. ప్ర—(మర్మభేద స్వరముతో) సరే, బాగానే ఉన్నది. ఇప్పుడు నీమనస్సు వకీలుగారి మీదికి పోయినట్లున్నది. ఐతే నన్నెందుకు బ్రతి మాలుచున్నావు?

ఈ వచనములు కమలకు శూలములవలె తగిలెను. అన్యాయముగ అపవాదులు భరించుట కష్టముగదా!

కమ—(రోషముతో) నోటినుండి ఎటువంటి మాటలు వచ్చుచున్నవి! మంచిచెడ్డ లాలోచించకుండ తగుమనిషి మీదనే అపవాదులు వేయుదురా? నేనాలస్యముగ వచ్చినందుకు మీ ఇష్టమువచ్చినట్లు నన్ను తిట్టండి, కొట్టండి, కాని అన్యాయముగ వకీలుగారి నెందుకనెదరు? నేనక్కడ నున్నంతసేపు ఆయన నేనున్న గదిలోనైన నడుగుపెట్టరు.

రా. ప్ర—అంతా అబద్ధమే. ఇటువంటివారి నెందరినో చూచినాను. ఆయనే నీకు దేముడు. అతనివద్దకేపో. ఈకొంప నీవుండుటకు తగదు. నీకు కోరికలు మిక్కిలి ఎక్కువగానున్నవి. నీకిక్కడ సరిపడదు.

అంతకంతకు వాదము ముదిరిపోయెను. కమల తానన్నమాటలు తప్పుకొనగలిగిన తప్పుకొనియే యుండును. కాని బాణమునుండి వదలిన అమ్ములు తిరిగివచ్చునా?

కమ—(ఏడ్చుచు) ఆతనివైపు మరియొక యుద్దేశముతో జూచిన నాకళ్లు పేలిపోవలెను. నేనాతనితో నొక్కమాట మాట్లాడిన నా జిహ్వ పడిపోవలెను. మనస్సునకు కొంత సంతోషముగా యుండునని సుభద్రమ్మగారి ఇంటికి వెళ్ళుచుంటిని, మీరిక వెళ్ళవద్దని ఆజ్ఞాపించిన

మానివేసెదను.

మనస్సులో శోకమను అనుమానము కలిగిన నది పోవుట చాల కష్టము. కమల తన కోపమును శాంతి పరచుటకు మాత్రమే ఈనమ్రత జూపుచున్నదని తలచి రామప్రసాదు కఠినస్వరముతో, "వారింటికి వెళ్ళవా? ఎందుకు వెళ్ళవు? అక్కడ మంచిగాలి ననుభవించుటకు పెద్ద మేడయున్నది. తినుటకు మంచి ఫలహారములు దొరకును. పెద్ద పందిరిపట్టెమంచముపై హాయిగ పండుకొనవచ్చును. వారితో ఖులాసాగా కేరింతలు కొట్టవచ్చును.

రోషమును పుట్టించు నీమాటలను విని కమల క్రోధవివశురాలై "బాగున్నది. ఈపాటికి చాలించండి. గంటసేపై మంచిచెడ్డ లాలోచించకుండ నోటికివచ్చిన మాటలాడుచున్నారు. ఆలోచించి మరీ మాట్లాడండి. ఇంతవరకొచ్చి యున్నందుకిదియా ఫలము. నేనేమి వేశ్య ననుకున్నారా? మీ యిష్టము వచ్చినట్లు ప్రేలుచున్నారు.

రా. ప్ర—నేనట్లనకొనుచున్నాను.

కమ—నామీద అన్యాయముగ అపవాదులు వేయుచున్నారు. పైన దైవము లేడా?

రా. ప్ర—నాకు శాపనార్థాలు పెట్టుచున్నావా? ఫో! భడవా. నాయింటినుండిపో!

కమ—ఆఁ. అలాచెప్పండి. నేనింట్లో ఉండడం మీకిష్టము లేదు. ఆమాట స్పష్టముగ చెప్పక, అన్యాయముగ నానెత్తిని ఎందుకప వాదులు వేసెదరు? ఈ ప్రపంచములో పట్టెడు మెతుకులు దొరకక పోవు. ఎక్కడ చాకిరీచేసిన నక్కడే కడుపునిండును. నన్నన్యాయముగ దుఃఖపెట్టిన పాప మూరకపోదు.

రా. ప్ర—పోతున్నదానివి నోరుమూసికొని పోక ఎందుకాలా ప్రేలుతావు? కమలవంటి అభిమానవంతురాలిటువంటి అవమాన

మును సహించగలవా? అని యామె కోపముతో, "నీ సొత్తంతా పట్టుకపొండి" అని అనుచు వీధిలోనికి వెడలుటకు గుమ్మము నెక్కెను. కాని యప్పటికి ఆమె వెళ్ళిపోవుటకు నిశ్చయించుకొనలేదు. కేవలము బెదిరించుటకు మాత్రమే అట్లు చేసినది.

రామప్రసాదు ఒక్క నిమిషము వరకు ఆలోచించుచు అట్లే నిలచి తిరిగి యామెతో "నీబట్టలు అవి తీసికొని మరీపో, అవి యిక్కడ నుండుటకు వీలులేదు" అని ఆమె బట్టలమూటను పైన పడ వేసెను. దీనితో మినుకు మినుకు మను చున్న ఆశాదీపము ఆరిపోయెను.

ఇంక నీయింటితో ఋణము దీరిపోయినదనుకొని "నేను వీటి నేమి చేసికొనెదను?" అని యనుచు ఆతనికి జాలి పుట్టునట్లేడ్చుచు కాళ్లపై బడెను. బుజ్జి మొత్తుకొనెను. ఒట్లు పెట్టుకొనెను. కాని ఆమె ఏడ్చుచు, ప్రతిమాలుకొన్న కొలది ఆతని కోపము, అను మానము, ఎక్కువగుచుండెను.

కమల ఏడ్చి యేడ్చి యిక లాభములేదని తన మూటను చంక బెట్టుకొని బయలు దేరెను. కాని ఇంకను నామెకు పూర్తిగ ఆశ వదల లేదు. రామప్రసాదు వచ్చి, 'పోకుండ తనను అడ్డుపెట్టుననియె యామె అభిప్రాయము. ఆమె గుమ్మమీవల నిలువబడి కొంగు తడిసిపోవు నట్లు వెక్కి వెక్కి యేడ్చుచుండెను. రామప్రసాదామెనుజూచి కోపము పట్టజాలక తలుపు రెక్కలను మూసి లోపల గడియవేసెను. కమలకు తన ఆశాద్వారము నెప్పటికిని మూసివేసినట్లయ్యెను. ఎక్కడకు వెళ్లు టకు నామెకు తోచకుండెను. ఇప్పుడామెకు విచార పశ్చాత్తాపము లకు బదులు భర్తపై నమితకోపము కలుగుచుండెను. ఇంత కఠినదం డన చేయుటకామె ఎట్టి యేపాపములును జేయలేదు. ఇంటికి వచ్చుట రెండు మూడు గంటలుమాత్రమే ఆలస్యమైనది. అంతమాత్రమునకు నాలుగు చీవాట్లుపెట్టిన చాలును. కాని ఇంటినుండి తగిలివేయుట

మూట యేమిటి?"

కమల—(గద్గద స్వరముతో) నన్నింటినుండి గెంటివేసిరి.

సుభ—అయ్యో, యిదేమి పాపము! ఇంటినుండి యెందుకు గెంటి వేసిరి?

కమల—నేను రాత్రి యింటికి ఆలస్యముగా వెళ్ళితినని.

సుభ—ఈ చిన్న కారణమునకేనా ఇంత గడబిడ. కోపము? సరే. నేను ఖబురు పంపి కనుక్కుంటాను. చాలా విచిత్రపు మనిషి లాగున్నాడు.

కమల—వద్దు. వద్దు. ఆయనకు ఖబురు పంపవద్దు. నేనెంతయో ఏడ్చి బ్రతిమాలుకొన్నాను. కాని, ఆ కఠినునకు, ఆ నిర్దయునకు, కొంచమైనను కనికరము కలుగలేదు. ఇంటినుండి నన్ను చెయ్యి పట్టుకుని త్రోసివేసిరి. తామే నాకు దిక్కని ఆయనకు గర్వము. ఆ గర్వ మేమిటో నేనూ చూస్తాను.

సుభ—వద, వద. అటువంటి మాటలనకు. నేనాయనను పిలిపించి చీవాట్లు పెట్టుతాను.

కమల—నేనిక, ఆయన ముఖం చూడను.

సుభ—ఏమీ? అంతవరకు చెడినదా?

కమల—ఔను. అంతే! ఇప్పుడు మా యిద్దరకు ఏమియు సంబంధము లేదు.

సుభద్రమ్మ మనస్సులో "ఇప్పుడీ కోపంలో ఎంత చెప్పినను ఈమె సమాధానపడదు. రెండు మూడు రోజులలో నీ కోపము కొంత శాంతించును." అని అనుకొనుచు, కమలతో "సరే పోనీ ముందు ముఖము కడుక్కో. కళ్ళువాచియున్నాయి. రాత్రంతా నిద్రలేదు కాబోలు. కాఫీ త్రాగి, కొంచెంసేపు పడుకో. తర్వాత అన్ని సంగతులు చెప్పవచ్చును." కమల సుభద్రమ్మతో, "నేను సౌఖ్యపడుదు

ననియు, హాయిగా నుండాలనియు నా సుఖము ప్రార్థించుచున్నారు, నేనీ దుష్టురాలి పాల పడియుంటినా? ఇక నా కేమి? నాకు గతి, మీరు దయ తలచి నన్ను చేరదీసిన నెమ్మదిగ నూనెను చేయుచు నిక్కడే పడి యుంటాను. లేని యెడల యే నుయ్యో, గోయ్యో చూచుకుంటాను. నాకు దోసెడు స్థానం మిచ్చినట్లైన నా చేతనైనంత వరకు మీ సేవ చేయుచు నా దినములు వెళ్ళబుచ్చుకుంటాను." అని దీనముగా బలికెను.

కృష్ణశర్మ ఇంటిలోపలకు వచ్చినతోడనే సుభద్రమ్మ కమల సంగతి నంతయు ఆయనతో జెప్పెను. భర్త అనుమతి లేనిదే యితర స్త్రీని ఇంటియందుంచుకొనుట కామెకు సంకోచముగా నుండెను.

"సరే. రామప్రసాదును పిలిపించి సమాధానపరచెదను. ఈమె యిప్పుడు తన యింటికి పోవుటే మంచిది." అని శర్మ భార్యతో చెప్పి వెంటనే రామప్రసాదును పిలుచుటకు నౌఖరును బంపెను. కాని ఆయన యింటివద్ద లేనట్టు ఖబురు వచ్చెను. శర్మ కచేరీనుండి రాగానే తిరిగి రామప్రసాదుకొరకు నౌఖరును బంపెను. కాని ఈ సారియు ఆయన యింటివద్ద దొరకలేదు.

కమల శర్మగారింటికి వెళ్ళినదన్న తెలిసినతోడనే రామప్రసాదు సందేహము మరింత బలపడెను. ఆయన ప్రతివారివద్దను శర్మను నిందింపసాగెను. మొదట నారాయణదాసువద్దకుపోయి, ఈ సంగ తంతయు ఆతనితో జెప్పెను. ఆతడుకూడ ఏమియు ఆలోచింపక ఆ మాటలు నిజమని నమ్మివేసెను.

నారాయణదాసు దేశసేవాపరాయణుడు. సంఘదురాచారములకు పరమశత్రువు. శర్మ పాటకచ్చేరి పెట్టించినదగ్గరనుండియు ఆయనయం దీతనకు అనుమానమును ద్వేషము కలుగసాగెను. రామ ప్రసాదు చెప్పిన సంగతుల వలన తన అనుమానము మరింత స్థిరపరచు

కొని, ఈ సంగతి స్త్రీ మిత్రులతోను తనతోటివారితోను చెప్పుచు “ఇటువంటి చెడుబుద్ధులుండబట్టే నానిమోశము పెట్టించుచున్నాడని నేను మొదటనే చెప్పలేదా? వాడు నుమూయుకురాలైన నొక బ్రాహ్మణ స్త్రీని ఇంటినుండి లేవదీసి తన యింటియందుంచు కొన్నాడు. పాప మామె భర్త ఈ సంగతి చెప్పి చెప్పి యేడ్చుకొన్నాడు. ఇదియేనా యున్నతవిద్యయొక్క యాదర్శము? ఇటువంటివారా సంఘము నుద్ధరించుట? నేను స్త్రీని సంఘము వారి యింటివద్ద చూచుచున్నప్పుడే, ‘ఇది యేమిటి చెప్పుమా!’ యని అనుమానపడితిని. కాని యింతవరకు వచ్చునని కలలోనైన ననుకొనలేదు. ఈయన యేమో కడుపెద్దమనిషి యనుకొన్నాను.” అని హేళనగా యనసాగెను.

శర్మ స్వభావము బాగుగా నెరిగిన ఆయన స్నేహితులు సహితము ఈ సంగతి విని, నిజమే యని నమ్ముట చాల నాశ్చర్యము. ఆ మరునాడు వెంకటస్వామి బజారునకుపోగా నొక దుకాణదారు డాతనిని పిలచి, “యేమోయి! వెంకటస్వామి! మీ క్రొత్త యజమానురాలు ఎటువంటిది? నిన్ను దయతో చూచుచున్నదా? లేక నీకా క్రొత్త పెళ్లికూతురి సుఖము మనుపడనేలేదా?” యని ఎగతాళిగా నడిగెను. ఈ మాటలు విని వెంకటస్వామి తెల్లపోయి, ఏమియు బోధపడక ఆశ్చర్యపడుచు, నింటికి పరుగెత్తుకొని వచ్చి, తన యజమానునితో “బాబూ! రామప్రసాదంగారి భార్యను మన యింటియం దమ్మగారుండనిచ్చుట వలన బజారులో నెక్కడ జూచినా మీ మీద చెడ్డవాడుకగానున్నది. ఆమె తన మగనితో తగవులాడి మన యింటికి లేచివచ్చినట్లందరూ అనుకొనుచున్నారు.” అని గాభరా పడుచు చెప్పెను.

శర్మ నౌకరు చెప్పిన మాటలను విని, నిర్ఘాంతపోయెను. ఆయన కచ్చేరీ బట్టలు సగముసగము ధరించుచు, తాను బట్టలు ధరించుకొను

చున్నాననుమాటయే మరచి కొయ్యబారినట్లుగ్లే నిలిచిపోయెను. ఆమన భయపడినట్లే యైనది. ఇప్పుడు రామప్రసాదునియొక్క నిర్లక్ష్యమాయాసము బోధపడెను. ఆమన యట్లే నిలువఁబడి తనలో "ఇప్పుడేమి చేయుదును? ఆమె నింటినుండి పంపివేయుట తప్ప మరియొక యుపాయము కనుపడుటలేదు. ఆ సంగతి యేమైతే నేనేమి చేయగలను? ఇందులో నాపరాధమేమున్నది? ఏలాగైనను నాకు చెడ్డపేరు రాకుండ ముందర చూచుకోవాలి కదా? (భార్యమీఁద విసుగుకొనుచు) ఏమి ములిగిపోయినదని ఈమె నింట్లో తెచ్చిపెట్టినది? మొదట నాతో నాలోచింపనైనవద్దా? మహాస్వతంత్రురాలైపోవుచున్నది. తన కేమి పోయినది? తానింట్లో కూర్చుండును. నలుగురిలో నేను తలయెత్తికొనలేకుండా నున్నాను. కాని, యీ కమల నింటినుండి తగిలివేసిన యెడల నీమెకు దిక్కెవ్వరు? ఎక్కడకు పోవును? ఇక్కడ నీమెకు దగ్గరబంధువు లెవ్వరు లేనట్లున్నది. ఇప్పటి కీమె యిక్కడకు వచ్చి రెండు రోజులైనది. ఈమె భర్త యీమెను గురించి కనుక్కొన్నట్లుగ పడదు. దీనివలన ఆతడీమెను వదలివేయుటకు నిశ్చయించుకొన్నట్లుగ పడుచున్నది. కమల నన్ను దయాహీనుడనియు, క్రూరుడనియు భావించునేమో? కాని యీ యపవాదును తప్పించుకొనుటకు మరియొక మార్గము లేదు. ఏమి చేయుదును? పంపివేయక తప్పనిసరివచ్చినది. లోపలిసంగతి యెవరికి తెలియును? లోకులకు జడవవలెను కదా?" అని పరిపరి విధముల యాలోచించి, ఆతడు వెంకటస్వామిని పిలచి, "నీవిప్పటి వరకు నాతో నీ సంగతి నెందుకు చెప్పినావుకావు?" అని యడిగెను.

వెంక—బాబూ! నాకీ సంగతి ఇప్పుడే తెలిసినది. లేకపోతే మీతో నిదివరకే చెప్పియుండనా!

శర్మ—సరే, లోపలకు వెళ్ళి కమలమ్మతో "మీరిక్కడనుండుట

వల్ల మా పంతులుగారికి చెడ్డపేరు వచ్చుచున్నది. ఏలాగునైనను మీరీరోజునసే ఇక్కడనుండి వెళ్ళిపోవలెను." అని చెప్పి, కొంచెము మంచి మాటలతో మెల్లగా చెప్పి కాని గట్టిగా కేకలు వెయ్యకు. "ఇక్కడ మిమ్ముల నుండనిచ్చుటకు వీలులేకుండా నున్నది. మా పంతులు గారికికూడా మిమ్ములను వెళ్ళిపొమ్మని చెప్పుటకు చాలా విచారము గాను, సిగ్గుగాను నున్నది." అని మెల్లగా బోధపరచి మరీచెప్పి.

ఈమాటలు వినగానే వెంకటస్వామికి చాలా సంతోషము కలిగెను. తన యజమానులు బీదవారిని గౌరవముతో జూచిన వారియందు నౌకరులకు చాల అనుమానముగా నుండును. అందుచేతనే వెంకటస్వామికి కమలను జూచిన కోపము. ఆమెప్రవర్తన వానికేమియు నచ్చలేదు. ముసలివారు సాధారణశృంగారము జూచియే అనుమానింతురు. ఉందులో మీదు పల్లెటూరివాడు. కట్టెవిరచి పొయ్యిలో పెట్టినట్లు మాట్లాడుటే కాని మృదువుగా మాట్లాడుట వానిచేతకాదు. కృష్ణశర్మ కమలతో మెల్లగా బోధపరచి చెప్పుచున్నను వాడు లోపలికి వెళ్ళి యామెను గట్టిగా పేరుపెట్టి పిలచెను. అప్పుడామె కృష్ణశర్మ, సుభద్రమ్మగార్లకొరకు తమలపాకులు చుట్టుచుండెను. వెంకటస్వామి పిలుపు వినబడగానే ఆమె తుళ్ళిపడి కాతరదృష్టితో వాడివైపు జూచెను.

వెంకట—ఏందుకలాచూస్తావమ్మా! ఈవేళ నిస్సిక్కడినుండి వెళ్ళిపొమ్మని పంతులుగారి యాజ్ఞయైనది. నీనుండి మాపంతులుగారికి చెడ్డపేరు వచ్చుచున్నది. నీకు సిగ్గులేదు. నువ్వన్నీ వదలిపెట్టేశావు. కాని పాపమాయన తలయెత్తుకొని తిరగలేకుండా వున్నారు.

ఈ కేకలు సుభద్రమ్మ చెవినిపడెను. ఆమె యిక్కడకు వచ్చి "వెంకటస్వామీ! యేమిటాలాగు మిగుల మాట్లాడుచున్నావు," అని గట్టిగా కసరెను.

వెంకట—ఏమీ లేదు. ఈయమ్మగారిని ఈరోజే యిక్కడనుండి వెళ్లిపొమ్మని పంతులుగారు శలవైనది. ఈయమ్మ నుంచి పంతులుగారిని దేశమంతా చెప్పుకొనుచున్నారు.

సుభ—నువ్వు వెళ్ళి పంతులుగారిని నేనొక్కసారి రమ్మంటున్నానని చెప్పు.

కమల కన్నులు నీటితో నిండిపోయెను. ఆమె లేచి నిలువబడి, "అమ్మా! ఆయన నెందుకు పిలిచెదరు? ఎవరైనను, జబర్దస్తీచేసి ఒకరి యింట్లో నుండగలరా? నా నుండి మీ కెందుకీ యపఖ్యాతి? నేనిప్పుడే వెళ్ళిపోవుచున్నాను. కమల మరియెన్నడు నీయింట్లో నడుగు పెట్టదని నమ్మండి!"

ఆపత్కాలమందు మనస్సు సంకుచితమై పోవును. ఇదివరకు శర్మ దైవసమానుడనియు, సజ్జనుడనియు భావించిన కమల యిప్పుడు ఆయనను, పిరికిపందనియు, దయాశూన్యుడనియు, దుష్టుడనియు భావించి తనలో నతని నుద్దేశించి, "నీవు వేశ్యతో సమానముగా కూర్చుని పొంగిపోతివి. ఆమె పాదతలమున నీ దృష్టులు బరపితివి. అప్పుడు నీ మర్యాద యేమైనది? ఈరోజున నొక యనాథస్త్రీకి ఆశ్రయ మియ్యవలసి వచ్చుననియా, మర్యాదకు ప్రాకులాడుచున్నావు? నీయాశ్రయ మెవరికి కావలెను? ఇప్పుడే పోయెదను. మాటలుపడుచు నొకరి యింటియందుండుటకు కమల అంత ఆత్మగౌరవము లేనిది కాదు." అని యనుకొనుచు యామె తన మూట చంకను పెట్టుకుని సుభద్రమ్మకు నమస్కారము చేసి కన్నీరు కార్చుచు తత్క్షణమే యక్కడినుండి బయలుదేరెను.

కనుల వీధికనుమ్మముకువద్దకు వచ్చి యెక్కడకు పోవుదునా యని విచా రింపసాగెను. భర్త యింటిలోనుండి తగిలివేసినప్పుడైనను, ఆమెకింత దుఃఖము కలుగలేదు. తానింటినుండి వచ్చి బయటపడుట చాల పొరపాటని ఇప్పుడామె పశ్చాత్తాపపడుచుండెను. "నేనీ సుభద్రమ్మ యూనరా చూచుకొని యింతపని చేసితిని. శర్మ చాల మంచివాడని భావించితిని. కాని యీ విషయములో చాల పొరబడితిని. ఆయన రంగుపూసుకొన్న నక్కవంటివాడని నాకిప్పుడు బోధపడినది. ఇప్పుడు తిరిగి నా యింటికి పోవుట తప్ప మరియొక దారి కనబడదు. నేనొకరిని బ్రతిమాలుకొనునంతటి జరుగు రేమిటి? నాకిల్లు లేదా? వీరింటివద్ద నా జీవితము గడపుకొన వెళ్ళితినా? రెండు మూడు రోజులుండి ఆయన శాంతించగానే నా యింటికి వెళ్ళిపోయి యుందును. అయ్యో దైవమా! కోపమువలన నాబుద్ధి యెంత భ్రష్టైపోయినది? నేనిక వీరింటికి పొరపాటుననైన రాను. నేనే నాచేతులార నీకష్టము తెచ్చి పెట్టుకుంటిని. ఆయన యుద్దేశ్య మేలాగున్నదో!"

ఈవిధముగా ననుకొనుచు కమల మెల్లమెల్లగా ముందుకు అడుగులు వేయుచుండెను. కాని కొంతదూరము వెళ్లునరికి తిరిగీ యామె మనస్సు మారిపోయెను. "నేనెక్కడకు వెళ్లుచున్నాను? ఆయన నన్నింతమాత్రమింట్లో యడుగు పెట్టనివ్వరు. నేనెంత బ్రతిమాలు కొన్నను ఆయన మనస్సు కొంచెమైనను కరుగలేదు రాత్రి కొన్ని గంటలాలస్యమైనదనియే ఆయన నన్ను సందేహించిరి. ఇప్పుడు నేనింటినుండి వచ్చివేసి రెండురోజులు కావచ్చినది. అదికాక నా దుర దృష్టవశమున నేనెక్కడకు వెళ్లుటకాయన యిష్టపడలేదో అక్కడకే వెళ్లితిని. ఇప్పుడాయన నన్ను దూరమునుండి జూచియే అసహ్యించు

కొని మండిపడిపోవుదును. ఆబాధలన్నియు నేనిక సహింపలేను. ఇప్పుడు నేనుండుటకొక స్థలముదొరకిన బాగుండును. కడుపు నిండించు కొనుట కెట్లో తంటాలుపడెదను. బట్టలు కుట్టియైనను జీవింపగలను. దీనికిన్ని తిప్పలెందుకు పడవలెను? ఇదివరకు నన్ను మహాసుఖపెట్టినారా ఏమిటి? తిరిగి యీ సంకెళ్లు నాకాళ్లకెందుకు తగిలించు కొనవలెను? ఆ మన లోకనిందకు భయపడి నన్నింటిలో నుండ నిచ్చినను, చీవాట్లు, బెదరింపులు మరీ యెక్కువగును. మళ్లీ యెందు కాబాధ? ఏదైన నొకయింటి కొరకే ప్రయత్నించెదను. రామతిలకము నా కామాత్రము సహాయము చేయదా? నన్నెల్లప్పుడు తన యింటికి రమ్మని పిలచు చుండెడిది కదా? ఇప్పుడీ కష్టదశలో ఆపాటి దయ చూపదా? పోని, మామగారింటికి పోయిన బాగుండునేమో? కాని నన్ను చేరదీయుట కక్కడ నెవరున్నారు? అమ్మ చచ్చిపోయింది కదా? అక్కడ సుశీలకు జరుగుటయే కష్టము. అటువంటప్పుడు నాకు జరుగు టెట్లు? ఒక వేళ తెగించి వెళ్లినను మాయత్త సాధించి సాధించి చంపక విడచి పెట్టునా! రామతిలక యింటికే పోయి నాస్థితి యంతయు చెప్పుకొందును. ఆమె యేమనునో చూచెదను. గోదావరి యెక్కడకు పోవును కదా! ఏదారి లేక పోయిన గోదావరియే దిక్కు" అని యీ ప్రకారముగా నిశ్చయించుకొని రామప్రసాదు ఎక్కడ యెదురు పడునో యని భయ పడి యిటునటు జూచుచు, జంకుతో రామతిలక యింటికి పోయెను.

రామతిలక యిల్లు జేరి కమల తనలో "ఈమె యింటికెందుకు పోవలెను? మరియొక స్నేహితురాలింటికి బోయిన నాజీవితము గడు వక పోవునా" అని తటపటాయించుచుండెను.

ఇంతలో రామతిలక యామెను జూచి మేడమీదికి రమ్మని సంజ్ఞచేసి పిలచెను. కమల మెల్ల మెల్లగా మేడ మెట్లెక్కి పైకిపోయెను. రామతిలకము గదినూడగానే ఆమె కళ్లు తిరిగి పోయెను. ఇదివరకొక

సారి కమల ఆమె యింటికి వచ్చి యుండెను. కాని ఆమె అప్పుడు క్రింది వసారాలోనే కూర్చొని మాట్లాడి వెళ్లి పోయెను. కాని మేడ చూడలేదు. మేడపై గదియంతయు మంచి మంచి పటములతోను అద్దములతోను అలంకరింపబడి యుండెను. మధ్య దంతపుకోళ్ల పందిరి పట్టెమంచమును ప్రక్కలను పట్టు సోఫాలును అమర్చ బడియుండెను. ఒక వైపు బల్లపైని వెండి పాందానులో తమలపాకులు వక్కలపొడి వాసన ద్రవ్యములు, మరియొక వైపు బల్లపైని అత్తరుదాను, పన్నీరు బుడ్డీ మొదలైనవి యుండెను. కమల గదియొక్క అలంకారము జూచి మిక్కిలి ఆశ్చర్యపడెను.

రామతి—మూట చంకను పెట్టుకుని ప్రొద్దుటే యెక్కడకు బయలుదేరినారు?

కమల—ఆరామాయణ మంతయు తర్వాత చెప్పుతాను. ఇప్పుడు నామీద దయయుంచి నాకు వేరుగా నొక గది కుదిర్చి పెట్టుము. నేనా యింటి యందుండెదను.

రామతి—(ఆశ్చర్యముతో) ఇదేమిటి? మీరిద్దరు జగడమాడినారా?

కమల—జగడ మేమిటి? నాకాలాగుండ వలెనని బుద్ధి పుట్టినది.

రామతి—ఏదీ! నావైపొకసారి చూడండి! ఆ. (మీముఖమే చెప్పు చున్నది.) ఏమి జరిగిందో నిజం చెప్పండి.

కమ—నిజమే చెప్పుచున్నాను. మరియేమియులేదు. కాని నే నుండుట యొకరి కిబ్బంది యైనప్పుడు, ఎందు కక్కడుండి వారిని కష్ట పెట్టవలెను?

రామతి—అబ్బా, ఆ సంగతేదో సరిగ్గా చెప్పుదురూ? ఎందుకంత కోపము వచ్చినది?

కమ—కోపమున కేమియులేదు. కోపమువచ్చిన ఏది యుండి పోయినది?

రా. తి—మీ రెంత దాచుచున్నను నాకు బోధపడిపోయినది. కమలాబాయిగారూ! మీరు తప్పుపట్టకపోయిన నేనొకసంగతి చెప్పె దను. ఎప్పుడో యొకప్పు డీవిధముగా జరుగునని నేను మొదటనే యూహించితిని. బండి కొకవైపు అరబ్బీగుఱ్ఱమును ఇంకొకవైపు కంచర గాడిదను కట్టిన జత సరిపడునా? మీరు జమీందారుల యింట్లో పడ వలసినవారు. కాని దురదృష్టవశమున మీ కాళ్లు కడుగుటకైనను తగని యీ మూర్ఖుని పాలబడిరి. మీరు కనుక యిన్నిరోజులు నిర్వ హించుకొని వచ్చారు. మరిఒకరైతే యీపాటే సంసారమునకు నీళ్ళ దార వదలి పారిపోయి యుందురు. దేవుడు నాకే యిటువంటి సౌంద ర్యము తెలివి యిచ్చిన నే నీ పాటి బంగారుమేడలే కట్టించియుందును. మీ యుద్దేశమేమిటి? మీకు చదువు సంగీతములు బాగుగా వచ్చునా?

కమ—చిన్నప్పుడు నే నొకదొరసాని వద్ద చదువు కుట్టుపనులు నేర్చుకున్నాను.

రా. తి—మరికొన్ని సంవత్సరములు చదువుకొనిన బాగుండి ఉం డును. మనజీవిత మెట్లుగడుపుకొనుటయో దానియుద్దేశమేమో బాగా బోధపడియుండును. అప్పుడు మనకీస్థితి రాకపోయియుండును. మన తల్లితండ్రు లెవరికి కట్టిపెట్టితే వారివద్ద పడియుండుటకు మనము మేకలము గొఱ్ఱెలమునా? నీవీ కష్టములన్నియు పడవలెనని దేవుని యుద్దేశ్యమైన యెడల అప్సరసవంటి యీ సౌందర్యము నీ కెందు కిచ్చెను? ఆడువారిని నీచముగా జూచుట మనదేశమం దాచారమై పోయినది. తక్కినదేశములలో స్త్రీలు సర్వస్వాతంత్రులై వారికిష్టము వచ్చినవారిని వివాహమాడుటలేదా? ఇష్టములేనియెడల వివాహము మాని స్వాతంత్రముగా జీవించుటలేదా? మనదేశములో మాత్రము పూర్వాచారమని పేరుచెప్పి పురుషులు స్వార్థపరులై మనగొంతుకలు కోయుచున్నారు.

కమ—(కొంత సేపాలోచించి) ఏంచేస్తాను? లోకులేమనుకొంటారో యన్న భయమొకటున్నది కదా! లేకపోతే సౌఖ్యపడవలెనని యెవరి కుండదు?

రా. తి—ఈ యనుభవమంతేయు దాని ఫలమే! నా తల్లితండ్రులు కూడ నన్నొక ముసలియుద్ధునకు కట్టిపెట్టినారు. అతడు చాలాభాగ్యవంతుడు. అనుభవించుటకు నా కక్కడ అన్ని సౌఖ్యములు ఉండెను. దేనికీ కొదువలేదు. కాని అతని ముఖముచూచిన నాకు పరమాసహ్యముగా నుండేది. ఐనా ఏలాగో ఒకలాగు కష్టముతో అక్కడ ఆరునెలలు గడిపాను. కాని ఎన్నాళ్ళావిధముగా గడపగలను? మరి భరింపలేక యింటినుండి లేచి వచ్చేశాను. ఏడ్చుచు కష్టములతో గడపుటకు మనకీజన్మ మివ్వబడలేదు. జన్మమెత్తినందుకు కొంచెమైనను సౌఖ్యపడకపోయిన నేమిలాభము? మొదట నాకుకూడ యెక్కడ చెడ్డపేరు వచ్చునో, లోకులేమనుకొనెదరో యని చాలభయముగాను జంకుగాను ఉండెను. కాని యింటినుండి లేచివచ్చేటే తరువాయి అన్ని జంకులు, అన్ని భయాలు వాటంతటవే ఒదిలిపోయాయి! గొప్ప గొప్ప వాళ్లందరు నా సంగీతమువిని, నా సౌందర్యము నా శీలము జూచి యింటిచుట్టూ తిరుగుటకు ప్రారంభించారు. నే నదివరకే కొంత సంగీత మింటివద్ద నేర్చుకొన్నాను. ఇంటినుండి లేచివచ్చిన తర్వాత మళ్ళీ బాగా నేర్చుకొన్నాను. కొంచెము రోజులలోనే నా ప్రభ పట్నమంతా వ్యాపించింది. ఇప్పు డూళ్లో ఒక్క పెద్దమనుష్యులే కాదు, వర్తకులు పండితులు, భక్తులు ఒకరననేల అందరూ కూడ నా యనుగ్రహములు సంపాదించుటయే మహాభాగ్యమని తలచుచున్నారు. దీనినవమర్యాదయని యెట్లనుకొనను? నేనొక్క ఖబురుపంపిన కృష్ణమందిరము యొక్క మహంతుకూడ చేతులు కట్టుకొని నా ముందు హాజరౌతాడు. దీనిని లోకు లేమనుకొన్నను అనుకోనీ.

కమ—సరే. సంగీతము బాగా నేర్చుకొనవలెనంటే యెన్ని రోజులు పట్టును?

రా.తి—నీ కారు నెలలలో బాగావస్తుంది. అంతశాస్త్ర మెవరికి కావాలి? నాలుగు రాగాలు బాగా ఆలాపనచేయుట, నాలుగు జావళీలు, నాలుగు నాటకపద్యాలు వస్తేచాలు. ఇక నీయంత వారుండరు. అందం, చమత్కారం మాట చెప్పే దేమిటి? ఆ రెండు మూర్తీభవించినట్లు దేవుడు నిన్ను సృష్టించాడు. కమలాబాయి! నేను ఒట్టు పెట్టి చెప్పుచున్నాను. నీ వొక్కసారి ఈ యినుపసంకెళ్లు త్రెంపివేసినావంటే చూడు యీ పెద్దమనుష్యులందరు నీ గుమ్మముకువద్ద ఏలా పడిగాపులు పడిఉంటారో?

కమ—(విచారముతో) ఇది చాల అసహ్యముగా కనబడుచున్నది.

రా.తి—ఆఁ. ఆఁ. చెప్పు. చెప్పు అల్లరి చిల్లరవాళ్లందరితో సిగ్గు విడచి యుండవలసి వచ్చునని యూ నీ యుద్దేశము? మొదటిలో నేను కూడ అలాగే భయపడ్డాను. కాని తర్వాత బోధపడింది. ఇక్కడకు అల్లరిచిల్లర వాళ్ళు వచ్చుటకు సాహసింపలేరు. పెద్దమనుష్యులే వస్తారు. కాని వాళ్ళను మాత్రము లోబరచుకొనవలెను. నిజంగా ఆ వచ్చినాయన పెద్దమనిషే. ఐతే నీ మనస్సు దానంతటదే ఆయనను లోబరచుకొనుటకు ప్రయత్నించును. అప్పుడు సిగ్గుమాటే నీకు తోచదు. నీ మన స్వతస్సుతో కలియకపోయిన మెల్లిగా బాతాఖానీతోనే ఆయనతో కాలము గడపివెయ్యి. కాని డబ్బు మాత్రం నీకు వీలైనంతవరకు వారిదగ్గరనుండి లాగు. చివరకు వారి ప్రాణం విసిగి వారంతట వారే పోతారు. కాని యీపని మొదలు పెట్టడంమాత్రం చాలా కష్టంగా నుండును.

కమ—(చిరునవ్వుతో) నాకొక యిల్లు ముందర కుదిర్చి పెట్టుదూ!

రా. తి—(తనలో) చేప వలలో పడబోవుచున్నది. అది తప్పించు

కొని పోకుండ జాగ్రత్త పడవలెను. (ప్రకాశముగా) నీ కొరకు కీయిల్లే సిద్ధముగా ఉన్నది. సౌఖ్యముగా ఉండు.

కమ—నీతో కలసి యుండజాలను.

రా. తి—ఏమీ! నీ పేరు చెడిపోతుందనా?

కమ—ఆఁ!......ఆఁ?......అదికాదు.

రా. తి—నీ కులం బంగారంగాను!

కమ—నన్నెందుకాలా వేళాకోళం చేస్తావు?

రా. తి—లేకపోతే యేమిటి? రామప్రసాదంగారు కోపపడుతా రనియా?

కమ—నేనేమి చెప్పను?

రామతిలకము కమల యుద్దేశము లన్నింటిని వేళాకోళముక్రింద కట్టి యుక్తియుక్తముగా వాని నన్నింటిని ఖండించి ఆమెను జవాబు చెప్పలేకుండ జేసివేసెను. ఐనను, స్వాభావముగా మనుష్యులు అస హ్యించుకొను అధర్మము, దురాచారమునుండి కమల హృదయము చలించుచుండెను. కాని ఆమె తన భావములను పైకి చెప్పజాల కుండెను.

రా. తి—(తిరిగి కమలతో) నీ కెంత అద్దెలో ఇల్లు కావలెను? ఆసంగతి చెప్పుతే మాతమ్మునితో జెప్పి ఇల్లు మాట్లాడించెదను.

కమ—ఒకటి రెండు రూపాయలలో కావలెను.

రా. తి—ఐ తే నీ కక్కడేలాగు జరుగుతుంది?

కమ—కుట్టుపని చేసుకొని జీవించెదను.

రా. తి—ఒక్కదానివే వుంటావా?

కమ—లేకపోతే మరెవరొస్తారు?

రా. తి—ఆఁ. ఏమీ! చిన్న పిల్లలాగు మాట్లాడుతున్నావు! అయ్యో! వెఱ్ఱిదానా! కళ్ళుండి కూడ గ్రుడ్డిదానిలా గగుచున్నా

పోయెను. ముఖ మెఱ్ఱబారెను.

రా. తి—(కమలకు ధైర్యముచెప్పుచు) పోనీ, సరేలే. మొహం కాళ్లుచేతులు మొదట కడుక్కో. కొంచెం ఫలహారం చేద్దువుగాని. తరువాతసంగతి ఆలోచించుదాం. రాత్రి తెల్లవార్లు నువ్వు నిద్రపోయినట్టు కనపడదు.

కమ—నీళ్లెక్కడున్నాయి?

రా. తి—(చిరునవ్వుతో) అన్నీ నీకోసరకు సిద్ధంగానే వున్నాయి. పోయి నీళ్ళుపోసుకో.

రామతిలకమువద్ద నున్న ముసలమ్మ కమలకు నీళ్లగది చూపించి సబ్బు, తువ్వాలు అక్కడపెట్టెను. తర్వాత ఆ ముసలమ్మ ఆమెకు తలదువ్వి, జడవేసి, కట్టుకొనుటకు పట్టుచీరె, పట్టుజాకెట్టు నిచ్చెను. కమల మేడపైకి పోగానే రామతిలకము నవ్వుచు ఆమెను జూచి, "ఒక్కసారి అద్దము వద్దకు పోయి ముఖము చూచుకో," అని చెప్పెను. కమల అద్దము యెదుటకు పోయి నిలువగా ఆమెకు ఆ యద్దములో సౌందర్య దేవత ప్రత్యక్షమైనట్లుండెను. కమల తానంత సౌందర్యవంతురాలనని యిదివర కనుకొనలేదు. లజ్జాయుక్తగర్వముతో ఆమె ముఖము వికసించెను. ఈ యానందము వలన ఆమె మత్తెక్కిన స్థితిని మరచెను. రామతిలకము చెప్పినట్లామె యొక సోఫాపై పరుండెను.

రా. తి—(ముసలమ్మతో) ఏ మవ్వా! ఇప్పుడు సెట్టి మన వలలో పడుతాడా?

ముస—ఇంక మన వలలో పడక యేమగును?

కొంతసేపైన తర్వాత వంటవాడు వెండి పళ్లెముతో మిఠాయిలను పళ్ళను తెచ్చి కమల యెదుట పెట్టెను. కమల ఫలహారము చేసి తాంబూలము వేసికొని తిరిగి యద్దము వద్దకు పోయి నిలువబడెను.

అప్పుడామె తనలో “ఈ సౌఖ్య మంతయు వదలివేసి నేనా చీకటింట్లో నెందుకు పడియుండవలెను?”

రా. తి.—ఏమీ కమలా! ఒకవేళ రామప్రసాదంగారు నీగురించి యడిగిన యేమని చెప్పుమన్నావు?

కమ.—నే నిక్కడ లేనని చెప్పివెయ్యి.

ఇప్పుడు రామతిలకముయొక్క మనోరథము పూర్తి యయ్యెను. ఆమె తనలో “బలభద్రరావునాయుడు నాపై చిరికన్ను వేసినాడు కాని యీ సౌందర్యవతిని జూచి నా కాళ్ళపై వడక మానడు.” అని యనుకొనసాగెను.

## ౧౪

కృష్ణశర్మకు గోపాలశాస్త్రి యను అన్న కలడు. ఆతడే వారి ఇంటి వ్యవహారము లన్నియు జూచుచుండును. కాకవరపు వారికి పిత్రార్జితపు భూవసతి చాల కలదు. అదికాక ఇచ్చిపుచ్చుకొను వ్యవహారము కూడ నుండెను. ఆతడు కొన్ని యెకరముల భూమియందు స్వంత వ్యవసాయమును పెట్టించుచుండును. ఆతనికి ఒక కుమారుడు, ఇద్దరు కుమార్తెలును గలరు. కుమారుని పేరు మోహనరావు. కుమార్తె లిరువురి పేర్లు సావిత్రి, సరస్వతి. భార్య పేరు జానకమ్మ. తల్లిదండ్రుల కేకపుత్రుడైనవా డదృష్టవంతుడు. వాడడుగుటె మహాభాగ్య మని కోరిన వస్తువుల నెల్ల నిచ్చుచు తల్లిదండ్రు లతి గారాబముగా జూచుచుందురు. పాడుపని యేదైనను చేసిన యెడల మందలించి గట్టిగా చీవాట్లైనను పెట్టరు. ఈ ముద్దు వలననే మోహనునకు చిన్నతనము నుండియు మంకుపట్టు పట్టుట తానన్నమాట చెల్లించుకొనుట మొదలైనవి బాగుగా నలవాటయ్యెను. పెద్దవాడైనకొలది

బద్ధకము, నిర్లక్ష్యము, కోపము ఎక్కువై ఉద్రిక్తుడయ్యెను. ఎంత మొండితనము చేసినను, కుమారుడు కండ్లయెదుట నుండుట వారికి సంతోషముగా నుండెను. ఒక్క దినమైనను కుమారుని వదలి వారుండ లేకుండిరి. మోహనుని తనతో కళ్యాణపురము పంపమనియు, అక్కడ స్కూలులో ప్రవేశ పెట్టెదననియు నీ పల్లెటూరిలోనుండి చదువుసంధ్యలు లేక చెడిపోవుచున్నాడనియు, కృష్ణశర్మ అన్నతోను, వదినతోను ఎన్నోసార్లు బోధపరచి చెప్పెను. కాని వారు కొడుకు నెడబాయుట కొప్పుకొనకుండిరి. మోహను డాపల్లెటూరి బడిలో నాలుగవ క్లాసువరకు మాత్రమె చదివెను. ఈ చదువు చాలుదాయని జానికమ్మ యుద్దేశము. "ఇంతో అంతో ఉన్నది. ఇదంతా ఎవరు తినను? చదువు నేర్చి మావా డుద్యోగము చేయవలసిన అవసరం లేదు. ఈ ఒక్క నలుసు మా కళ్లయెదుట ఉంటే మాకదే చాలు." అని జానికమ్మ అనుచుండును.

మోహనుడు తన పినతండ్రితో కూడ కళ్యాణపురమునకు వెళ్లవలెనని చాలా సరదా పడుచుండెను. పినతండ్రియొక్క షోకైన దొర వేషము జూచి, తానుకూడ నట్లు దుస్తులు ధరింపవలెనని మనస్సులో చాల యుబలాట పడుచుండెను. ఇంటివద్ద దేనికిని లోటులేదు. కాని పల్లెటూరిలో సీజోళ్ళు, మేజోళ్ళు, బట్టలు మొదలైన వెక్కడ దొరకును? ఈ వేషముతో గుఱ్ఱపుబండి నెక్కి షోకుగా పట్నమంతయు తిరుగవలెనని ఆతనికి చాల కోరికగా నుండెను. మోహనునకు పినతండ్రియన్న నెంతో గౌరవము. తల్లిదండ్రులమాట కెదిరించి జవాబు చెప్పును కాని పినతండ్రియన్న నోరెత్తడు. శర్మ వేషభాష లాతని లోబరచుకొనెను. శర్మ ఎప్పుడు తన గ్రామమునకు వచ్చినను మోహనునికొరకు, మంచి రకరకముల బట్టలు, జోళ్లు, మేజోళ్లు మొదలైనవి తెచ్చుచుండెను. అవి చూచి మోహనుడు పొంగిపోవు చుండును.

ప్రతి సంవత్సరాది పండుగకు శర్మ తన గ్రామమునకు పోవుచుండుట మామూలు. ఈసారి కూడ పండుగ వారము దినము లున్నదనగనే తాను పండుగకు వచ్చుచున్నానని అన్న పేర నుత్తరము వ్రాసెను. మోహనుడు తన పినతండ్రి, పట్టుసూట్లు, వార్నీసు జోళ్లు తనకొరకు తెచ్చినట్లును, తాను వాటిని ధరించి షికారు తిరుగుచున్నట్లును, రోజూ కల గనుచుండెను. సంవత్సరాదికి ముందు రోజున గోపాల శాస్త్రి తమ్ముని కొరకు పగటి రైలునకుగూడ బండి కట్టించుకొని వెళ్లెను. కాని శర్మ రాలేదు. రైలు తప్పిపోయినదేమో యని మరునాడు ప్రొద్దుటకూడ రైలునకు బండి పంపించెను. కాని కృష్ణ శర్మ రామతిలకము పాట సందడిలో నుండగ నిక్కడికి కెట్లు వచ్చును? ఆతడు పండుగ కింటికి రాకపోవుట కిదియే మొదటి పర్యాయము. మరది పండుగకు రాలేదని జానికమ్మ కంట దడిపెట్టెను. ఆతడు రాలేదు కదా యని యామె రోజంతయు అనుకొనుచుండెను. మోహనునకు చాల యాశాభంగము కలిగెను. క్రొత్త బట్టలు లేనందున, ఆతనికి పండుగ పండుగవలెనే లేదు. శాస్త్రికూడ తమ్ముడు రాలేదని చిన్నపోయెను. ఈ యేటి పండుగ వారికి పండుగవలెనే లేదు. ఇరుగుపొరు గమ్మలక్కలు జానికమ్మను జూచి, "ఎందుకమ్మా! వాళ్లు రాలేదని అల్లా విచారిస్తావు? వాళ్లు పట్నంలో అన్ని తమాషాలు చూస్తూ హాయిగనున్నారు. ఈపల్లెటూరికి వచ్చిన వారి కేమి తోచును? సత్యకాలపుదానవు." అని ఓదార్చుచుండిరి. వారి యింట్లో ప్రతి పండుగకు చాల పిండివంటలు చేయుటవాడుక. కాని ఈసారి అటులచేయలేదు. మోహనుడు ముఖము వేలవేసికొని యొక మూల కూర్చుండెను. సాయంత్రము పడగానే తల్లివద్దకు వచ్చి, "అమ్మా! నేను బాబయ్యవద్దకు వెళ్లెదను. నాకు వెళ్లవలెనని చాల సరదాగా యున్నది. నన్ను పంపించవా?" యని యడిగెను.

జాని—అక్కడ మీకు సంరక్షణ చేయుట కెవరు కూర్చున్నారు?

మోహ—యేమి? బాబయ్య పిన్ని ఉన్నారు కారా?

జాని—ఎక్కడ పిన్ని? ఎక్కడ బాబయ్య? అంత ఆ పేక్ష ఉంటే పండుగకు వచ్చే యుందురు. రాకేము సరికదా ఉత్తరమైనా రాశారు కారు.

మోహ—అబ్బా! నేను వెళ్లక మానను.

జాని—ఒక్కసారి చెప్పేను. అట్టె సన్నల్లరి పెట్టకు. నువ్వక్కడకు వెళ్లడం నా కిష్టంలేదు. ఎందుకమ్మా ఇప్పుడు వాళ్లింటికి?

జానికమ్మ అడ్డుపెట్టుచున్నకొలదియు మోహానుని పట్టెక్కువగుచుండెను. చివరకు వానికి కోపము వచ్చి ముఖంముడుచుకొని అక్కడనుండి లేచి వెళ్లిపోయెను. శాస్త్రి అప్పుడు వీధిలోనికి వెళ్లియుండెను. చివరకు మోహానుడు ఇంటిలో నెవ్వరితోను చెప్పకుండ పినతండ్రి వద్దకు వెళ్లిపోవుటకు నిశ్చయించుకొనెను. "ఎప్పటి కప్పుడే యేదో వంక చెప్పి నన్ను కళ్యాణపురం వెళ్లనివ్వకుండ నున్నారు. ఎల్లప్పుడు ఈ పల్లెటూరిలోనే పడిఉంటె అక్కడి వింతలు విచిత్రములు చూడడ మెప్పుడు? పట్నవాసపు సరదా తీరడ మెప్పుడు? వీళ్ళేలాగా ఇష్టపడి నన్ను పంపరు. అందువలన వీళ్లతో చెప్పకుండ వెళ్లిపోతే మంచిది." అని తనలో భావించుకొనుచుండెను.

ఆ మరునాడు మోహానుడెవరికి తెలియకుండ ఇల్లుదాటి పోవుటకు సమయము వెదకుచుండెను. రాత్రి అందరు నిద్రపోయిన తర్వాత మెల్లగా లేచి యింటినుండి బయలుదేరెను. వారియింటినుండి స్టేషనుకు మూడుమైళ్లదూరముండెను. ఎటువైపుజూచిన అంధకారమయముగా నుండెను. ఊరిబైటకు రాగానే రుంయి, రుంయి మను శబ్దమువిని యాతడు హడలిపోయెను. కాని త్వరలోనే అది వరిమొక్కల యొక్క రాపిడివలన కలిగిన శబ్దమని తెలిసికొని కొంత స్థిమితపడెను. కొంత

దూరములో నొక పెద్దమామిడి చెట్టుండెను. అదివరకొక కాపు పిల్లవాడు దానిపైనుండి పడి చచ్చిపోయెను. ఆ చెట్టు సమీపించగనే మోహనునకు జరగిన సంగతి జ్ఞప్తికివచ్చి భయముతో ఒడలు ముచ్చెమటలు పోసెను. కాని ధైర్యము చిక్కబట్టుకొని అక్కడనుండి వేగముగ నడువసాగెను. ఆ పల్లెకు రెండుమైళ్లదూరము నందొక రావి చెట్టుకలదు. ఆ చెట్టు దయ్యములకు, భూతములకు నివాసస్థలమనియు, వచ్చిపోవు ప్రయాణికులను నిలువబెట్టి యా దయ్యములు ప్రశ్నలు వేయుననియు, వాటికి జవాబు చెప్పువారు మాయమగుదురనియు, ఆ గ్రామములో నొక ప్రతీతికలదు. ఈ కారణమువలన రాత్రులయందా దారిని ఒంటరిగా వెళ్లుటకు సాహసించరు. సాహసించి వెళ్లిన వారు వాటిచేష్టలగురించి అద్భుతముగ చెప్పుచుందురు. మోహనుడు మొదటినుండియు ఆ చెట్టును దాటుటెట్లో యని భయపడుచుండెను. కాని మోహనుడంత పిరికివాడు కాడు. అదిగాక రైలుకందవలెనన్న ఉత్సాహమాతనికి క్రొత్తబలమును, ధైర్యమును, కలిగించెను. ఆతడు తెచ్చిపెట్టుకొన్న ధైర్యముతో ఆ చెట్టును దాటుటకు త్వరగా నడువనారంభించెను. కాని చీకటిలో భయంకరముగ నగపడు ఆ చెట్టును చూడగనే వానిధైర్యమంతయు ఒక్కనిముషములో మాయమయ్యెను. ముందొక్క అడుగు వేయుటకైనను వానికి సాహసము కలుగకుండెను. అక్కడే నిలువబడిపోయి, "ఏమిచేయుదునా?" యని యాలోచింప మొదలు పెట్టెను. ఎటుజూచినను మనుష్యసంచారమను మాటయే లేదు. ఒక్కపశువుయొక్క సందడియయ్యినను, వానికి ధైర్యము కలిగించియుండును. ఏ బాటసారియైనను కలియునేమో యని ఒక్కక్షణమాతడు నిరీక్షించెను. కాని రాత్రులయందు పల్లెటూరి బాట నెవరు నడచెదరు? ఇక నొకగంటలో రైలువచ్చును. కనుక ఆలస్యముచేసిన తానుపడ్డ శ్రమయంతయు వృధాయగునని, ఎట్లో

లేని ధైర్యమును తెచ్చిపెట్టుకొని దాశరథీశతకములోని పద్యములను గట్టిగా చదువుచు, ముందునకు బయలుదేరెను. ఎంత మరచుటకు ప్రయత్నించినను మరపురాక ఎండకాలపు టీగలవలె ఆ దయ్యములు, భూతములు ఎంత తోసివేసినను ఆతని కండ్లయెదుట ఆడుచున్నట్లేయుండెను. ఇంతలో జీమూతమువలెనున్న రావిచెట్టాతనికి దగ్గరపడెను. మోహానుడు నిదానముతో ఆ చెట్టువైపు జూచెను. కాని అంధకార బంధురముగ నుండుటవలన ఏమియు కనపడలేదు. భయముచే ఆతని దేహము వడకిపోవుచుండెను. ఇంకను గట్టిగ ఆంజనేయదండకమును చదువుచు ఇటునటు జూచుచుండెను. ఆతని భయమే పలువిధము లైన దయ్యములు, భూతములుగ కనబడుచుండెను. అకస్మాత్తుగ, ఒక పెద్దకోతి దక్షిణపువైపు కూర్చున్నట్లగపడెను. దానితో ఆతనిమీద ప్రాణములు మీదికెగిరిపోయి నట్లయ్యెను. కాని క్షణములో నది మట్టికుప్పగ మారిపోయెను. ఆతడా చెట్టుక్రిందకు వచ్చినతోడనే ఎవ్వరో గొంతుకనొక్కివేసినట్లై, నోటివెంట మాటరాలేదు. ఇంతలో తనముందునుండి ఏదో పరుగెత్తిపోవుచున్నట్లు జూచి హడలిపోయెను. దాని ఆకారము కుక్కవలెనుండెను. అదివరకు, భూతములు కుక్కల ఆకారముతో సంచరించుచుండునని వినుటవలన వాని అనుమానము స్థిరమయ్యెను. కాని చేయునది లేక అతడు వీరపురుషుడు ధైర్యముతో తనశత్రువును సిరీక్షించుచున్నట్లు నిలువబడెను. మామూలు ప్రకారమా కుక్కయేమియు చేయక తనదారిని పోవుచుండెను. ఇంకను అనుమానము తీరక, దానిని అదలించి తరమెను. కుక్క భయముతో తోకముడుచుకొని మొరుగుచు పాఱిపోయెను. అదిభూతమే యైన యెడల ఏదో ఒకలీలచేయక మానదనియు, అదితప్పక కుక్కయే యనియు, నిశ్చయపరచుకొని తన పిరికితనమునకు తనలో తానే సిగ్గు పడుచు, తన పిరికిహృదయమును సిగ్గుపరచుటకు కొన్ని నిముషములా

చెట్టుక్రింద ధైర్యముగా నిలువబడెను. ఇంకను తృప్తిపొందక తన ధైర్యమును నిర్ధారణచేసుకొనుటకు రెండుచేతులతో నారావి చెట్టుకొమ్మలను పట్టికొని ఆడించెను. ఇది విచిత్రమైన సాహసము. ముందునకు వెళ్ళినను య్యి, వెనుకకువెళ్ళినగొయ్యి. చిన్నచప్పుడైనను ప్రాణముపోయినంత భయము. ఇట్లుండిన ఈ విషమపరీక్షయందు జయము నొంది, గర్వముతో మోహనుడు ముందునకు నడచెను.

౧౫

కమల తమయింటనుండి వెళ్ళిపోయినతర్వాత శర్మ విచారించుచు, తన లో "నేను చాలతొందరపడితిని. కమల ఏమైనదో? పాపమెక్కడకుపోయినదో? తనయింటికే వెళ్ళిపోయిన బాధలేదు. కాని అక్కడ కామె ఎంతమాత్రము వెళ్ళదు. ఏ నూతిలోనో, ఏ గోతిలోనో పడలేదుకదా? కూలిడిపోవారి చేతులలోపడిన ఇక విడిపించుట అసాధ్యము. ఆదుష్టులిటువంటి సమయము కనిపెట్టియే ఇట్టి నిరాధారులను, అనాథలను లోబరచుకొందురు. సాహసవంతుల కాధారము లేనప్పుడు శౌర్యమునకుదిగుదురు. పిరికివారి కాధారము లేనప్పుడు యాచనకు దిగుదురు. స్త్రీలకాధారము లేనప్పుడు సిగ్గునైనను విడచెదరు. లేదా ఆత్మహత్యనైనను జేసికొందురు. స్త్రీని ఇంటినుండి వెడలగొట్టుట, నోటినుండి మాటజార్చినట్లే. నేనీ విషయమున చాల పొరబాటు చేసితిని. ఇక మర్యాదకొరకు వెనుక ముందుజూచిన లాభము లేదు. ఆమె జీవితము నాశనము కాకుండనే ఆమెను రక్షించవలెను." అని అనుకొనుచు, శర్మవెంటనే దుస్తులధరించి, రామప్రసాదింటికి బయలుదేరెను. "నాకు వారింటివద్ద ఎవరును ఎదురుపడరు కదా? రామప్రసాదు నన్నుజూచి ఏ మనుకొనునో? ఒకవేళ నాతో

దెబ్బలాటకు దిగిన చాలకష్టము." అని భావించి, సాధ్వ్యాత్రోవనుండియే మరలి యింటికివచ్చెను. పదిగంటలు కొట్టగనె శర్మ భోజనము చేయుట కింటిలోనికి వెళ్ళెను. ఆతనిని జూచి సుభద్రమ్మ చికాకుతో, "ఈ రోజున తెల్లవారకుండానే కమలమ్మను పట్టించారేం? ఆమె యింటియందుండుట యిష్టము లేనియెడల నెమ్మదిగ చెప్పి పంపివేయ కూడదా? ఆముసలి మొద్దు వెంకటస్వామిచేత కబురు పంపడమేమిటి. వాడు ముక్కు మొఖం చూడకుండ నోటికివచ్చినట్లు ప్రేలాడు. పాప మామె నోరైనను మెదపకుండ నేడ్చుచు వెళ్ళిపోయినది. సిగ్గుచే నేను తల నెత్తికోలేక పోయాను. నాతోనే ముందుగ మీయుద్దేశము చెప్పిన, నే నామెను మెల్లిగా మంచిమాటలతో సమాధానపరచి పంపివేసియుందును. ఆమె యంత కోపపరచుకొనక పోవుటకు పల్లెటూరి తెలివితక్కువ పిల్లకాదు. ఇదేమీ లేదు. నవాబుగారి హుకుంలాగ వకటే ఆజ్ఞ. మంచి, చెడ్డ ఆలోచించడమేమైనా యున్నదాయేమిటి? ఒకరనుకొని పోతారని యింతభయముంటుందా? ఆమె తిరిగీ యింటికి వెళ్ళిపోకపోతే యికముందు ఆమెగతి యేమవుతుందో? ఎక్కడికి పోయినదో ఏమిటో? ఈ దోషమంతా యెవరిది? ఒకదిక్కులేని ఆడుదానిని నాలుగురోజులు చేరదియ్యలేకపోయాం." అని విసుగుకొనుచు సుభద్రమ్మ మూతిముడుచుకొని వకమూల కూర్చుండెను. శర్మ నేరమొప్పుకొన్న అపరాధివలె తలవంచుకొని మౌనముతో నీ మాటలన్నియు వినుచుండెను. ఆతని మనస్సునందేమి భావించెనో ఆమాటలే సుభద్రమ్మ నోటినుండి విని, మరియేమియు మారుమాటాడజాలక, తొందరగ భోజనముచేసి కచేరికి వెళ్ళిపోయెను. వారియింటిలో పాటకచ్చేరీ జరిగి మూడుదినములే యయ్యెను. ఇదివరకు కచ్చేరీలో నందరును, శర్మ నతిమర్యాదస్థుడనియు, యోగ్యుడనియు, నెంచి ఆతని నెంతో గౌరవముతో జూచుచుండిరి. కాని ఈ రెండు

నూతనరోజులు సంగీతము పాశ్చాత్యదేశములలో చాలామార్పు కలిగెను. ప్రొఫెసరు శర్మతో పరిహాసముగ మాట్లాడజొచ్చిరి. “శర్మగారు! మీ రాగానతిలకమునుమీరిన లబ్ధప్రశస్తనాయుడు మరియొకలాగున అసమానముగా పాడుచున్నాడట.” యని యొకస్నేహితుడు ప్రశ్నించెను. “అన్నగారు! దేవాలయోత్సవములు కదా? గోదావరియొడ్డున చాలతమాషాగా ఉంటుంది. అక్కడ యేదైనా పాట్ పెట్టించకూడదా? సరస్వతిని పలికించండి. పాట ఒకమోస్తరుగా నుంటుంది. కాని ఆ చక్కదనం మాత్రం అప్సరసను మించిఉంటుంది.” అని యొకస్నేహితుడు సలహాయిచ్చెను. ఈమాటలు వినుచున్నప్పుడు శర్మకు చాలకష్టముగను, అసహ్యముగను, ఉండెను. “ఆతడు తనలో, నేను వేశ్యాదళారి ననుకొన్నారు కాబోలు? నాతో పరిచయము ఇంతనీచముగ మాట్లాడుచున్నారు.” అని విసుకకొనజొచ్చెను. కచ్చేరి బంట్రోతుల యందు కూడ శర్మకు మార్పు కనబడుచుండెను. శర్మ ప్రాణము విసిగి ఒకమూలకు పోయి కూర్చొని పాటకచ్చేరీ పెట్టించినందుకు తన్ను తానే నిందించుకొనుచుండెను.

ఈ రోజున కూడ ఈయెత్తిపొడుపులను వినలేక కచ్చేరీనుండి త్వరగా నింటికొతడు వచ్చివేసెను గుమ్మమువద్దకు రాగానే మోహనరావు ఎదురై ఆతనికి నమస్కరించెను.

కృష్ణ—(ఆశ్చర్యముతో) మోహన్! ఎప్పుడు వచ్చావు?

మోహ—ఈరైలుపైననే వచ్చాను.

కృష్ణ—ఇంటివద్ద అందరూ క్షేమంగా ఉన్నారా?

మోహ—ఆఁ. అందరూ క్షేమంగానే యున్నారు.

కృష్ణ—ఎప్పుడు బయలు దేరావు? తొమ్మిదిగంటలబండిమీా దేనా?

మోహ—లేదు. బాబయ్యా! బయలు దేరడమేమో రాత్రి ఒంటిగంటబండీపైనే బయలు దేరాను. కాని బండీలో నిద్రపట్టి పోవుట

వల్ల రంగపల్లెవరకూ వెళ్ళిపోయాను. తిరిగి అక్కడ పన్నెండుగంటల బండిమీద బయలుదేరి వచ్చాను.

కృష్ణ—మంచిపనిచేశావు భోజనమైందా?

మోహ—ఆఁ. ఇప్పుడే భోజనం చేశాను.

కృష్ణ—నేనీసారి పండుగకు రాలేదని వదినెకు కోపంవచ్చింది కాబోలు. అన్నయ్య ఏమైనా అన్నాడా?

మోహ—రెండురోజులు మీకోసరకు మేమెదురుచూశాం. నాన్న గారు బండిమీద రైలుకు వెళ్లారు. మీరు రాలేదని అమ్మ కంట తడిపెట్టుకుంది. నాకక్కడ ఏమీ తోచిందికాదు. అందుచేత రాత్రి బండిమీద బయలుదేరి వచ్చాను.

కృష్ణ—ఐతే యింట్లోవాళ్ళతో చెప్పకుండానే వచ్చావాఏమిటి?

మోహ—చెప్పకేం? అమ్మతో అన్నాను. వాళ్లసంగతి మీరెరుగరా? ఎంతచెప్పినా అమ్మ ఒప్పుకున్నదికాదు.

కృష్ణ—ఐతే వాళ్ళు నీకోసం బెంగపెట్టుకుంటూ ఉంటారు. పోనీ రావడం మంచిపనేచేశావు. నాకు నిన్నుచాలా చూడవలెనని యున్నది. ఎలాగా వచ్చావుగనుక నిన్నేదైనా స్కూలులో ప్రవేశ పెట్టుతాను.

మోహ—ఔనుబాబయ్యా! నాకూ చదువుకోవలెననే ఉంది.

"మోహనరావు ఇక్కడ సురక్షితముగా ప్రవేశించినాడు. మీరేమీ బెంగపెట్టుకోనవద్దు. ఇక్కడ స్కూలులో ప్రవేశపెట్టుచున్నాను" అని శర్మ అన్నకు తంతినిచ్చి, తిరిగి మోహనునితో తమయింటి సంగతులు, గ్రామములోని సంగతులు, సవిస్తరముగ నడుగుచు, సంతోషముగ వినుచుండెను. పట్నవాసమందులేని ఒకవిధమగు సౌఖ్యము గ్రామ్య జీవితమునందు కలదు. ఆతడు తమ గ్రామమును గురించి, ప్రతి చిన్నసంగతియు అడిగి తెలిసికొనుచుండెను.

సాయంత్ర మయ్యెను. శర్మ కుమారుని తీసుకొని షికారు బయలు దేరెను. ఆతడు గోదావరివైపుగాని, పార్కువైపుకుగాని పోక మార్కెట్టు వైపు వెళ్లెను. ఆతని మనస్సు విచారగ్రస్తమై యుండెను. ఎక్కడనైనను కమల కనబడునేమోయని ఇటునటు జూచుచు నడచుచుండెను. ఆతడు తనలో, "ఇప్పుడు ఆమె కనబడి నట్లైన ఎవరేమను కొన్న సరే, నేనామెను నాతోకూడ నాయింటికి తీసుకొని వెళ్లుదును. రామప్రసాదు నామీద దావా చెయ్యలేడుకదా? ఆమె అంతట ఆమెయే యింటినుండి వచ్చినది. రామప్రసాదు ఇంటికి వెళ్లెదను. ఆమె తన ఇంటికి వెళ్లి పోయినదేమో?" అని యిట్లు పలువిధముల నాలోచించు కొనుచు నిల్లు చేరెను. చాలమంది పార్టీలాతని కొరకు వీధిచావడిలో కని పెట్టుకొని యుండిరి. కృష్ణశర్మ వారి కాగితములను జూచుచుండెనుగాని ఆతని మనస్సు స్తిమితముగాలేదు. ఆపని పూర్తికాగానే ఆతడు రామప్రసాదింటికి బయలు దేరెను. తన్నెవ్వరైనను జూచెదరేమో యని ఆతనికి జంకుగా నుండెను. వారింటికి వెళ్లినను, ఏమియు లాభముండదేమో యని ఆతనికి నిరాశగా నుండెను. ఆతడు రామప్రసాదింటికి వెళ్లు సరికి ఆతడు కూడ మిల్లునుండి అప్పుడే వచ్చెను. ఆరోజు మధ్యాహ్నమే శర్మ కమలను తన యింటినుండి పంపి వేసి నట్లాతనికి తెలిసెను. అప్పటికిని ఆతని సందేహము తీరలేదు. ఈవంక పెట్టి శర్మ కమల నెక్కడనైనను దాచెనేమోయని ఆతనికి సందేహముగ నుండెను. కాని శర్మను తన గుమ్మములో జూడగనే యాతడు లేచి ముందునకు వచ్చి, శర్మకు నమస్కారము జేసెను. శర్మ నిశ్చేష్టుడై "ఏమండీ! రామప్రసాదరావుగారు! మీా భార్య ఇంటికి రాలేదా?"

రా. ప్ర—(కొంతసందేహనివృత్తుడై) లేదండీ. కమలసంగతినాకేమీా తెలియదు. మీాయింటినుండివెళ్లిపోయినట్టుమాత్రం ఇప్పుడే విన్నాను.

కృష్ణ—మీరు భార్యను తెచ్చితివా? మీకు మీభార్యమీద కోపము వచ్చుటకు కారణ మేమిటి?

రా. ప్ర—నేనింటిలో లేనప్పుడు ఒకనాటి సాయంకాలమున, కాంత సహజముగా కమల యింటినుండి లేచి పోయినది. అయితే చాలరోజులు చెడు సహవాసములవల్ల నది శోభ్రముగా పాడైపోయినది. అప్పుడే ఎన్ని రోజులనుండియో దాని ఇష్టము వచ్చినట్లు సంచరించుచున్నది. సంవత్సరాదినాడు రాత్రి పదకొండు గంటలవరకు ఇంటికి రాలేదు. దానిపై నాక నుమానము కలిగి, గట్టిగా చివాట్లు పెట్టి కేకలు వేసితిని. సరే ఇక నేమున్నది? ఇదేసందు అని వెంటనే ఇంటినుండి లేచి వెళ్లిపోయినది.

కృష్ణ—కాని మీరామెను ఇంటికి తీసుకొని వచ్చుట కిష్టపడి నట్లైన, మాయింట్లో యున్నప్పుడే ఆమెను మాటలు చెప్పి సమాధాన పరచి తీసుకొని రావలసినది. కాని దానికి బదులుగా మీరు అన్యాయముగా నా మీదనే నింద మోపుటకు ప్రారంభించారు. నిందను భరించుట కెవ్వ రొప్పు కొంటారు? అందుచేత నేనామెను మా యింటినుండి పంపి వేశాను. ఇంతకన్న నేనేమి చేయగలను? ఎవరి మట్టుకు వారు అపనింద రాకుండ జూచుకొనెదరుకదా? సంవత్సరాదినాడు ఆమెను నాభార్య పిలుచుటయే మా అపరాధము. ఈపాటకచ్చేరీ వలన నింత వరకు వచ్చునని ముందే తెలిసిన, మాయింట్లో పాటకచ్చేరీ పెట్టించకయే యుందుము. లేక ఆమెను మాయింటికి పిలువక పోయి నైననూ ఉందుము. ఈ చిన్న విషయమునకే మీరు నామీద నింద మోపి పట్నమంతా చాటినారు. అన్నిటికీ ఏమిగాని పాపమా అమ్మాయికు రాలేమై పోయినదో యని నాకు చాల భయముగా నున్నది.

ఇట్లు చెప్పుచు నింతను జరిగిన సంగతులన్నియు పూస గ్రుచ్చినట్లు నచ్చ చెప్పెను. ఈ మాటల వలన రామప్రసాదుయొక్క మనసు

నందలి భ్రమ యంతయు తొలగి పోయెను.

రామ—(దుఃఖించుచూ) అమ్మా! నా అపరాధమునకు మీ యిష్టము వచ్చిన శిక్ష చెయ్యండి. నేను మూర్ఖుడను, పాపిని, దుర్మార్గుడను, మనస్సునకు తోచినట్లెల్ల, ఇది మంచి, అది చెడ్డ అని ఆలోచింపక నమ్మి చేసినాను. తెలుసు, ఎవరో పెద్ద మనిషి నారాయణదాసట, నే నాయన మోసములో పడి పోయాను. సంవత్సరాదికి ముందునాడే ఆతడు మా దుకాణమునకు వచ్చి, కొన్ని బట్టలుకొని, నాతో రహస్యముగ మాటలాడి ........ఇక నేమి చెప్పుదు? ఆతని మాటలు విని భ్రమపడి నమ్మి వేశాను. ఆతడు చాల పెద్దమనిషి యనుకొని మోసపోయాను అందరకూ నీతు లుపదేశించు నిటువంటి పెద్దమనిషే ఇట్లు చెప్పిన నమ్మకుండు టెట్లు? మీతో విరోధమని నాకు తెలియదు. ఆతడు నిష్కారణముగ నాసంసారమును నాశనము చేసివేసినాడు. ఇట్లు చెప్పుచు రామప్రసాదు ఏడువ మొదలుపెట్టెను. ఆతని అనుమానమిప్పుడు పూర్తిగా వదలిపోయెను.

రా. ప్ర—(ఏడ్చుచు) పంతులుగారు? నన్నెట్లు శిక్షించినను నేను సిద్ధముగ నున్నాను. నిష్కారణముగ మీవంటి సత్పురుషునిపై నింద మోపి పాపము కట్టికొన్నాను. నా సంసారమును నేనే మట్టి పాలు చేసికొన్నాను.

శర్మకు కాల్చిన శూలము గుండెలలో పొడిచినట్లయ్యెను. ఒడలు ముచ్చెమటలు పోసెను. ఆతడు ముందునుండి వచ్చు కత్తిపోట్లను సహించగలిగెను కాని వెనకనుండి వచ్చు సూదిపోట్లను సహించ లేకుండెను. నారాయణదా సాతనికి పరమమిత్రుడు. శర్మ ఆతనిని చాల గౌరవించుచుండెను. వారిద్దరి మధ్య నుద్దేశ్యభేదము లున్నను, ఆతడు దాసుయొక్క పవిత్రోద్దేశముల నాదరించుచుండెను. ఇట్టి సద్భావములు గలిగిన వా డాతనిని నిందాపాత్రుని జేసినయెడల

వానిని తెలిసిన మనుష్యుడనక మరేమనవచ్చును ? సంవత్సరాదినాటి పాటకచ్చేరీవలన కోపించుకొని నారాయణదాసీకందరగోళమును తెచ్చిపెట్టెనని ఇప్పుడు శర్మకు స్పష్టమయ్యెను. "కేవలము నన్నవమానించుటకును, పరుల దృష్టియందు నన్ను నీచపరచుటకును, నాయందీ దోషమారోపించె"నని శర్మ భావించి, కోపస్వరముతో "మీరాతని యెదుటనే యీ మాటలను చెప్పగలరా" అని యడిగెను.

రా. ప్ర—ఆc. తప్పకుండా చెప్తాను. నిజము చెప్పడానికి భయమెందుకు ? పదండి. ఇప్పుడాతని ముఖముముందే చెప్పుతాను. తానన్నమాటలు కావనుటకు సాహసించగలడా ?

శర్మ కోపావేశముతో దాసువద్దకు వెళ్ళుటకు సిద్ధపడెను. కాని కోపము నడచుకొని, మనస్సును స్థిమితపరచుకొని, ఇటువంటి సమయములో వెళ్ళినయెడల మరింత గడబిడ యగునని తలచి, రామప్రసాదుతో, "సరే. నేను కబురుపంపగానే రండి. కాని ఈలోగా మీరు మాత్రం నిశ్చింతగా కూర్చోకండి. రోజులు మంచివికావు మీ భార్యను జాగ్రత్తగ వెతకండి. మీ కవసర మైనయెడల నన్నడిగిన డబ్బిచ్చెదను" అని చెప్పి శర్మ ఇంటికి వెళ్ళిపోయెను.

నారాయణ దాసుయొక్క గుప్తములైన కత్తిపోట్లు శర్మను తేజోవిహీనునిగ జేసివైచెను. కేవలము ద్వేషముచేతనే దాసిట్టి పన్నాగము పన్నెనని ఆతడు దేశించెను. నారాయణదాసేమన్నను, తన బాగుకోరియే అననేమోయని ఆతడు భావించలేదు. ఎవరేమన్నను, ఎవరిని బాధించినను, నారాయణదాసు తాను నమ్మినది పైకివెల్లడించుట ఆతని స్వభావము.

మరునాడు శర్మ మోహనరావును స్కూలులో ప్రవేశపెట్టుటకు వానిని తీసికొని వెళ్లెను. కాని యే స్కూలునకు వెళ్ళినను స్థలము లేదన్న జవాబే వచ్చుచుండెను. పట్టణమందు నాలుగైదు స్కూళ్లున్నను, మోహనున కొక దానియందును చోటు దొరకలేదు.

చివరకు శర్మ విసిగి ఇంటివద్ద స్వయముగ తానే చదువు చెప్పుటకు నిశ్చయించెను. ప్రొద్దుట కోర్టుపని వలన నాతనికి తీరుబడి లేకుండెను. సాయంత్రము కచేరినుండి వచ్చినతోడనే పాఠములు చెప్పుట ప్రారంభించెను. ఒక వారము రోజులలోనే చదువు చెప్పుట యన్న నాతనికి విసువు, చీదరవుట్టెను. కచ్చేరీనుండి వచ్చినతోడనే ఏ పత్రిక చదువుటయుందో, హార్మోనియమ్ వాయించుటయుందో, కాలము గడుపు నాతని కిప్పుడు ఒక ముసలిపిట్టకు మాటలు చెప్పునట్లు చికాకుగా నుండెను. ఆతడు మాటిమాటికి విసుగుకొనుచు, మోహనుడు వట్టి బుద్ధిహీనుడనియు, తెలివి తక్కువ వాడనియు చీవాట్లు పెట్టుచుండెను. ఇదివరకు బోధపరచిన పాఠమునే మోహనుడు తిరిగితిరిగి అడుగుచుండుట వలన శర్మ చికాకుపడుచు, తిరిగి ఆ పాఠమునే బోధపరచుచు మోహనునిచే చదివించుచుండెను. ఈ పరిశ్రమ వలన ఫలితము తక్కువైనను, కష్ట మెక్కువగుచుండెను. ఆతని విసుగు, చిరాకులు జూచి మోహను డాతనివద్ద చదువుకొనుటకు భయపడుచుండెను. ఆతడు తనలో, "హాయిగ మాయూరిలో సుఖముగ నుండక ఇక్కడి కెందులకు వచ్చితి" నని పశ్చాత్తాపపడుచుండెను. చదివించెడివి నాలుగు ముక్కలేయైనను గంటలకొలదియు పట్టుచుండెను. చదువు చెప్పుట యైనతరువాత అలసి శర్మ షికారు సకుష్మాడ వెళ్లుట మానుకొనెను. ఈ పనియందు తనకు ఓపిక లేదని

ఆతడు తలచి, ఆ వీధియందే యున్న నొక యుపాధ్యాయుని మోహనునకు చదువు చెప్పుట కిరువది రూపాయల జీతమునకు మాట్లాడెను. కాని అంత సొమ్మిచ్చుకొనెట్లాయని ఆతడాలోచించ సాగెను. శర్మ నవనాగరికుడగుట వలన నెప్పటిసొమ్మప్పటికే చాల కుండెను. ఫేషనులలవాటైనవా డిప్పుడెట్లు మానగలడు? ఈసంగతి గురించి ఎంత యాలోచించినను ఆతని కేమియు పాలుపోకుండెను. చివరకు సుభద్రమ్మవద్దకు వెళ్ళి, "ఉపాధ్యాయు కిరువది రూపాయలకు కుదిరెరే" నని చెప్పను.

సుభ—మేష్టర్లు దొరకకపోతారా! డబ్బిస్తే వకడుకాదు, నూరు మంది దొరుకుతారు. కాని డబ్బుమాట చూచుకోవాలి.

కృష్ణ—ఆ డబ్బు దేవుడే యిస్తాడు

సుభ—నే నిన్ని సంవత్సరములనుండి చూస్తున్నాను. దేవుడెప్పుడు నటువంటి విశేష కృపను జూపలేదు. కాని. ఇంత తిండికి, బట్టకు లోపము లేకుండ మాత్రము జరిగిపోతూ ఉన్నది. అదే దేవునిదయ.

కృష్ణ—ఐతే, నువ్వే ఏదోవక ఉపాయం ఆలోచించి చెప్పు.

సుభ—ఇదివరకు నాకిస్తూన్నది మానివెయ్యండి. సరేనా?

కృష్ణ—నువ్వు చిన్న మాటనేసరికల్లా చీదరపడిపోతావు.

సుభ—మీరే చీదరపుట్టిస్తున్నారు. మనకు వచ్చే రాబడీ, అయే ఖర్చు మీకు తెలియనే తెలుసునుకదా! ఇంక నేనేమి మిగిల్చి మీకియ్యగలను? పాలు, నెయ్యి మన యింట్లో ఏమీ నదులై పారడంలేదు. మాధ్యాహ్న ఫలహారం చెయ్యనిదే మీరుండలేరుకదా? నౌకరు లేకపోయినా, వంటలక్క లేకపోయినా ఒక నిముషం జరుగదుకదా? ఇంక యే ఖర్చు తగ్గించి మిగల్చమంటారో మీరే చెప్పండి.

కృష్ణ—పాలు కొనడం మానివెయ్యి.

సుభ—సరే, పాలు కొనడం మానేద్దాం. మీరు తాగడం మానె

స్తారా, కాని మోహనునికో మరి? అతనకి బాగా పాలలవాటు.

కృష్ణశర్మ ఆలోచించుచూ తనలో, "తాంబూలపు ఖర్చు పదిరూపాయలు, చిల్లర ఖర్చులలో కొంత తగ్గించవచ్చును. కాని ఈ విషయమై సుభద్రతో జెప్పిన నేమి కోపము వచ్చునో" యని భయపడుచు ఊరకుండెను

సుభద్రమ్మ సంభాషణ వలన ఆమె కీవిషయమం దంత సానుభూతి లేనట్లాతనికి స్పష్టమయ్యెను. మనస్సునందే ఆతడు తమ జమా ఖర్చులను లెక్క జూచుకొనుచు చివరకు మెల్లగ నామెతో, "దీపం, పంకా ఖర్చులలో కొంత మిగల్చలేమా?"

సుభ—ఓ! మిగల్చ లేకేమి? దీపంజరుగు రేమున్నది. సాయంత్రమే భోజనంచేసి పడుకుంటే సరి. ఎవరైనా మిమ్మలిని చూచుటకువస్తే అక్కడే వుండమని కేకవేయుచు మీరే వీధిగుమ్మములోనికి వెళ్ళి మాట్లాడి పంపవచ్చు. లేకపోతే సాయంత్రం పడగానే భోజనంచేసి షికారుకు బయలుదేరి, తొమ్మిది గంటల కింటికివచ్చి విసనకఱ్ఱ పట్టుకొని పడుకుంటే మరీ బాధలేదు. అందరకూ పంకాలే వుంటాయా? పంకాలు లేనివాళ్ళంతా ఎండాకాలంలో నెత్తుటిపోతున్నారా?

కృష్ణ—మోటారు మానివేస్తే?

సుభ—ఆఁ. బాగానే తోచింది. మోటారు సౌఖ్యం అలవాటు అయిపోయింది. వదలుకోవడం కష్టం. అయినా అదొక్కటే సాధనం కనిపిస్తూంది. కష్టంపడినా డబ్బు మిగులుతుంది.

కృష్ణ—బాలికా పాఠశాలకు నెలకు రెండురూపాయలు, అనాథశరణాలయమునకు రెండురూపాయలు, క్లబ్బుకు రెండురూపాయలు చందా ఇస్తున్నాను. ఈ చందాలన్నీ మానేస్తే ఎలావుంటుంది?

సుభ—చాలా బాగుంటుంది. "ఇంట్లోదీపంపెట్టి మరీగుళ్ళోపెట్టు" అనుసామెత ఉండనే వున్నది.

కృష్ణ—(సుభద్రమ్మయొక్క పరిహాసపు మాటలు విని మనస్సులో చికాకుపడుచు) నే నేదో విధంగా నెలకు పదిహేనురూపాయలు జాగ్రత్త పెట్టుతాను. మిగిలిన ఐదురూపాయలు మిగల్చడం భారంనీది. నా కేమీ లెక్కలు చెప్పక్కరలేదు. ఏదో విధంగా ఆ సంఖ్య పూర్తి చెయ్యడమే కావాలి.

సుభ—ఓ! మిగులుస్తాను. దానికేమీ అడ్డంలేదు. రేపటినుండి వంట ఒక్కపూటే ప్రారంభించుదాం. రెండుపూట్ల వండడం అవసర మేమిటి? ఈ ప్రపంచంలో కోట్లకొలది మనుష్యులు ఒంటిపూటే భోజనం చేస్తూవున్నారు. ఐనా వారు నీర్సపడి జబ్బులు పడిపోతున్నారా యేమిటి?

కృష్ణశర్మకీ మాటలవలన చాలనిరుత్సాహము కలిగెను. సంసారపు చిక్కులాతని మనస్సును కలచి వేయుచుండెను.

కృష్ణ—(ఈ మాటలను సహించలేక) ఐతే మోహానునకు మేష్టరును పెట్టకుండా వాడి జీవితమును భ్రష్టుచేయుమనా నీ యుద్దేశ్యము? నీ విష్టపడి సాయం చేసినాసరే, ముఖం ఇస్త్రీ పెట్టుకొని ధుమ ధుమ లాడినాసరే. ఈ విషయమై ఖర్చుపెట్టకమానను. అష్టకష్టాలు పడి నాకు చదువుసంధ్యలు చెప్పించి, నన్నింతవృద్ధిలోనికి దెచ్చిన మా యన్న ఏకపుత్రుడు, మోహానుడు. ఆయనప్రేమ నా కెన్నటికిని మరపునకురాదు. ఆ సంగతులన్నీ ఇప్పుడు తలుచుకుంటె, ఒక్కసారి ఆయనవద్దకు వెళ్ళి సాష్టాంగ నమస్కారముచేసి, నా కృతజ్ఞత తెలుపవలెనని బుద్ధి పుట్టుచుండును. నా చర్మం వొలిచి జోళ్ళు కుట్టియిచ్చినా నా ఋణం తీరదు. ఇట్టిస్థితిలో నీకు దీపంఖర్చు, పంకా ఖర్చు తగ్గించడమే కష్టంగానున్నది. మా అన్నయ్య తనకు చెప్పులు లేకపోయినా నాకు కంపెనీజోళ్ళు తెప్పించి యిచ్చేవారు నాకు మంచి మంచి బట్టలు కొని, తాను పాతబట్టలతోనే కాలక్షేపము చేసేవారు. ఆయన నాకు

చేసిన మేలునకు, ప్రేమించిన ప్రేమకు, ఈ జన్మంలో అతనిఋణము తీర్చుకోలేను. మోహనుని కొరకు నే నెంతకష్టపడుటకైనా సిద్ధముగ నున్నాను. అవసరమైతే కచ్చేరికి నడచి వెళుతాను. ఉపవాసములేనా చేస్తాను. స్వయంగా వాడి జోడుకూడా తుడుస్తాను. ఇటువంటిపనులు చేయుటకు నాకు సంకోచమేమీ లేదు. అలా చెయ్యకపోతే నావంటి కృతఘ్నుడు ఈ ప్రపంచంలో నుండడు.

సుభద్రమ్మ సిగ్గుచే తల వంచుకొనెను. శర్మ ఈసంగతు లన్నియు నిష్కపటభావముతో జెప్పినను, తనను సిగ్గుపరచుటకే ఇల్లు జెప్పె నని ఆమె తలచెను.

సుభ—మోహనునికి మేష్టరును పెట్టవద్దని నే నెందు కంటాను? ఏలా మీకు బాగుంటే అలాగే చెయ్యండి. బావగారు మీకొరకంత కష్టపడినప్పుడు, మీ రెంత కష్టపడి యైనను మోహనుని వృద్ధిలోనికి తెచ్చుట మీ విధి. నన్నేలాగు చెయ్యమంటే అలాగే చేస్తాను. ఈ సంగతు లన్ని నాకు తెలియకపోవుటవల్ల అనవసరపు ఖర్చేమో అని అనుకొన్నాను. దీని కింత వెనుక ముందాలోచించడ మెందుకు? ఇన్ని సలహా లెందుకు? వెంటనే మేష్టరును పెట్టియుంటే ఈపాటి కొంత చదువు వచ్చియుండును. ఇంత వయస్సొచ్చిన తర్వాత నిప్పుడ చదువు ప్రారంభించ దలచిన, ఒక్క రోజైనా వృథాగా పోనివ రాదు.

సుభద్రమ్మకు బదులు శర్మయే ఇప్పుడు సిగ్గుపడవొచ్చెను. తమ కొమారుడే యైనయెడల ఇంత వెనకముందు లాలోచించియుందురా?

సుభద్రమ్మకు తన వాదన తలపునకు వచ్చి, సిగ్గు విచారములు కలిగెను. ఆమె నమ్రతతో తమలపాకులను జుట్టి పెనిమిటి కిచ్చెను. ఇది సంధిపత్రమువలె వా రిద్దరి విచారములను పోగొట్టి సంతోష మును కలిగించెను. శర్మ లేచి షికారు వెళ్లుటకు సిద్ధ మగుచుండ,

"కమల సంగ తేమైనా తెలిసినదా?" యని ఆమె ప్రశ్నించెను.

కృష్ణ—ఎక్కడ మాయమైనదో ఏమీ తెలియకుండా ఉన్నది. రామప్రసాదు కూడ అగుపడడం లేదు. ఆతడు ఇల్లు వాలిపెట్టి ఎక్కడకో వెళ్ళిపోయాడని విన్నాను.

మరుసటిరోజునుండి మేష్టరు వచ్చి మోహనునకు చదువు చెప్పుచుండెను. అతడు తొమ్మిదిగంటలకు వెళ్ళిపోయిన తోడనే మోహనుడు స్నానము భోజనము చేసి పండుకొనును. ఒంటరిగా నుండుట వలన వానికి వెర్రెత్తినట్లుండెను. కాలము వెళ్ళబుచ్చుటకు తోటివారు గాని, స్నేహితులు గాని లేరు. పాప మెట్లు ఉబుసుపోవును? ప్రొద్దుట లేచిన తోడనే కసరత్తు చేయుట అలవాటు. వాళ్ల గ్రామములో తోటివారిని నలుగురను చేరదీసి, వారందరితో కలసి సరదాగా సాముచేసి, గరడీలు త్రిప్పుచుండెడివాడు. కాని అటువంటి జట్టిక్కడ లేదు. అందువలన తన గదిలోనే దండీలు తీయుచుండెను. సాయంత్రము శర్మ మోహనునికొరకు బండి నుంచివేసి తాను కాలినడకనే షికారు వెళ్లుచుండెను. ప్రతిదినము సాయంత్రము పడినతోడనే మోహనుడు సూటు బూటు మొదలైన వానితో షోకుగా తయారై బండిమీాద షికారుకు బయలు దేరును. శర్మకు పార్కువైపుగాని, గోదావరివైపు గాని షికారు వెళ్లుట అలవాటు. కాని మోహనరావు సాధారణముగా ఆవైపునకు వెళ్లడు. నిర్మలమైన చల్లని గాలివలన కలుగు ఆనంద మాతని కేమి తెలియును? పరిశుద్ధవాయువువలన గలుగు సౌఖ్యమైన చల్లదనము, నిర్మానుష్యము లగు పచ్చని మైదానములు, ఆ ఆనందమయమైన నిశ్శబ్దము, వీటియొక్క సారస్యమును గ్రహించు నంతటి జ్ఞానము వాని కెక్కడ? ఆతడు మంచి యవ్వనమునం దుండెను. అదిగాక, శృంగారభూతము వాని నెత్తిపై స్వారి చేయుచుండెను. మంచి రూపవంతుడు. బలవంతుడు. చదువుసంధ్యలుగాని,

మేష్టగు భయము పరీక్షల భయముగాని లేకుండ పాలుమీగడలతో పల్లెటూరిలో పెరిగినవాడు. ఇంటివద్ద కావలసినంత గేదెపాడి. ఇష్టమువచ్చినంత వెన్న, మీగడ తినడం. దానిపైని కసరత్తు. ఇక చెప్పే దేమిటి? శరీరం ఉక్కుముక్కవలె తయారైనది. మంచి వెడల్పయిన ఛాతీ. బలిష్టమైన మెడ. ఆజానుబాహువులు. ఈగవాలిన జారిపోవునంతటి నున్నని శరీరము. ముఖమునందు వీరత్వము, మోటుతనము నొలుకుచుండెను. కాని చదువువలనను, జ్ఞానమువలనను గలుగు గాంభీర్యము, కోమలత్వము కనబడకుండెను. కండ్లతి చంచలములు, మదతేజోయుతములు; పెరటిలోని తోటకూర మొక్కవలె గాక, అడవియందలి మహావృక్షమువలె, మంచి ఒడ్డుపొడుగుగాను, బలముగాను, ఉండెను. వాని రూపయౌవనములు జూచి ఆనందించుటకు నిర్జనములైన పొలములవైపె వ్వ రుందురు? అందువలననే ఆతడెల్లప్పుడును పెద్దబజారువైపునగాని సానివీధివైపుగాని షికారు వెళ్లుచుండును. ఆ వీధియందలి ప్రతివారి చూపులు, రూపురేఖలు యౌవనవిలాసములు గల మోహనునిమీదనే వాలుచుండెను. యౌవనులు హర్షముతో జూచుచుండిరి. ముసలివారు స్నేహముతో జూచుచుండిరి. ఈవిధముగ త్రోవంట పోవు ప్రతివ్యక్తియు వానిపై పోకసారి దృష్టిని పరపుచుండెను. ఒజారువా రంద రీత డెవ్వడో జమీందారుల బిడ్డ డని తలచుచుండిరి.

ఆ వీధియందున్న వేశ్యలందరును. సీత డావైపు వెళ్లుచున్నప్పుడు మేడలపై నుండి తమ మోహనదృష్టు లాతనిపై బరపుచు, "ఈ బంగారుపిట్ట ఏమేడపై వాలునో, ఎవరి వలలో జిక్కునో" యని తలచుచుండిరి మోహనునకుతన సద్వర్తనమును కాపాడుకొనునంతటి వివేకము లేదు. కండ్లు పైకెత్తి చూచుట అమర్యాదా యను సంగతే అతనికి తెలియదు. ఆ సానివీధియందు తన కారును తాపీగా నడపించుచు,

ఆ వేశ్యలపై క్రీగంటిచూపులు బరపుచుండెను. సాధారణముగ మానవులు తమ యౌవనకాలమందు రసికత్వమును ప్రదర్శించి గర్వపడుచుందురు. ఉత్తరకాలమందు తమ సద్గుణములను ప్రదర్శించి తృప్తి నొందుచుందురు. మోహనరావు తన రసికత్వమును ప్రదర్శించుట కుత్సహించుచుండెను. ఆతడు మోహమదాంధుడై తనకు రాబోవు అప్రతిష్ఠను లక్ష్యము జేయకుండెను.

క్రమముగ మోహనరావునకు చిత్తచాంచల్య మధికమయి చదువుపై ధ్యాన ముండకుండెను. మేష్టరు వచ్చెనన్న అతని గుండెలలో రాయి పడినట్లుండెను. వాని మన స్సహర్నిశములు సానివీధివైపే పోవుచుండెను. ఆ దృశ్యమే వాని కండ్లముం దెల్లప్పుడును నాట్య మాడుచుండెను. వేశ్యలయొక్క హావభావములు, చిరునవ్వులయందే వాని మనస్సు లగ్నమై యుండెను. ఈప్రకారము దిన మంతయు ఏదో విధముగ గడపి సాయంత్రము పడుటతోడనే శృంగారించుకొని విలాసముగ సానివీధివైపు బయలుదేరుచుండును. తుద కీమదాంధతకు తగిన ఫలము దొరకకపోలేదు. మూడు నాలుగు నెలలలో వాని సంకోచ మంతయు నశించిపోయెను. మోటారుపై పోవుచుండుటవలన డ్రైవరు, క్లీనరు నీ రిద్దరు భూతములవలె వానికి అడ్డముగా నుండిరి. అందువలన ఆ శృంగారపుష్పములను స్పృశించుట కాతడు సాహసించ లేకుండెను. ఈ భూతములనుండి ఎట్లు తప్పించుకొందునా యని మోహను డెల్లప్పుడు చింతించుచుండెను. కొన్నిరోజుల కాతని కొక మంచి యుపాయము స్ఫురించెను. మోహనరా వొకదినము తన పినతండ్రివద్దకు వెళ్లి, ఈసంగతి, ఆసంగతి చెప్పుచు సందర్భానుసారముగ, "బాబయ్యా! నాకు గుఱ్ఱపుస్వారీ చేయవలె నని చాల సరదాగా నున్నది. కారుమీద ఊరికే కూర్చుని వెళ్ళడమంటే నాకు చాల చీదరగా నున్నది. గుఱ్ఱపుస్వారీవల్ల యొంటికి మంచి వరిక్రేసు

కనబడుతుంది. అంతే కాక పనిస్ప్రురిగ చాల హెచ్చుగా కూడ ఉంటుంది నవాకీ నేర్పివుంచే చాల మంచిదనుకొన్నాను.”

కమల శర్మగారి ఇంటినుండి వెళ్ళిపోయినప్పటి నుండియు ఆతని మనస్సునకు స్థిమితము లేకుండెను. పార్వతి తమతో, “ఎందువలననో గాని వకీలుగారిప్పుడు చాల మారిపోయినారు. మునుపటి శాంతముగా నున్న ఆతడిప్పుడు మాటిమాటికి చీదరించుకొనెడమేను. కేసుగురించి నాలుగు సంగతులూ తిన్నగావిని శ్రద్ధగా పని చెయ్యకపోతే కేసు ఏలాగెలుస్తుంది? ఎప్పుడూ తిరుగుతూనే ఉంటారు. ఒక్క-క్షణమైనా తిన్నగా కూర్చుని పనిచెయ్యరు. ఈలాగైతే పని ఎలా జరుగుతుంది? ఫీజు ఇస్తున్నప్పుడు మరివకీళ్లే దొరకరా?” అని అనుకొనుచు మరియొక వకీలువద్దకు పోవుచుండిరి. ఇందువలన శర్మ ప్రాక్టీసు రోజురోజుకు తగ్గనారంభించెను. ఇటువంటి అవస్థలో మోహనునిమాటలు విని కృష్ణశర్మ విచార స్వరముతో, “ఈ కారుతోనే ఎట్లో నీవు గడిపితే బాగుండును. కారు పాతదైనా, వాడుకకు బాగానే పనికి వస్తుంది.”

మోహ—“ఈ పాత కారెక్కుటకంటె నడచిపోతేనే బాగా వుంటుందని నాకు అనిపిస్తుంది. ఏది ఎలాగున్నా, గుఱ్ఱపుస్వారితో మించిన దర్జా, దేనికీ రాదు.

కృష్ణ—సరే! మంచిది జతకుదిరితే కొంటానులే.

ఈ విధముగా కొంతకాలము జరుపులుపెట్టి దడపవలెనని కృష్ణశర్మ తలంచెను. సాధారణగుఱ్ఱమైనను మూడువందల కంటె తక్కువ ధరకు దొరకదు. అదికాక దానిక్రింద నెలకు ఇరువదైదు రూపాయలు ఖర్చగును. కృష్ణశర్మ ఇప్పుడంత డబ్బుఖర్చుపెట్టు స్థితిలో లేడు. కాని మోహనరావాలాగూరుకునే వాడా? ఆతనికి విసుగుపుట్టేటట్టు ఎల్లప్పుడును ఇదే ప్రస్తావన. అందువలన అతనిని జూచిన నెక్కడ నీ

ప్రస్తా తెచ్చునోయని శర్మ భయపడుచుండెను. ఆతడు తనఆర్థిక స్థితిని మోహనునితో స్పష్టముగ చెప్పినట్లైన ఆతడు మరి నోరెత్త లేకుండును. కాని తన సంసారచిక్కులను జెప్పి కానిపనున్నను నొప్పించుట కాతని కిష్టము లేకుండెను.

మోహనుడు గుఱ్ఱపువాండ్రతో, మంచిగుఱ్ఱము అమ్మకమునకు వచ్చిన తాను కొనెదనని చెప్పెను. తమద్వారా బేరము కుదిరిన తమకు కమీషను దొరకుననునాశతో వారు గుఱ్ఱముకొరకు ప్రయత్నించుచుండిరి. కలక్టరుదొర తన దేశమునకు వెళ్ళిపోవుననియు, వారి గుఱ్ఱమును అమ్మివేయుదురనియు తెలిసి గుఱ్ఱపువాండ్రా సంగతిని మోహనునకు జెప్పిరి. ఆతడు సంతోషముతో తానే స్వయముగ దొరగారింటికి వెళ్లి గుఱ్ఱముయొక్క అందమును, చురుకుతనమును, జూచి మోహితుడై వెంటనే పినతండ్రివద్దకు వెళ్ళి, "బాబయ్యా! గుఱ్ఱము అమ్మకమునకు వచ్చినది. నేనువెళ్లి చూచివచ్చాను. చాల పసందుగా నున్నది. కొంటే అటువంటి గుఱ్ఱమే కొనవలెను." అని ఆతృతతో జెప్పెను. కృష్ణశర్మకు మరి తప్పించుకొనుటకు వీలులేక పోయినది. కొడుకుతో కూడ వెళ్ళి గుఱ్ఱమును జూచి దొరగారిని కలుసుకొని గుఱ్ఱపుసంగతిని నడుగగా, ఆతడు దాని నిఖరమైన ఖరీదు నాలుగువందలని చెప్పెను.

ఇప్పుడింత సొమ్మెక్కడనుండి వచ్చును. ఇంటిలో నూరో రెండవందలో యున్ననూ అవి సుభద్రమ్మవద్ద నున్నవి. ఈ విషయమై ఆమె కొంచెమైనను సానుభూతి జూపునని ఆతనికాశలేదు. అర్బన్ బ్యాంకీమేనేజరుతో ఆయనకు స్నేహముకలదు. అక్కడనుండిఅప్పు తేవలెనని అనుకొనెను. కాని అదవరకెన్నడును అప్పుతెచ్చి యుండనందున ఎంతఅనుకొన్నను ఋణముచేయుట కాతని మనసొప్పకుండెను. అప్పడిగిన వారెక్కడ లేదందురో యని అతనికిచాల జంకుగా

నుండెను. చాలామంది తేలికగ షాహుకారులవద్దను బ్యాంకులలోను ఋణము చేయుచుందురు. కాని ఆయనుభవ మాతనికి లేదు. తనకు ఋణము కావలెనని బ్యాంకి మేనేజరు పేర నుత్తరము వ్రాయ మొదలు పెట్టెను. కాని కలము నెప్పకుండెను. ఇంతలో మోహనుడు కలక్టరు గారి ఇంటినుండి గుఱ్ఱము తోలించుకొని వచ్చెను. గుఱ్ఱముఖరీదు నాలుగువందలు కాక గుఱ్ఱపుసామానును మరి యేబదిరూపాయల య్యెను. సుదరావుగారే సొమ్మంతయు ఇచ్చివేయవలెనని దొరగారు కోరిరి. శర్మవంటి తగుమనిషి కీపటిసొమ్ము జాగ్రత్తపెట్టుట అంతకష్టమైన పని కాదు. కాని అతనికేమి చేయుటకూ తోచక నాల్గువైపుల అంధకారము మొట్టవేసినట్లుండెను. అతనికిప్పుడు తనబీదస్థితి బాగుగ బోధపడెను. పర్వతముమిక్కుట అలవాటులేని వానికి చిన్నగుట్ట ఎక్కినను కండ్లు తిరుగును. ఇట్టిస్థితిలో సలహా చెప్పుటకు సుభద్రమ్మ తప్ప అతనికెవ్వరును కనబడలేదు. కనుక ఆతడు మెల్లగా ఆమెవద్దకు వెళ్లెను. అతనియొక్క వాడిన ముఖమును జూచి సుభద్రమ్మ, "మీ ముఖము అలా వాడిపోయిన దేమి? ఒంట్లో మరేమీ లేదుకదా!" యని ప్రశ్నించెను.

కృష్ణ—(తలయూపుచు) అంహా! ఒంట్లో యేమిలేదు.

సుభ—ఐతే ముఖ మెందు కలా వాడిపోయినది.

కృష్ణ—ఏం చెప్పను. మోహనుని నుండి చాలచిక్కుగా నున్నది. తనకు సవారీ గుఱ్ఱం కావాలని నెలరోజులనుంచి ఒక్కలాగ పాట పాడుతున్నాడు. ఈ రోజున కలక్టరుదొరగారి వద్దనుండి గుఱ్ఱమును తీసుకొనివచ్చి నాలుగువందల యేబదిరూపాయలు నా బుర్రను పులిమాడు. ఇంకీసొమ్మిప్పు డెక్కడనుండి తెచ్చేది? అన్నీ ఈలాంటి తంటాలే తెచ్చిపెట్టుతాడు.

సుభ—(ఆశ్చర్యముతో) బాగానే ఉన్నది ఇంతవరకూ జరిగినది!

నాకు కించమైనా తెలియదు. ఐనా నాతో చెప్పటానికి మీకంత అవసరమేమిటి?

కృష్ణ—అవసరం లేకేమి! కాని నీతో చెప్పడానికి భయపడ్డాను.

సుభ—నాతో చెప్పడాని కంతభయమెందుకు? నేనోర్చలేక పోవడానికి మోహనుడు నాకుమాత్రం పరాయివాడా? అతడు సరదాలు పడే వయస్సేయిది. ఏమంత పెద్దఖర్చు? దేవుడు మీకు చాలామేలు చేస్తే ఇటువంటి నాలుగైదువందలు ఎన్నిసార్లు గడించలేదు! ఎన్నిసార్లు ఖర్చుపెట్టలేదు! పాపం. కొసకిపోతే అతడు చిన్నవాడు. మిమ్మలి నింతవరకు తెచ్చిన అన్నగారి కొమారుడే కదా!

ఇటువంటి ఎడహానప్పు వచనములు కతడు సిద్ధపడియే యుండెను. ఇందుచేతనే అతడు మోహనుని గురించి ఏప్రస్తావనయు తనభార్య వద్ద తెచ్చుటకు భయపడుచుండెను. నిజముగ శర్మకు మోహనుని కోరికకంటె తన ధనహీనతయే ఎక్కువ విచారమును కలిగించుచుండెను. అతని కెంతకష్టముగా నున్నను, సుభద్రమ్మతో చెప్పకుండ ఏపనియు చేయజాలకుండెను.

కృష్ణ—మొదట భయపడి, ఏమైనా సరే అని నీతో ఈ సంగతి చెప్పలేదు. ఇప్పుడు మనస్సులో మాట చెప్పేస్తున్నాను. అందరి పిల్లలకు మంచివస్తువులయందు సరదా ఉండడం, ఆ సరదా పెద్దవాళ్లు తీర్చడం సహజమే. కాని వారిసరదాలుతీర్చుటకు వీరికి తగిన స్థితిగతులుకూడ నుండవలెనుకదా! ప్రొద్దుటనుండి ఈ ఆందోళనలో పడికొట్టుకొని పోతున్నాను. మనస్సున కే యుపాయము తోచడంలేదు. తెల్లవారగనే సొమ్మునిమిత్తం దొరగారి ఇంట్లోతువస్తే ఏమని చెప్పడం! జబ్బుగానున్నదని బొంకనేనా బొంకాలి. అంతకన్న మరేఉపాయం తోచడంలేదు.

సుభ—ఐతే దాని కేం కష్టం! తెల్లవారగానే బాగా ముసుగు

తన్నేసి పడుకోండి. ఒంట్రోతు సామ్మున్కోసం వస్తే మీా ఇంట్లో ఏమీా బాగులేదని మంచంమీాద నుంచి లేవడం లేదని చెప్పేస్తాను.

కృష్ణ—(భార్యమాటలు విని నవ్వాపుకోలేక గట్టిగా నవ్వుచు) సరే బాగానే ఉన్నది. అలాగే చేస్తాను. రేపటికి తప్పించుకోవచ్చును. కాని దొరగారు యెల్లుండి దేశానికి బయలుదేరుతారు. కనుక ఎల్లుండి ప్రొద్దుట కేనా సొమ్ముపంపక తప్పదు.

సుభ—అలాగైతే ఆతంటాలేవో ఈ వాళే పడకబ్బ జాగ్రత్త పెట్టకూడదూ! అబద్దాలు ఆడడం కూడ ఎందుకు!

కృష్ణ—నీకుపుణ్యం ఉంటుంది. కోప్పడకు. నా కాలోచనతోస్తే నిన్నెందుకు శ్రమ పెట్టుతాను! గుప్‌చప్‌గా ఈ పాటివ్యవహారం పరిష్కారంచేసి వెయ్యనా? నాకేమీా ఆలోచన తోచకే నీ సూక్ష్మ బుద్ధిని శరణుజొచ్చాను. ఏయుపాయం చేత ఈ చిక్కు తీరుతుందో చెప్పుదూ!

సుభ—నేనేమి చెప్పగలను? మీారు బి, యే, బి యల్, ప్యాసై హైకోర్టు వకీలు పని చేస్తూన్నారు. నేను ప్రేమరీక్లాసేనా పూర్తి చెయ్యలేదు. నేను మీా కేం సలహా చెప్పగలను! నాకంత సామర్థ్యమా! మోహనరావు గుర్రము మీాద సవారీ చేస్తూవుంటే చూచి సంతోషిస్తాను. అంత మాత్రమే నాకు తెలుసును.

కృష్ణ—ఆ సంతోష మేలాగున కలుగుతుందని నిన్ను అడుగుతున్నాను.

సుభ—ఆ భారమంతా దేవుని మీాదనే వెయ్యండి. వాడే ఏలాగో గట్టెక్కిస్తాడు.

కృష్ణ—నీ వేళాకోళపు మాటలు మానేవు కావు కదా!

సుభ—అంతకన్న నాకు మరేమి చేతనౌను! నా దగ్గర ఏమేనా ఉన్నదా ఏమిటి! సొమ్ము నా దగ్గరేమేనా ఉన్నదని అనుకుంటున్నారేమో! అది ఎట్టి పొరబాటు! ఇదిగో సందుక పెట్టె తాళాలు.

అందులో పదునైదు వందలు తీసికొని మిగిలిన సొమ్మునకు తంటాలు పడండి. మీకెంతమంది స్నేహితు లున్నారుకదా! ఆపాటి, పదునాలుగు వందలు సర్దుబాటు చెయ్యరా?

అని చెప్పుచూ సందుగ తాళము వెయ్యబోయెను.

పెట్టెలో ఏదో కొంత సొమ్మునకు బదులు ఐదువందలు సంచితో నుండెను. ఇది సుభద్రమ్మ రెండు సంవత్సరములనుండియు కష్టపడిమిగిల్చిన సొమ్ము. ఆమె ఈ రూపాయలను జూచి పొంగిపోవుచు, ఒకొక్కప్పుడు వాటితో తోటి కోడలకు మెడలో వాచీ గొలుసును, తన గ్రామములో తెలిసిన బీద స్త్రీలకు చీరలును కొని ఇవ్వవలెనని అభిలాష పడుచుండెడిది. ఒకొక్కప్పుడు తన భర్త కవసరము వచ్చినప్పుడా రూపాయల నిచ్చి అతనిని సంతోషపెట్ట వలెనని తలచుచుండెడిది. సాధారణముగ సందరు స్త్రీలకు నిట్టి ఉదార భావముండదు. వారు తమ నగల కొరకో, బట్టల కొరకో కూడ బెట్టుకొందురు కాని సుభద్రమ్మ గొప్ప ఇంటి ఆడపడుచు అగుట వలన ఆమెకు నగలన్న అంతగా శ్రద్ధయును లేదు. గొప్ప తనమునకే ప్రాకులాడును, కాని ఆమె కిటువంటి అనవసరపు ఖర్చు పెట్టుట కొంచము కష్టముగా నుండెను. ఐనను శర్మ విచారము జూచి ఆమె మనస్సు కరగిపోయెను.

సుభ—మీరు తీరి కూర్చొని ఇటువంటి కలతలు తెచ్చి పెట్టుకుంటారు. "అబ్బాయి! ఇప్పుడు సొమ్ము లేదు. ఈ కారుతోనే కొన్నాళ్లు కాలక్షేపము చెయ్యి" అని చెప్పి వేసి యుండిన ఈ తంటాలు లేక పోయి యుండును. ఈవిధముగ మనస్సు కలత పెట్టుకొన్న నేమి లాభము? ఈరోజున గుర్రము కొరకు పట్టు పట్టాడు. సరి పోయింది. రేపు క్రొత్త మోటారు తెమ్మంటే ఏమి చేస్తారు. బావగారు మీకొరకు కష్ట పడ్డమాట నిజమే, కాని ఆయన తన

శక్తిని ఉంచి మీ కోరకేమీ చెయ్య లేదు కదా? ఈ సంగతి వింటే ఆయన మాత్రం సంతోషిస్తారా? (ఇట్లు చెప్పుచు సందుగ తాళము తీసి అందులో నుండి రూపాయల పొట్లముల నైదు తీసి అతని ముందుంచి) ఇవిగో ఐదు వందల రూపాయలు. వీటిని మీ ఇష్టము వచ్చినట్లు ఖర్చు పెట్టండి. ఎప్పుడైనా మీ కిటువంటి అవసరము వస్తుందనే జాగ్రత్తగా మిగిల్చి, దాచియుంచాను. పోనీ ఇవి గుజ్జమునకే ఖర్చు పెట్టండి. ఏలాగో వక లాగు మీ ఆందోళన తగ్గితే అంతేచాలు ఇకనే సందుగలో నొక దమ్మిడీయైనను లేదు. శర్మ తొట్రుపాటుతో సొమ్ము వైపు జూచుచుండె కాని వాటిని తీయలేదు. అతని మనస్సు కొంత చులకన బడెను. ముఖమునందు శాంతి చిహ్నములు కన బడు చుండెను. కాని లక్షణములోనే, అవి మారి వాటికి బదులు విచారము, సిగ్గు ముఖమునందు నగుపడుచుండెను. ఆసొమ్ము ఖర్చు పెట్టుట అనుచితమని తలచి అతడు తనలో "పాపము సుభద్ర ఈ సొమ్మును ఎందు నిమిత్తమై దాచినదో? ఈ సొమ్ము మిగుల్చుట కెంత శ్రమ పడినదో?" అని యోచించు చుండెను

సుభ—కోరిన సొమ్ము జతపడి కూడ ఎందుకు విచారిస్తున్నారు?

కృష్ణ—(అనుగ్రహ దృష్టితో జూచుచు) ఏలా సంతోషించను? నీ సొమ్ము ఖర్చు పెట్టుట చాల అన్యాయము. నే నిప్పుడే వెళ్లి గుజ్జమున కేదో దోష మున్నదని చెప్పి త్రిప్పి వేస్తాను. మోహనునికి కోపం వస్తే మాత్రం మన మేం చేస్తాం? సొమ్మివ్వకుండ సుభద్రమ్మ ఈ ప్రస్తావన తెచ్చిన ఎడల శర్మ కెంత కోపము వచ్చి యుండునో కదా? అతడు సుభద్రమ్మ నెంతో నిందించి, కఠినురాలని భావించి యుండును. కాని ఆమె యొక్క ఉదార భావమాతని వశీభూతుని జేసి కొనెను.

సుభ—(విస్మయముతో) ఇదేమిటి? మీ మనస్సు ఇంతలోనే

ఎగిరి పోయినది? సజ్జనుని చూచుకొని, కొంటామని ఇంటికి తెప్పించింది, ఇప్పుడు తీరా తిరగ్గొట్టేస్తే నలుగురు ఏమను కొంటారు? మొదట కొంటామని మాట ఇచ్చి తిరగ గొట్టడం ఏమి న్యాయం? కలక్టరు దేశమునకు వెళ్లుటకు సిద్ధముగా నున్నాడు కాబోలు. అతనికి మాత్రం చిక్కు కాదా? దీని కింత బ్రహ్మాండ మేమిటి? ఇటువంటి జరుగు నప్పుడు పనికి వస్తుందనే కదా కష్టపడి సొమ్ము జాగ్రత్త పెట్టాను. ఇప్పుడు నాకేమి ఆ సొమ్ము అవసరము లేదు. సంతోషముగా ఇస్తున్నాను. మీ కింకా అను మానంగా ఉంటే ఋణముగా తీసు కొండి. వీలైనప్పుడు తాపీగా ఇవ్వ వచ్చును.

కృష్ణ—(సంతోషముతో) ఈ షరతు మీద పుచ్చు కొంటున్నాను. నెలవాయిదాల చొప్పున తీర్చివేస్తాను.

## ౧౭

ప్రాచీనఋషు లింద్రియములను లోబరచుకొనుటకు రెండు మార్గముల నేర్పరచిరి. ఒకటి విశ్వమానవప్రేమ; రెండవది వైరాగ్యము. మొదటి సాధనము మిక్కిలి కఠినము, దుస్సాధ్యము. కాని మన నవనాగరిక సమాజము పట్టణ ముఖ్యస్థలములయందే వేశ్యాగృహములకు తావిచ్చి ఈ పవిత్రప్రేమను పాపభూయిష్ఠము చేయుచున్నది.

జీవనముయొక్క వేరువేరు అవస్థలయందు వేరువేరు రుచుల యొక్క ప్రాబల్య మధిక మగుచుండును. బాల్యము చిరుతిండ్లకును, ముదిమి లోభత్వమునకును, యౌవనము ప్రేమకాంక్షలకును సమయము. ఇట్టి యౌవనావస్థలో సానివీధియందు షికారు మనస్సులో విప్లవము కలిగించును. దృఢమనస్కులును పాపమునకు జంకువారును

శృంగారకౌశల్యములను నావిష్కరించుచుండుటలు. జారినవారు దానినుండి పైకి లేవజాలరు.

సారాదుకాణములను పట్టణములకు దూరముగా నుంచుటకు సంస్కర్తలు ప్రయత్నించుచున్నారు. జూదము వినాశహేతు వని దాని నాడువారికి శిక్ష విధించుచున్నారు. కాని వేశ్యాగృహములను నడిబజారులయందు, సంసారుల యిండ్లమధ్యను ఉండనిచ్చుచున్నారు. ఇది పాపోత్తేజమునకు కారణము గాక మరియేమి?

బజారునందలి సామాన్యవస్తువులయందు కూడ ఎంతయో ఆకర్షణ శక్తి కలదు. మనము వాటిచే మోహితులమై ఒక్కొక్కప్పు డనావశ్యకపు వస్తువులను కూడ కొనుచుందుము. అట్టి సమయమున దుర్బలమనస్కులగు యువకులు శృంగారలావణ్యములు గల వేశ్యల మోహజాలములలో పడి చిక్కుకొనకుందురా? ఇంతమాత్రము సంస్కర్తలును, సంఘాభిమానులును తెలిసికొనవద్దా?

కొంద రిది నిరర్థకమైన యనుమాన మనియు వేలకొలది యువకులు పట్టణములందు నివసించుచున్నను, వారందరు చెడిపోవుచున్నారా? యనియు వాదించెదరు. కాని దుర్బలత వాయువువలె అదృశ్యమైన వస్తు వనియు, దానియొక్క ఫలము కర్మవలన అనుభవమునకు వచ్చు ననియు వారికి తెలియదు. వారు ప్రత్యక్షప్రమాణమునే కోరుచుందురు. మానవు లెందు కింత లజ్జావిహీనులుగను సాహసరహితులుగను అగుచున్నారు? వారి కెందు కిసుమంతయైనను ఆత్మగౌరవము లేదు? ఈ నిర్జీవత్వమునకు కారణ మేమి? ఇవి యన్నియు మానసికదౌర్బల్యముయొక్క ఫలితములే!

ఇందువలననే ఈవిషభరితసర్పములను పట్టణ బాహ్యప్రదేశములం దుంచుట యావశ్యకము. అప్పుడా నింద్యస్థలములవైపు సాధారణముగ నందరు పోవుటకు సంకోచింతురు.

వర్షాకాలము వచ్చెను. తీర్థములయొక్కయు, పండుగలయొక్కయు సంగీతసభలయొక్కయు హడావడి యెక్కువగా నుండెను. మోహనుడు ప్రతిదినము బాగుగ శృంగారించుకొని, గుఱ్ఱముపై పట్టణము నాల్గువైపుల షికారు తిరుగుచుండెను. ఆతని హృదయమునందు మోహోద్రేకము ప్రజ్వరిల్ల సాగెను. ఇప్పు డాతడు సానివీధియందలి దుకాణములపై గూర్చుండి, తాంబూలము వేసికొనుచు వారితో బాతాఖానీ చేయుచుండెను. దుకాణదారులు వారిలో వారు పాట యం దేవేశ్య నిపుణురాలో సౌందర్యమునం దెవతె యధికురాలో అను చేయు చర్చల నాతడతి ధ్యానముతో వినుచుండెను. మోహను డిప్పుడు రసజ్ఞుడై వేశ్యాగృహములనుండి వచ్చు మోహగీతములను విని ఉన్మత్తుడగుచుండెను. ఆతనికి వారి యిండ్లకు పోవలెనని యెంత యభిలాష పుట్టుచున్నను అతికష్టముతో తన బుద్ధి నాతడు మరలించుకొనుచుండెను.

మోహనరావు "ఫేషనబుల్" గా బట్టలను ధరించుట కృష్ణశర్మ కిష్టమే. కాని అతి షోకులు వేళాపాళాలేకుండా తిరుగుట ఆయనకు కంట కింపుగ నుండెను. కృష్ణశర్మ ప్రతిదినము మ్యూజియమువైపు గాని గోదావరివైపుగాని షికారు వెళ్ళుచుండును. కాని మోహను డావైపు పాతని కెన్నడును కనబడలేదు. "వీడు ప్రతిరోజు ఎటువైపు వెళ్ళుచున్నాడో? సానివీధి వేపుగాని వెళ్ళుటలేదుకదా?" అని ఆయన అనుమానించుచుండెను. ఆయన అనుమానించినట్లే రెండు మూడుసార్లు వాని నా వీధి మొగను జూచెను. పినతండ్రిని జూడగానే మోహనుడు గతుక్కుమని దుకాణమునం దేదో బేరము చేయు చున్నట్లు నటించుచుండెను. ఆయన మోహను నటువైపు వెళ్లవద్దని చెప్పదలచెను. కాని అట్లు చెప్పిన ఆత డేమనుకొనునో యని జంకు చుండెను. ఒకనాడు కృష్ణశర్మ షికారు పోవుచుండగా నిద్దరు స్నేహి

తులు గుఱ్ఱపుబండిపై పోవుచు ఆతని కెదురుపడిరి. వా రిద్దరు కూడ మ్యునిసిపల్ సంఘసభ్యులే. ఒకని పేరు అబ్దుల్‌వఫా. రెండవవానిపేరు సూర్యారావు. వారు శర్మను జూడగనే బండి నాపిరి.

అబ్దు—సలాముచెయ్యండి పంతులుగారు! మీకోసరకే వచ్చుచున్నాము. మాతో బండీమీద కొంతదూరం దయచెయ్యండి.

కృ. శ—క్షమించండి నాకు సాయంత్రం నడచి షికారు వెళ్ళు టే యలవాటు.

సూర్యా—శర్మగారూ! మీతో నొక మంచి సంగతి చెప్ప వలసి యున్నది. అందు కోసరకే మీ యింటి వైపు వచ్చుచున్నాము. మీరీ బండిలోనికి దయ చేస్తే సంగతి మనవిజేస్తాము.

కృష్ణ—శర్మ వారి మాటను త్రోసివేయజాలక బండినెక్కెను

అబ్దుల్—ఆ సంగతివినియే మీ రాశ్చర్యపోతారు.

కృష్ణ—అదేదో సెలవియ్యండి.

అబ్దు—మీ రప్పుడు చేరదిసిన బ్రాహ్మణస్త్రీ యిప్పుడు సానివీథిలో నొక పెద్దమేడ యందున్నది.

సూర్యా—ఆమె వేశ్య వృత్తి నవలంబించి కొన్ని నెలలే యైనను, ఆ సౌందర్యములోను, సంగీతములోను వొయ్యారములోను అందరను మించిపోయినది. గులాబీ పువ్వువంటి ముఖము దొండపండువంటి పెదవులు. అచ్చంగా పోతపోసిన బంగారం బొమ్మవలెనున్నది. శర్మగారు! నిజంగా చెప్పుచున్నాను. అటువంటి యందకత్తెను నా జన్మంలో చూడలేదు సుమండీ!

అబ్దు—పంతులుగారు! నమ్ముతారో నమ్మరో ఆమె యింటినుండి వచ్చి ఆరునెలలేనా కాలేదు. నిన్ననాను పాటవిని దంగైపోయాను. ఇంత వేగిరం అంత బాగా యేలాగు నేర్చుకొన్నదో! ఈ పట్నంలో ఆమెతో సమానులు లేరనే చెప్పవచ్చును. ఎవరి కంఠమునందును

ఆ సారస్యము, ఆమధురము నుండదు!

సూర్యా—ఏ బజారులో జూచిన ఏ సందులో జూచినా ఆమెను గురించి చెప్పుకోవడమేను. ఆమెపేరు వినగానే ప్రజలు మంత్రించి నట్లు ముగ్ధులగుచున్నారు.

శర్మ యీ సంగతులను విని విచారముచేతను సిగ్గుచేతను తల యెత్తికొనలేక పోయెను. అతని ముఖము వెలవెలపోయెను. చివరకా యన భయపడినట్లే యైనది. ఏ కాంతముగ కూర్చుండి దీనిగురించి విచారించుట కాయన మనస్సు తొందరపడుచుండెను. ఈ నిర్బంధము నకు ఆయన ఖేదపడి వారితో "నన్ను క్షమించండి నే నిప్పుడక్క డకు రాజాలను"

అబ్దు—ఏమి? ఎందుచేత?

కృష్ణ—ఒక మర్యాదా కుటుంబములోని స్త్రీని యీ విధముగ జూచి సహింపజాలను. మీ రేమనుకొన్నను సరేగాని ఆమెకు నాకు పరి చయమేమీ లేదు. ఆమె నా భార్యవద్దకు వచ్చుచు పోవుచుండెడిది. అంతమాత్రమే నాకు తెలుసును.

సూర్యా—మీ రేమి చెప్పినా వప్పుకోము. మాతో వచ్చి ఆమె పరిచయము మాకు చేయించక తప్పదు.

కృష్ణ—(మరి సహింపజాలక అస్థిరుడై) నే నక్కడకు రాజాల నని యిదివరకే జెప్పితిని. దయచేసి నన్ను బండిలో నుండి దిగిపో నివ్వండి.

సూర్యా—మిమ్మాలి నక్కడకు తీసికొనిపోదు మని యిదివరకే చెప్పాము. మా గురించి కొంచెం శ్రమపడండి. (అని చెప్పుచు కవిర్చా తో గుఱ్ఱము నదల్చగా నది వాయువేగముతో పోవుచుండెను.)

కృష్ణ—(కోపముతో) మీరు నన్నవమానింప దలచితిరా?

అబ్దు—పంతులుగారూ! కొంచెం ఓర్చుండి. కమలాబాయి వున్న

వీధిదగ్గరకు వచ్చుచున్నాము.

శర్మ తనలో నికయెంత జెప్పినను వినరనియు బ్రతిమాలుకొన్నను లక్ష్యపెట్టునట్లు లేదనియు, కమలవద్దకుపోయి, ఆ మెస్థితిచూచి భరిం చుటకంటె తనప్రాణములకు తెగించుటయే మేలని తలచి, తొందరగా బోవుచున్న బండీనుండి ఒక్కసారి క్రిందకు దుమికెను. ఆయన యెంత యాపుకొన్నను నిలువలేక త్రుళ్ళి క్రిందపడి దొర్లిపోయెను. మోచేతులకు మోకాళ్ళకు ముఖమునకు బలమైన దెబ్బలుతగిలెను. ఒళ్లు ముచ్చెమటలుపోసి కళ్ళు చీకట్లుక్రమ్మి తెలివి తప్పిపోయెను. బండిలోని స్నేహితులు వెంటనే బండీనాపి, ఆయనవద్దకు పరుగెత్తుకొని పోయి, ఆయనను లేవదీసి రుమాలుతో చెమట, నెత్తురు నొత్తుచు విసరసాగిరి. ముఖముమీద నీళ్ళుజల్లిన కొంతసేపునకు శర్మకు తెలివి వచ్చెను. స్నేహితులిద్దరు పశ్చాత్తాపముతో క్షమాపణ వేడికొనుచు తమ బండిమీద యింటికి దిగబెట్టెదమని ఎంతయో బ్రతిమాలిరి. వారెంత బ్రతిమాలినను వినక శర్మ కుంటుచు నాల్గాగే యింటికి బయలుదేరెను. ఆయన నడచుచు, తనలో "నే నెందు కంత తొందరపడి బండినుండి గెంటివేసితినో తలచుకొన్న నాకే ఆశ్చర్యము సిగ్గు వేయుచున్నది. నేను రానని గట్టిగా చెప్పిన వారు బండి నాపకుండుటకు సాహసించగలరా? అప్పటికి వారు మూర్ఖపుపట్టు పట్టిన వారిచేతులలో నుండి బలవంతముగా కళ్ళెపుత్రాళ్ళను తీసికొని బండీ నాపలేనా? పోనీ, మంచిపని చేసితిని. వారు మాటలలోపెట్టి నన్నామె యింటికి తీసికొనిపోయిన చాలకష్టమై పోయి యుండును. కమలముఖము నే నెట్లు చూడగలను.? బహుశః అటువంటప్పుడేమీ తోచక బజారువీధి యందు వెఱ్ఱివానివలె పరుగెత్తి యుందునేమో?. ఆవును జంపుచున్నను జూచి యెట్లో సహించగలను గాని కమల నిట్టిస్థితియందుచూచి సహించలేను."

ఇప్పుడు కృష్ణశర్మ మనస్సునందు, ఈ కార్డుకున కుత్తరవాదు లెవ్వరను ప్రశ్న బాధించుచుండెను. "నేను కమలనింటి నుండి పంపివేయుట పోయిన ఆమెకీ దుస్థితి సంభవింపకపోయి యుండునేమో? మాయింటినుండి వెళ్ళిపోయినతర్వాత మరియొక దిక్కులేక పోవుటవలన క్రోధ పరాశలతో నిటువంటి నీచపుపనికి ఒడిగట్టుకొన్నది. కనుక యీపాపమంతయు నాదే," అని పశ్చాత్తాపపడుచుండెను.

"రామప్రసాదుకు కమలపై నంతకోప మెందుకు వచ్చినది? ఆమెకు ఘోషాయేమిటి? సంబరములకు తీర్థములకు పోవుచున్నదే. కేవల మొక స్నేహితురాలి యింటికి అమెకోరినందున పోయి గ్రాత్రి కొంచె మాలశ్యముగా నింటికి నచ్చుటవలన రామప్రసాదింత కఠినముగా దండించినాడే! ఆయనామెను గట్టిగా చివాట్లు పెట్టవచ్చును. రెండు దెబ్బలు వేయవచ్చును. అప్పుడు కమలయేడ్చిన ఆయనకోపము చల్లారి ఆమెను సమాధానపరచి యుండిన ఆ దెబ్బలాట దానితో చల్లారి పోయి యుండును. కాని అలాగు జరుగలేదు. మొదటినుండియు నారాయణదాసాతనికి విరుపులు పెట్టుచుండుట వలననే యింతవరకు వచ్చినది. కనుక ఈ యపరాధమంతయు ఆయనదే! నేనుకూడ ఆయననుండియే కమలనింటినుండి పంపివేయవలసి వచ్చినది. ఆయనయే పట్టణమంతయు నా పైని చెడ్డవాడుగ పుట్టించి నన్నవమానపరచెను." అని యీప్రకారము దానుపై నిందమోపుటవలన శర్మ మనస్సు కొంతచులకపడెను. కొన్నిమాసములనుండియు ఆయనమనస్సునందు మండుచున్న పశ్చాత్తాపాగ్ని కొంతచల్లారెను. నారాయణదాసు నవమానించుట కిప్పుడాయనకు సమయము దొరకెను. ఇల్లు చేరగానే శర్మదాసున కుత్తరము వ్రాయప్రారంభించెను.

"ఆర్యవర్యా! నమస్కారములు.

కమల సానివీధియం దొక పెద్ద మేడలో నున్నదని విన్న మీకు

నాయందనురాగము కలిగియున్నది. సుభద్రగారి నాయనారు భర్తృభయముచే ఆమె మాయింటికి వచ్చుటయు నేను దయార్ద్రహృదయముతో ఆమెచిత్తక్షోభము శాంతించునటుల ఆమె కాశ్రయమిచ్చు టుచితమని తలచుటయు మీకు జ్ఞాపకముండవచ్చును. కాని యింతలోనే నాస్వభావమెరిగిన నా స్నేహితులు కొందరు నన్ను నిందించి హేళనచేయ నారంభించిరి. చివరకు విసుగుడనై నిర్భాగ్యురాలైన యా యబలను వీరి మాటలు పడజాలక నేను మాయింటినుండి పంపివేయవలసి వచ్చినది. నేను భయపడినట్లే ఆమె పాపపంకిలమందు చిక్కుకొన్నది. ఈదుర్ఘటన కుత్తరవాదు లెవ్వరో, నే నామె కాశ్రయమిచ్చుట యుచితమో? అనుచితమో? ఇప్పుడు మీకు బాగుగ బోధపడగలదు.

ఇట్లు మీ స్నేహితుడు
కృష్ణశర్మ"

## ౧౮

నారాయణదాసు పట్టణమందలి సంఘసంస్థలన్నిటికిని ప్రాణమువంటి వాడు. ఆతని సహాయము లేనిదే యేపనియు జరుగదు. ఆయన యిట్టి కార్యభారములను సంతోషముతో వహించుచుండును. ఆయనకు నిరుత్సాహ మెప్పుడునులేదు. ఒక్కొక్కప్పుడీ పనులతొందరలవలన సరిగ భోజనము చేయుటకైనను తీరిక యుండదు. "ఇంటిపట్టున నొక్క క్షణమైన నుండరు" అని ఆయన భార్య యెల్లప్పుడు విసుగుకొనుచుండును. దాసు జాతీయసేవయందు మగ్నుడై తన స్వార్థమును, సౌఖ్యమును కూడ మరచిపోయెను. ఒక్కొక్కప్పు డనాథాలయపు చందాలకొరకు తిరుగుచుండును. ఒక్కొక్కప్పుడు బీదవిద్యార్థుల

భోజనవసతులకొరకు తంటాలు పడుచుండును. సంఘమునం దే విపత్తు సంభవించినను, ఆయనకు సహాయము చేయవలెనను ఇచ్ఛ పొంగి పొరలుచుండును. కరవుసమయమునందు బియ్యపుమూటలు మోయించుకొని గ్రామగ్రామములకు తిరిగి పేదలకు సహాయము చేయుచుండును. కలరా, ప్లేగు దినములలో ఆయన ఆత్మసమర్పణము జూచిన మిక్కిలి యాశ్చర్య కలుగును. ఒక్కసారి గోదావరి వరదలు వచ్చినప్పుడు ఎన్ని నెలలవరకో ఆయన యింటిముఖ మైనను జూడ లేదు. ఆయన తన సర్వస్వమును దేశముకొరకర్పించివేసెను. దానుకు కొంచెమైనను గర్వము లేదు. ఆతడు పెద్ద పెద్ద పరీక్ష లేమియు ప్యాసు కాలేదు. వాగ్ధోరణి కూడ సాధారణమే! కాని ఆయనకు తొందరెక్కువ. దూరదృష్టి లేదు. విశేష నీతికుశలుడు చతురుడు కూడ కాడు. ఐనను ఆయన దేశానురాగము స్వార్థత్యాగమే నగరమునందాయనకు గౌరవసన్మానముల దెచ్చుచుండెను.

శర్మ యుత్తరము దాసు ముక్కుపై గ్రుద్దినట్లుండెను. ఆయుత్తరమునందు సూచించిన దుర్ఘటన సంభవించు నని ఆత డనుకొనలేదు. ఆ ధ్యానమే అతనికి లేదు. తన స్నేహితునిపై భ్రమచేత తా నంత నింద మోపినందుకైనను ఆయనకు విచారము కలుగలేదు. జరిగి పోయినదానికై పశ్చాత్పపడుట ఆయన యెన్న డెరుగడు. ఇప్పుడేమి చేయవలెనను నదియే ఆయన యాలోచనయందుండెను. ఆయన తర్కవితర్కములు జేయు మనిషి కాడు. కనుక వెంటనే బట్టలు మార్చుకొని సానివీధికి బయలుదేరెను. కమలాబాయియొక్క యిల్లు జేరి నిస్సంకోచముగా మేడపైకి బోయి తలుపు తట్టెను. ఆచప్పుడు విని కమల దాసి తలుపు తెరచెను. అప్పుడు సుమారు రాత్రి తొమ్మిది గంటల సమయమైనది. కమల సంగీతము నాపి వేసి యప్పుడే నిద్రించుటకు పోవుచుండెను. ఇంతలో వచ్చిన నారాయణ

దానును జూచి యూరకొని నిలుచున్నాను. ఈ తూరి ఆవల నిదివరకు కృష్ణశర్మ యింటి వద్ద నెక్కడసార్లు చూచెను.

కమల—[తలవంచుకొని] అయ్యా తమ రిక్కడకు పొరపాటున రాలేదు కదా?

నారా—[సావధానముతో అక్కడనున్న తివాసిపై కూర్చుని] పొరబాటున రాలేదు. ఎరిగి యుండియే వచ్చితిని. కాని యేమి నమ్ముటకు శక్యము కానిదో దానినే కండ్లతో జూచుచున్నాను. ఈ రోజున శర్మ యుత్తరము జూచి, ఆయనతో ఎవరో అన్యాయపు మాటలు చెప్పగా విని ఆయన పొరబడిరని తలచితిని. కాని నా కండ్లతో నిప్పుడు ప్రత్యక్షముగా జూచుచు యేలాగు నమ్మకుండా నుండగలను. పూజ్యులైన మన బ్రాహ్మణ స్త్రీ యిటువంటి కళంక మార్గమున ప్రవేశించిన మన అధఃపతనమునకు అంతె ముండునా! కమలాబాయి నీవు హిందూసంఘమున కంతకును తలవంపులు తెచ్చిపెట్టితివి.

కమ—[గంభీర భావముతో] మీరట్లను కొను చున్నారు కాని మరెవ్వరు నీలాగు అనుకోవడం లేదు. ఇప్పుడే యెందరో పెద్ద మనుష్యులు ఇక్కడకు వచ్చి నా సంగీతము విని యానందించి వెళ్లిరి. వారందరు హిందువులే. వారెవ్వరును నన్ను జూచి అసహ్యించుకొని తలవంచు కొనలేదు. నా యింటికి వచ్చుటే మహాభాగ్యమని వారు తలచుచున్నారు. ఈ వీధిలో నే నొక్కరితనే కాను. నావంటి వారి ననేకులను జూపగలను. ఇంటివద్ద యెట్టి యాదరణ సౌఖ్యము లేక విసుగెత్తి మరియొక దారిలేక యిట్లు లేచి రాక తప్పినది కాదు. హిందూ సంఘమునకే సిగ్గు లేనప్పుడు మావంటి యబలలము దాని నెంతవరకు కాపాడగ్గలము.

నారా—కమలాభాయి! నీవు నిజము చెప్పితివి. నిస్సందేహముగా హిందూ సంఘమునకు సిగ్గులేదు. కాని యింతవర కేమాత్రము

నిలిచి యున్నదని, అది హిందూ యువతుల వల్లనే నిలిచి యున్నదని చెప్ప వచ్చును. వారి సత్కీర్తి వలననే ఆజాతి గౌరవము కొంతవరకు రక్షింప బడుచున్నది. కేవలము భారతీయుల గౌరవము కాపాడుట కొరకు లక్షలకొలది హిందూ యువతులు అగ్నియందు భస్మమైరి. అనేక కష్టములు కోర్చి అవమానమును నిరాదరణను సహించి పురుషులయొక్క క్రూరకృత్యములను మనస్సున పట్టించుకొనక స్త్రీలు జాతి యొక్క కీర్తి గౌరవముల కాపాడుచుండుట యీ దేశమునందే! సాధారణ స్త్రీల యొక్క స్వభావ మిట్టిదై నప్పుడు బ్రాహ్మణ యువతుల సంగతి చెప్పే దేమిటి! ఇప్పు డటువంటి దేవీ సమానలగు స్త్రీలీవిధముగా మర్యాద విడిచి పెట్టు టెంత విచారకరము! కమలాబాయి! నీ కింటివద్ద సౌఖ్యము లేదనియు, నీభర్త దరిద్రుడు, కోపిష్ఠి యనియు, అతడు నిన్నింటినుండి తగిలి వేసెననియు నేనొప్పుకొనెదను. కాని బ్రాహ్మణయువతి తన జాతియొక్కయు వంశముయొక్కయు రక్షణకొరకెటువంటి కష్టములను సహించుచు, దుఃఖమును సహించుట కష్టములయందు దురవస్థలయందు ధైర్యముగా నుండుట నిజమైన బ్రాహ్మణ స్త్రీయొక్క లక్షణములు. అట్లు గాక నీవు నీచజాతికులటలు చేయు పనిని చేసితివి. భర్తపై కోపము వచ్చిన పుట్టినింటికి వెళ్ళవచ్చును. అక్కడను జరుగకపోయిన మరి యేదైన మర్యాదాకరమగు పనిని జూచుకొనవలెను. నీవే యాలోచించుకొనుము. ఏ సంసారమందు నీ సోదరీమణులు సౌఖ్యముగా కాలము గడుపుచున్నారో ఆ సంసారమే నీకు విషతుల్యమైనది. నీవు కులమర్యాదను లోకనిందను కాలదన్ని ఇట్టి చెడుమార్గ మవలంబించు టెంత శోచనీయమైన సంగతి! నీకంటె దరిద్రులు దుఃఖితులు అయిన స్త్రీలను నీవు జూడలేదా! ఈ చెడుమార్గమునే వారందరు అనుసరించిన యెడల స్వర్గతుల్యమైన భారతభూమి నరక సమానము కాదా? కమ

లమ్మా! నీ నడవడి ఒక్క బ్రాహ్మణజాతికే కాదు భారతజాతి కంతకును తలవంపులు తెచ్చిపెట్టినది.

కమల నేత్రములు నీటితో నిండిపోయెను. సిగ్గుచేత ఆమె తలయెత్తికొనలేక పోయెను.

నారా—నీభోగవిలాసములకు సౌఖ్యములకు తగిన సదుపాయమిక్కడ జరుగుచున్న దనుటకు సందేహము లేదు. నీవు దివ్యభవనము నందు నివసించుచున్నావు. సొగసైన మెత్తని తివాసులపై కూర్చొనుచున్నావు. పూలపాన్పుపై నిద్రించుచున్నావు. నానావిధముల భక్ష్యములను తినుచున్నావు. కాని ఆలోచింపుము. నీ వావస్తువుల నేవెలబెట్టి కొనుచున్నావో! నీ మానమర్యాదల నమ్ముకొనియేనా! నీకిదివర కెంత గౌరవ ముండెడిది కాని యిప్పుడు నిన్ను జూచిన పాపమని—

కమల—[మాట కడ్డమువచ్చి] తమ రేమని శల విచ్చుచున్నారు. ఇప్పుడు జరుగుచున్న యాదరణలో నూరవవంతైనను అప్పుడు జరుగ లేదని నా యనుభవమువలన జెప్పగలను. ఒకసారి నేను సుబ్బయ్య సెట్టిగారి రామ మందిరమునకు ఉత్సవము జూచుటకై పోతిని. రాత్రి తెల్లవార్లు ఆలాగే మంచులో నిలువబడితిని. కాని లోనికి పోనిచ్చినారు కారు. నిన్న నారామమందిరమందే నా పాటకచ్చేరీ అయి నప్పుడు నాకు జరిగిన ఆదరణ జూచిన నా పాదస్పర్శవలన మందిరము పవిత్రమైనట్లు తోచినది.

నారా—కాని వా రంద రెటువంటి నడవడిగలవారో అది కూడ నాలోచించుము.

కమ—వారి నడవడి యెటువంటి దైన నేమి? వారు హిందూ సమాజముయొక్క నాయకులు. ఒక్కవారిమాటే యేమిటి! ఉదయము మొదలు సాయంత్రమువరకు నీ త్రోవ బోవు వేలకొలది మనుష్యులు, చదువుకొన్నవారు, చదువుకొనివారు, మూర్ఖులు, పండితులు

ధనికులు, దరిద్రులు ఒకరన్న మాటేమిటి! అందరి చూపులు రహస్యముగానో బహిరంగముగానో నామీద పడకుండా ఉండవు. నా కృపాదృష్టులవలన సంతోషించి మోహితులు కానివారు వారిలో నొకరును ఉన్నట్టు కనబడదు. దీనికి మీ రేమనెదరు! నన్ను తిరస్కరించువా రీ పట్టణమం దెక్కొద్దిమందో యుండవచ్చును. వారియందు మీరొకరు, మీమిత్రులు కృష్ణశర్మగా రొకరు. ఈ పట్టణమందు నాకింత యాదరణ జరుగుచున్నప్పు డిద్దరి ముగ్గురి తిరస్కారణవలన నాకు వచ్చు లోప మేమి! శర్మగారి కైనను నన్ను జూచిన కోపము గాని పాటకచ్చేరీ యన్న సరదాయే. ఆయన సంవత్సరాదినాడు రామతిలకము పాడుచుండగా ఆమెవైపు జూచి చిరునవ్వు నవ్వుట నా కళ్ళతో జూచితిని-

నారాయణదాసున కేమి చెప్పుటకు తోచినదికాదు.

కమల—[తిరిగీ] భోగవిలాసముల కోరికచేత చెడుమార్గమున ప్రవేశించితి నని మీరనుకొనుచున్నా రేమో! కాని అది వట్టి పొరబాటు. నేను మంచిచెడ్డలు పోల్చలేనంతటి గ్రుడ్డిదానను కాను. నేనతి నికృష్టమైన పనిని జేసితి నని కూడ నెరుగుదును. కాని ఇంతకు తప్ప నాకు మరియొక దారి కనబడకపోవుటవలన దీనికి లోబడవలసి వచ్చినది. మీరు వినవలె నని కోరిన నా విచారకథను వినిపించెదను.

ప్రపంచములో నందరి ప్రకృతి ఒక్కవిధముగా నుండదను సంగతి మీకు తెలిసినదే. కొందరు తమకు జరిగిన యవమానము సహించెదరు కాని అందరు సహింపజాలరు. నేనొక గౌరవకుటుంబములోని పిల్లను. మా తండ్రి యమాయకత్వమువలన నా వివాహ మొక దరిద్రమూర్ఖునితో అయినది. నేను దారిద్ర్యము నెట్లో సహింప గలిగితిని కాని అవమానము మాత్రము సహింపలేకపోతిని. సంఘములో నెవరికి అనాదరణ జరుగవలెనో వారికి ఆదరణ జరుగుచుండగా

జూచి నా మనస్సు భ్రమసి చెడుతలంపులు పుట్ట నారంభించెను. నేనీ భావముల నితరులతో చెప్పలేను కాని అవి నా మనస్సు దహించి వేయుచుండెను. క్రమముగా నీ మన్నె దానంతటదే చల్లారి యుండును. కాని శర్మగారి యింటివద్ద జరిగిన సాటకచేరి దానిని తిరిగీ ప్రజ్వరిల్లజేసెను. తర్వాత జరిగిన దుర్ఘటన మీకు తెలిసియే యున్నది. కృష్ణశర్మగారు నన్ను తమ యింటినుండి పంపివేసిన తర్వాత మరియొక గతి లేక రామతిలకము సహాయమే నాకు శరణ్యమయ్యెను. ఆదశయందు కూడ నా మనస్సు చెడుమార్గమునుండి విముఖముగానే యుండెను. బట్టలు కుట్టుకొని జీవించవలె నని తలచితిని. కాని దుష్టురాండ్రందరు కూడి నన్ను నిర్బంధించినందున ఈకూపములో దూకవలసి వచ్చినది. ఇటువంటి వృత్తియందు దిగి పవిత్రముగా నుండుట మిక్కిలి కష్టతరమైనను నా మానము కాపాడుకొందు నని ప్రతిజ్ఞ చేసికొంటిని. ఈశ్వరుని దయవలన నా ప్రతిజ్ఞ యెన్నటికిని భంగము కాకుండ రక్షించుకొందును. పాడెదను. నాట్యము చేసెదను కాని నా శీలమును మాత్రము చెరుపుకొనను.

నారా—నీపేరు చెడిపోవుట కీబజారులో మేడకట్టుకొని ఉండుటే చాలు.

కమ—ఐతే నే నేమి చెయ్యగలను? నేను సుఖముగా జీవితము గడుపుకొనుట కుపాయము మీరే శెల వియ్యండి.

నారా—ఇక్కడ జీవితము సుఖముగా గడుపుకొనుచున్నా నను కొనుట చాల పొరబాటు. ఇప్పుడు గాకపోయిన కొన్నిదినముల కైనను, ఇక్కడ సౌఖ్యగౌరవములు లేవని అనుభవమువలన నీకే బోధపడగలదు. సుఖము, సంతోషము తృప్తివలన కలుగును కాని భోగవిలాసములవలన కలుగజాలవు.

కమ—ఇక్కడ సుఖము లేకపోవుగాక. నా కాదరణ మాత్రము

బాగుగా జరుగుచున్నది. నే నిక్కడ నెవ్వరికిని భారము గాను.

నారా—నీవిలో కూడ నీవు పొరబడుచున్నావు. నీ విక్కడ పరులకు బానిసవు కాకపోయినను, నీ యింద్రియములకే బానిస వైనావు. ఆ పరాధీనతకంటె నదియే మిక్కిలి దుఃఖకరము. నిజముగా నిక్కడ నీకు సౌఖ్యము కలుగదు. ఆదరణయు జరుగదు. కొన్నిదినములవరకు భోగము ననుభవించవచ్చును. కాని దానిని కూడ చివరకు వదలుకొనక తప్పదు. కొన్నిదినములు మాత్రమే యింద్రియసౌఖ్యము లనుభవించుటకొరకు నీ సంఘమునకు నీ యాత్మకు ఎంత హాని ఎంత అపకీర్తి తెచ్చుచున్నావో నీవే యాలోచించుకొనుము.

ఇంతవరకు కమల యెవరివలనను యిటువంటి సంగతులను విని యుండలేదు. ఇంద్రియసౌఖ్యము ఆదరణయు జీవితముయొక్క ముఖ్యోద్దేశము లని యిదివర కామె తలంచుచుండెను. తృప్తివలన నిజమైన సౌఖ్యము, సేవవలన నిజమైన ఆదరణయు కలుగు నని ఆమె కిప్పుడు బోధపడెను.

కమల—నేనీ బూటకపు సౌఖ్యమును ఆదరణను వదలుకొనెదను. కాని నా జీవితమును గడుపుకొనుట కేదైనను మార్గముండవద్దా?

నారా—ఈశ్వరుని దయవలన బుద్ధిమంతురాలవైనయెడల సామాన్యజీవితమును గడుపుకొనుట కిటువంటి 'నీచవృత్తి' యవలంబించవలసిన యవసరములేదు. ఇంటియందు కూర్చొని గౌరవముగా జీవితము గడుపుకొనుట కనేకఉపాయములు కలవు.

కమలకు మరియేమియు వంక దొరకలేదు. నారాయణదాసుయొక్క ప్రోత్సాహమామెను వశపరచుకొనెను. సత్పురుషులను మనము మోసపుచ్చజాలము. వారి సదుపదేశములు మనహృదయమునందలి సద్భావములకు చేతనము కలిగించును.

కమల—ఈవిధముగా నింటినుండి లేచివచ్చి యిక్కడ నుండుట

తలచుకొన్న నామనస్సునకు నాకే సిగ్గు వేయుచున్నది. నావిషయమై ఏమి ఏర్పాటు జేసెదరో తమరే శెలవియ్యండి. నాకు సంగీతము చక్కగా వచ్చును. ఆడపిల్లలకు పాట బాగుగా నేర్పగలను.

నారా—ఇక్కడ అటువంటి బాలికాపాఠశాల యేదియు లేదు.

కమ—నాకు చదువుకూడ వచ్చును. ఆడపిల్లలకు చదువు చెప్పగలను.

నారా—(ఆలోచించుచు) ఈపట్టణములో బాలికాపాఠశాలలు చాలగలవు కాని నిన్ను వాటిలో నుపాధ్యాయురాలినిగా జేర్చుకొనుటకు ప్రజలొప్పుకొనరేమో యని భయముగా నున్నది.

కమ—ఐతే నన్నేమి చేయుమని శెలవిచ్చెదరు? నా జీవిత నిర్వహణకు నెలకేబది రూపాయలనిచ్చు హిందూసంఘోద్ధారకుడగు దాత యెవ్వడును లేడా?

నారా—అట్లెవ్వరిచ్చెదరు? అది చాలకష్టము.

కమ—అయితే నన్ను పిండివిసరుకొని బ్రతుకమనెదరా? నేనట్టి పనిచేయలేను.

నారా—వితంతు శరణాలయము నందుండుట కిష్టపడినదానికివీలు పడవచ్చునేమో?

కమ—(ఆలోచించి) అక్కడుండుట నాకు సమాధానమే. కాని నన్నుజూచి అక్కడిస్త్రీలు గుసగుసలాడిన నేను సహింపజాలను.

నారా—ఇది చాలకఠినమైన మగతే. నే నెవరినోరని కట్టగలను? ఐనను ఇంకా నువ్వక్కడ నుండుటకు సంఘసభ్యు లొప్పుకొనెదరో లేదో?

కమ—(పరిహాసముగా) మీ హిందూజాతి అంత హృదయశూన్యమైన దైనప్పుడు దాని మర్యాదను కాపాడుటకు నే నెందు కంత కష్టపడవలెను? నన్ను సంఘమునందు జేర్చుకొనుటకు జాతిని ప్రేరే

పించలేనప్పుడు, ఆ సంఘమునకే సిగ్గులేనప్పుడు, నాదోషమేమున్నది? నేను మిమ్ముల నొక్కకోరిక కోరెదను. దానిని మీరు పూర్తిచేసిన మొదల మరిమిమ్ముల కష్టపెట్టను. దయచేసి మీరొక్కసారి కృష్ణశర్మగారిని యిక్కడకు పిలుచుకొనిరండు. కొన్ని సంగతులాయనతో మాట్లాడవలెను. ఇదితో నా కోరిక. అటుతరువాత వెంటనే నేనీ వృత్తిని వదలివేయుదును. మీరు యెవరిని జాతీయనాయకులుగ నెన్నుకొనిరో వారిదృష్టియందు నాపశ్చాత్తాపమున కెంతవిలువ గలదో తెలిసికొనవలెనని కుతూహలముగా నున్నది.

నారా—(సంతోషముతో) ఈ పని యెంతసేపు? నే నాయనను తప్పక తీసుకొనివచ్చెదను. కాని యేరోజున తీసికొనిరమ్మనెదవో చెప్పు.

కమ—మీ కెప్పుడు వీలైన నప్పుడే.

నారా—ఇది నిశ్చయమేనా? మళ్ళీ మనస్సు తిరిగిపోదుకదా?

కమ—నేను మాటతప్పిపోవునంతటి నీచురాలను కాను.

## ౧౯

నారాయణదాసున కిప్పుడు పెన్నిధిదొరకినంత సంతోషముగ నుండెను. తాను వెళ్ళుటయే తడవుగ కృష్ణశర్మ కమలఇంటికి తప్పక వచ్చునని అతనికి నమ్మకముగ నుండెను. సంవత్సరాదికి కొన్నిదినములు ముందునుండియు ఆతడు శర్మగారింటికి వెళ్లుట మానివేసెను. ఇదివరకాతని నిందించుటకు కూడ దానేమియు వెనుకతీయలేదు. ఇప్పుడు తానుచేసినపనికి సిగ్గుపడుటలేదు సరికదా ఆతనివద్దకు వెళ్లుటకు కూడ సంకోచింపలేదు. ఆతడు శర్మఇంటివైపునకే తిన్నగ బయలుదేరెను. అప్పుడు రాత్రి పదునొకండు గంటలయ్యెను. ఆకాశమం

తయు మేఘములచే ఆవరింపఁబడి గాఢాంధకారముగ నుండెను. కాని కమలలయున్న వీధిమాత్రం దీపముల వెలుగుచే పట్టపగలువలె నుండెను. ఒకవైపునుండి శృంగారగీతములు, మరియొకవైపునుండి మధురహాస్య ధ్వనులు, ఇంకొకవైపునుండి ఆమోదప్రమోదసంభాషణలు వినవచ్చు చుండెను. విషయవాసన తనమనోహరరూపమును నలువైపులను ప్రదర్శించుచుండెను. ఆవీధిని దాటగనే దాసునకు నిర్జనప్రదేశమునకు వచ్చినట్లయ్యెను. ఇంకను ఊరుమాటు మణగలేదు. ఎవ్వరైనను పరిచితులు దాసున కెదురుపడిన, వారికి తన కార్యసాఫల్యమును దెలుపుచు, "నే నెక్కడనుండి వచ్చుచున్నానో మీకు తెలియునా! కమలా బాయినద్దకు వెళ్ళి వచ్చుచున్నాను. ఆమె ఇక మారుమాటాడక వితంతుశరణాలయము నందుండుట కొప్పుకొనునట్లు బాగుగ బోధపరచి చెప్పితిని. ఒక పనిని తలపెట్టినవారు దీక్షతో పనిజేసినగాని నెరవేరదు" అని గర్వముతో జెప్పుచుండెను.

కృష్ణశర్మ పందిరిపట్టెమంచముపై పండుకొని నిద్రించుచుండెను. ఇంతలో నారాయణదాసు వచ్చి వీధితలుపు దబదబ కొట్టసాగెను. నౌఖరు వెంకటస్వామి తనగదిలో కూర్చుని తాను మిగుల్చుకొన్న డబ్బులను లెక్కించుకొనుచుండెను. అప్పుడు వానికి తలుపుకొట్టినశబ్దము వినబడెను. వాడు తొందరతో డబ్బులను మొలను దోపుకొని ఎవరు వారని గట్టిగనడిగెను.

నారా—ఓయే! వెంకటస్వామి! నేను! పంతులుగారు పడుకున్నారా! కొంచ మాయనను లేపి, నా పేరు చెప్పి, పైన నిలువబడి ఉన్నాననియు, జరుగురు పనిమీద వచ్చితిననియు చెప్పి, కొంచం త్వరగా రా!

వెంకటస్వామికి మనస్సులో చాలకోపము కలిగెను. వానిలెక్క సగములో నాగిపోయినది. రూపాయి పూర్తియగుటకు నింక నెన్ని

డబ్బులు తక్కువగనున్నవో ఈ సందడిలో మరచిపోయెను. చీకా కుతో వాడు మెల్లగలేచి వీధితలుపు తెరచి లోనికిపోయి శర్మను నిద్ర నుండి లేపెను. ఏనియో క్రొత్త సమాచారము లేనిదే తానింత రాత్రి సమయమున రాడనితలచి, కృష్ణశర్మ త్వరగ వీధిలోనికి వెళ్లెను.

నారా——మీకు చాలశ్రమ కలుగ జేసితిని క్షమించండి. నేనెక్కడనుండి వచ్చుచున్నానో మీకు తెలుసునా? మీ యుత్తరమందగానే చేతనైతే కమలాబాయి మనస్సు మంచి మార్గమునకు త్రిప్పవలెనని ఆమె వద్దకు పరుగెత్తితిని. ఆ అసూయాకురాలు సానివీధికందు రాణి వలెనున్నది. ఇంతత్వరలో స చాతుర్యమామె కెట్లు కలిగినదో! ఆమె వైభవముజూచి నేను నిర్ఘాంతపడి పోయితిని ఆమె క్రొంత సేపైన తర్వాత నామాటలను విని ఏడ్చుటకు ప్రారంభించినది. లోహము బాగుగా కాలియున్నప్పుడే మరినాలుగు సుత్తిదెబ్బలు కొట్టిన పదును సమునని తలచి, ఇంకనూ మనస్సునకు పట్టునట్లు బాగుగ బోధించితిని. సరి నాచేతిలో జిక్కినది. మొదట విధవాశ్రమము మాటచెప్పగానే గడబిడపడి, నెలకేబదిరూపాయ లిచ్చిన ఎట్లో గడుపకొని ఈ వృత్తిని మానుకొనెదనని చెప్పినది. కాని మీకు తెలియదా? ఇక్కడ ఏబది రూపాయ లెవరిచ్చెదరు! నేను దానికేమియు జవాబు చెప్పక ఎంతో బోధపరచగ చివరకొక షరతుపై నొప్పుకొన్నది. ఆ షరతుపూర్తి చేయుట తమలో నున్నది.

శర్మ ఆశ్చర్యముతో దాసువైపు చూడసాగెను.

నారా——మీ రేమియు భయపడనక్కరలేదు. చాల సులభమైన షరతే. మరేమీలేదు. మీరొక్కసారి కమలాబాయి యొద్దకు వెళ్లి ఆమె కోరిన ప్రకార మామెతో నొకసారి మాట్లాడవలెను. అంత మాత్రమే! దీనివలన మీ కేమీనష్టములేదని తలచి, షరతున కొప్పు కొంటిని. తమ కెప్పుడు తీరుబడో చెప్పండి. నామట్టుకు ప్రొద్దుట

పూట వెళ్ళితేనే బాగుటుంది.

కృష్ణశర్మ ఆలోచనాపరుడు. బాగుగ నాలోచించనిదే ఏపనిని గాని చేయడు. అతడు తనలో, "ఈ పడతుకయొక్క అభిప్రాయమేమి? ఆమె నాతో నేమి మాట్లాడదలచుకొన్నది? తన యుద్దేశ్యము నుత్తరములో తెలియజేయకూడదా? ఇందులో తప్పక ఏదో రహస్యమున్నది. ఈ రోజున నేను ఆమె ఇంటికి బోకుండ బంధించి గెంతివేసిన సంగతి, అబ్దుల్ వఫా ఆమెకు తెలియజేసియుండును. ఈయన ఈ విధముగ రానియెడల మరియొక మాయచేసి ఇక్కడకు రప్పించెదనని ఆమె భావించి యుండును. కేవలము నన్ను నీచపరచుటకే తలచుచున్నది." సరే. నేను వెళ్ళెదను. తర్వాత మాట తప్పి పోవునేమో" అని ఆలోచించుచుండెను.

కృష్ణ—సరే. ఆమె మాట తప్పిపోయిన?

నారా—ఎట్లు తప్పిపోవును? ఆలా చెయ్యగలదా!

కృష్ణ—మాట తప్పుట అసంభవము కాదు.

నారా—ఐతే మీరామెవద్దనుండి ఖరారు పత్రమును కోరెదరా!

కృష్ణ—లేదు కాని. ఆమె భోగములను విడచి విశ్రాంతి శరణాలయమందుండునా యనియు, ఆశ్రమ సంఘమువారు అక్కడ నుండుట కొప్పుకొందురా యనియు నాకు చాల సందేహముగా నున్నది.

నారా—సభవారి నొప్పించు పూచీ నాది. ఒకవేళ వారొప్పకొనని యెడల నేనామెకు తగిన సదుపాయమును కల్పించెదను. పోనీ ఆ సంగతాలా ఉండనియ్యండి. ఒకవేళ ఆమె మాట తప్పిపోవుననే అనుకుందాం. దానివలన మన కేమీ నష్టములేదే. మనకర్తవ్యమును నెరవేర్చుకొన్నవార మయ్యెదము.

కృష్ణ—సరే. అయితే సంతోషమే. కాని, చూడండి, చెప్పు

తాను. ఆమె తప్పక మనలను మోసపుచ్చక మానదు.

నారా—[అధీరుడై కోపముతో] ఒకవేళ ఆమె మోసము యునే అనుకోండి. అందువల్ల మీసొమ్మేమిపోదు.

కృష్ణ—మీరు దానిని గౌరవహీనమని అనుకొనకపోయినా నేను మాత్రం దానిని గౌరవలోపమని అనుకుంటున్నాను.

నారా—ఐతే తుదకు తేలిన సారాంశము, మీరక్కడకు రారన్నమాట.

కృష్ణ—నేనక్కడకు వచ్చుటవలన నేమీ లాభములేదు. కాని నామర్యాదాభంగము చేయవలెనని తలచిన అది వేరు సంగతి.

నారా—ఒకరి జీవితము నుద్ధరించుటకు మీరింత మీనమేషములు లెక్కించుచుంటే విచారకరమైన సంగతి! అయ్యో! ఒక హిందూ యువతి గోతిలో బడుట జూచుచు, మీరా జాతియొక్క నాయకులలో నొకరై యుండియు, ఆమె నాపదనుండి తప్పించుట కెంత తటపటాయించుచున్నారు? మార్గవ్యవసాయదారులయొక్కయు జమీందారుల యొక్కయు రక్తము పీల్చుట తప్ప మీకు మరియొక దానితో నవసరము లేదు కాబోలు!

ఈ తిరస్కార వచనములకు కృష్ణశర్మ మరి యేమియు జవాబు చెప్పలేదు. అతడు తన పిరికి తనమునకు తనలో తానే సిగ్గుపడుచు, తనకీ తిరస్కారము జరుగుట న్యాయమే యని తలచెను. ఈ దుర్ఘటనకంతకు మూల కారణుడైన వాని నోటనుండియే ఇటువంటి మాటలను వినుట కతని కతి కష్టముగా నుండెను. అతడతి కష్టముతో కోపము నడచుకొనుచుండెను. నిజముగ కృష్ణశర్మ కమలను రక్షించుట కాతృతపడుచునే యుండెను. కాని బహిరంగముగ సహాయము చేయుట కాతనికి ధైర్యము చాలకుండెను.

కృష్ణ—ఆమె ఇంక నేమైనను షరతు కోరెనదా?

నారా—ఆఁ. కోరినదికాదా మరి. కాని అది పూర్తి చేయుటకు మీకు సామర్థ్యమున్నదా? ఆమె తనజీవితమును మర్యాదగ జరుపుకొనుటకు నెల కేబది రూపాయలు కోరినది. మీరంత సొమ్మియ్యగలరా?

కృష్ణ—ఏబది రూపాయల నియ్యలేను గాని ఇరువది రూపాయల నిచ్చుటకు సిద్ధముగా నున్నాను.

ఎందు కక్కరకురాలిన మాటలు చెప్పుతారు? ఇంతమాత్రం కష్టపడలేనివారు. నెల కిరువది రూపాయల నిచ్చెదనని ఖరారుచేసి చెప్పుతున్నారు. నా రాబడి వృద్ధిపొందిన మిగిలినవికూడ పూర్తి చేసెదను. ఇప్పుడే ఇరువది రూపాయలైనను నా మోటారు నమ్మివేసి ఖర్చు మిగిల్చెదను. ఎందుచేతనో కాని ఇప్పుడు నా రాబడి తగ్గిపోవుచున్నది.

నారా—సరే. మీరిరువది రూపాయ లిస్తారు. మిగతావి ఎట్లు పూర్తియగును? ఈ యూరి వారి సంగతి మీకు తెలియదా? వితంతుశరణాలయపు చందాలే అతి కష్టముమీద వసూలగుచున్నవి. చాలా రాత్రియైనది. ఇక నేను వెళతాను. నా శక్తికొలది తంటాలుపడతాను. కార్యసిద్ధి కానియెడల ఆ దోషమంతా మీదే.

## ౨౦

మోహనరావు బజారు వీధియందు గుఱ్ఱముపై సవారీ చేయుచు మేడలవైపు కిటికీలవైపు జూచుచు పోవుచుండెను. కమల వీధియందు నివసించుచున్నప్పటి నుండియు, మోహను డేదోవంక బెట్టుకొని ఆమె ఇంటివద్ద ఆగుచుండెను. ఈ నూతన పుష్పమాతని మనస్సును

ప్రేమోన్మత్తముగ జేయుచుండెను దీని వలన ఆతని మనస్సునకు కొంచెమైనను విశ్రాంతి లేకుండెను. తన వైపునకు బలాత్కారముగ త్రిప్పుకొను నటువంటి రూపలావణ్యమును, మనస్సును హరించు సరళ స్వభావమును, కమల యందు కలవు. ఈ సరళ సౌందర్యమూర్తికి తన ప్రేమ నర్పించుటకాతడు మిక్కిలి అభిలాష పడుచుండెను. కాని ఆతనికి తగిన సమయము దొరకుట దుర్లభముగా నుండెను. కమల గృహ మెల్లప్పుడును రసిక పురుషులతో నిండి యుండును. వీరిలో తన పిన తండ్రి నెరిగిన వారుందురేమో యను భయమును, మేడపైకి పోవుట కాతనికి సాహసము కలుగకుండెను. ఆతడు తన కోర్కెను హృదయమునందే అణచుకొని నిరాశతో తిరిగి ఇంటికి వచ్చుచుండెను. కాని ఈ రోజున అతడు కమల నెట్లయినను కలుసుకొని తీర వలెనని నిశ్చయించుకొనెను. విరహతాప మిక భరింప లేక కమల ఇల్లుచేరెను. లోపలినుండి కళ్యాణి రాగముయొక్క ఆలాపన మధుర ముగ విన వచ్చుచుండెను. కాని ఎంత ప్రయత్నించినను లోపల ప్రవేశించుటకు సాహసము కలుగ లేదు. అందు వలన పార్కునందు రెండు గంటల సేపు కాలము గడపి, తిరిగి తొమ్మిది గంటలకు కమల ఇల్లు చేరెను. శరత్కాల నిర్మల చంద్ర కిరణము లావీధి యందలి ఎత్తైన సౌధములకు వెండిపూత పూసి నట్లుండెను. ఆతడు కమల ఇంటి ద్వారము వద్ద నాగెను. లోపలినుండి సంగీత ధ్వని కాని మాటలధ్వని కాని వినవచ్చుట లేదు. లోపల నెవ్వరును లేరని నిశ్చ యించుకొని గుఱ్ఱముదిగి ద్వారము వద్దకు వచ్చెను. ఆతని గుండెలు తటతట కొట్టుకొనసాగెను. ఊపిరి వేగముగ వచ్చుచుండెను.

అప్పుడే కమల యొక్క పాటకచ్చేరీ ముగిసెను. గాలివాన వెలి యగనే ఎట్లు నిశ్శబ్దముగ నుండునో ఆవిధముగనే ఆమె మనస్సునకు శాంతి కలిగెను. భోగ విలాసములచే నడగి యున్న ఒక విధమైన

చేతన మామెకు నిగిగి సల్లయ్యెను. ఇటువంటి దశయందు మనస్సు పూర్వస్మృతులకు క్రీడాక్షేత్ర మగును. నిమిష మాత్రమే జ్ఞాననేత్రము విడి మనస్సును విచార సాగరమున ముంచివేయును. ఇప్పుడు కమల ధ్యానమగ్నయై సుభద్రమ్మ వైపు బోయెను. ఆమె తన మనస్సు నందే సుభద్రమ్మతో తనను బేరీజు వేసి కొను చుండెను. "ఆమెకు ప్రాప్తించిన శాంతిమయ జీవనము నాకెట్లు లభించును అసంభవము. అది వట్టి తృష్ణ. ఇక్కడ నట్టి శాంతి సౌఖ్యము లెక్కడ? శర్మగారు కచ్చేరీ నుండి ఇంటికి వచ్చు సమయమైన తోడనే ఆమె ఎంత ఉత్సాహముతో కమ్మని ఫలహారములు తయారు చేయుచుండును? ఆత డింటికి వచ్చు చున్న చడి వినబడగనే ఆమె ఎంత ప్రేమతో ఆయనను కలసి కొనుట కుబలాట పడు చుండును? ఆహా! నేను వారి ప్రేమాలింగనమును గూడ జూచితిని. ఎంత భావమయము? ఎంత పవిత్రవంతము? నాకా సౌఖ్య మెక్కడ? ఇక్కడ నలుగురు ఉన్నంత వరకు గడబిడ, తరువాత నిశ్శబ్దము. కొందరు ధనము చేతను, కొందరు వేష భాషల చేతను, మాయాజాలములను పన్ను చుందురు. వారి హృదయములును భావశూన్యములు, శుష్కములు, స్వార్థపూరితములు." అని పరి పరి విధముల తనలో తాను తలపోసి కొను చుండెను.

ఇంతలో మోహనుడు మెల్లని అడుగులతో ఆమె గదిలో ప్రవేశించెను. వానిని జూచి కమల తులుకుపడెను. ఆమె మోహనుని ఎన్నియో సార్లు జూచి యుండెను. వాని ముఖము శర్మ ముఖమును బోలి యుండెను. కాని ఆగంభీరతకు బదులు ఈతని ముఖమునం దుద్దండత తాండవ మాడు చుండెను. నాగరికత, రసికతలకు ముఖ్య లక్షణములైన జిత్తుల మారితనము, నీచత్వము ఈతని ముఖము నందు కన బడుట లేదు. ఈత డమాయకుడు గను, సహజ స్వభావ

ముగల యువకుడుగను కనబడు చుండెను. ఈ బంగారు పిట్ట ఎక్కడ వాలునో యని కమల నిరీక్షించుచు, ఈరోజున తన యింటికే వచ్చుట జూచి గర్వమును ఆనందమును, పొందెను.

మోహానుని ముఖము సిగ్గుచే నెఱ్ఱ బడెను. ఆతడు ముఖము వంచుకొని మౌనముగా నిలువ బడెను. సారాయి ఎప్పుడును రుచి చూడని వానికి దాని యందు కోరిక* పుట్టినను ఆవాసన తగిలిన తోడనే ముఖము తిరుగును. మోహనరావు తన నిజమైన సంగతిని కమలాబాయితో జెప్పక పోయినను, తానొక జమీందారుని పుత్రుడనియు, తన పేరు మోహనరావనియు మాత్రము జెప్పెను. కాని ఆతని రహస్యమెన్ని దినముల వరకో దాగలేదు. కమల తన దాసీ ద్వారా ఆతని సమాచార మంతయు బాగుగ తెలిసి కొనెను. అప్పటినుండియు ఆమె మనస్సునకు ఆందోళన కలుగ నారంభించెను. మోహానుని నొక్కరోజు చూడకపోయినను కమల కిప్పుడు తోచదు. కమల కాతని యందలి ప్రేమ దిన దినాభివృద్ధి నొందు చుండెను. ఆతడామెవద్ద నున్నప్పుడు ఎంత గొప్పవారు వచ్చినను వారి కామె దర్శనమగుట దుర్లభముగా నుండెను. ఈ ప్రేమ అనుచితమనియు నిషిద్ధమనియు ఆమె తలచి దానిని బైల పరచకుండెను. అట్లు ప్రేమించిన విశ్వాసఘాతక మని కూడ ఆమె తలచెను. "ఈరహస్యము బయల బడి, సుభద్రమ్మకు శర్మగారికి తెలిసిన వారేమను కొందురు? వారి మనస్సున కెంత దుఃఖము కలుగును? వారి దృష్టియందు నే నెంత నీచురాల నగుదును" అని విచారింప సాగెను.

ఎప్పుడైనను మోహనరావామెతో ప్రేమవచనములు పలికిన కమల ఆ సంభాషణను తప్పించి మరియొక సంభాషణలోనికి దింపు చుండును. మోహానుడు ప్రేమతో ఆమె చెయ్యిని పట్టుకొనబోయిన సిగ్గుతో ఆమె తప్పించుకొనుచుండెను. ఈ ప్రేమకల్పనవలన కలిగిన

ఆనందమును త్యాగము చేయుట కాని అనుద్ధగాలు నుండెను. మోహనరావు వాని మనోభావమును తెలిసికొనజాలకుండెను. ఆమె కలిగించు నిరుత్సాహమునకు తన ధనహీనతయే కారణమని తలచుచుండెను. మోహనుని నిష్కపటహృదయము ప్రేమతో నిండిపోయెను. కమలయే తన జీవనాధారమని అతడు తలచుచుండెను. కాని ఇంత మోహితుడై నప్పటికిని అతడు తన కోరికను పైకి కనబరుపక లోలోన అడచుకొనుట చాల విచిత్రము. ఏ నెట్లు ప్రవర్తించిన కమల కానందము కలుగునో ఆ ప్రకారముగ నాతడు ప్రవర్తించుచుండెను. కలుషితప్రేమతో కూడుకొన్న కామాత్రుతత నిజమైన అనురాగముయొక్క అధీనమై సదయహృదయముగ మారిపోయెను. కాని కమలయొక్క విముఖత అభివృద్ధి నొందుచుండుట జూచి అతడు తనలో, "ప్రేమ మర్యాదవలన లభించదు. ఈ దేవత ఉపాసనవలన గాక బహుమతులవలననే ప్రసన్నమగును." అని స్థిరపరచుకొనెను. కాని బహుమతు లిచ్చుట కాతనివద్ద ధన మెక్కడ? ఎవరి నడిగిన నెవ రిచ్చెదరు? ఆతడాలోచించి, ఆలోచించి చివరకు తన తండ్రిపేర నిక్కడ భోజనసదుపాయము బాగుగ లేదనియు, పినతండ్రితో చెప్పుటకు ముఖమాటముగా నున్నదనియు, అందువలన కొంత సొమ్ము పంపవలసిన దనియు నుత్తరము వ్రాసెను.

అక్కడ నీయుత్తర మందగనే జానకమ్మ తన భర్తను నిష్ఠురములాడి ఎగతాళి చేయుచు, "ఇటువంటి తమ్ముని జూచుకొనేనా మీ రింత పొంగిపోవుచున్నారు? ఇకనైనా మీ భ్రాంతి వైనదా? అబ్బాయికూడ నిదివరకల్లా తన పినతండ్రిని గురించి మహా గొప్పగా చెప్పేవాడు. ఇప్పుడు దీనితో వాడి కళ్లు కూడ బాగా విడి ఉంటాయి. ఈ కాలంలో ఎక్కడి విశ్వాసము? మునుపటిరోజులు, మునుపటి సంగతులు, ఇప్పుడు జ్ఞాపక ముంటాయా? ఈయనకొరకు నే నెంత కష్ట

పడ్డాను. పక్కలో పాలు కూడ నిచ్చి సాకి పెంచాను. దాని కంతకూ ఇదే ఫలము. బహుశః పని బుంగానికి అతని తప్పేమీ ఉండదు. ఆతని మనస్సు నే నెఱుగనా? ఈ సన్నిత్యమంతా ఆ మహారాణీ గారిదే. నేను చెప్పుతున్నాను చూడండి. ఇంకా వాడు వచ్చాక, ఎన్ని సంగతులు బయలుపడతాయో. పాపం బిడ్డ డెంత కష్టపడి పోతున్నాడో కదా?" అని అనెను.

ఇది యంతయు మోహనుని కల్పనయేమో యని గోపాలశాస్త్రికి సందేహముగా నుండెను. ఆతనికి తన పుత్రునియందు నమితమైన నమ్మిక కున్నను, జానికమ్మ అనురోధమువలన సొమ్ము పంపవలసి వచ్చెను.

ఉత్తరము వ్రాసిన మరునాటిదినమునుండియు మోహనుడు పోస్టాఫీసునకు వెళ్ళి తన పేర మనిఆర్డరు వచ్చెనదా యని పోస్టుజవానును అడుగ జొచ్చెను. చివరకు నాల్గవరోజున ఆతనికి పాతికరూపాయలు మనిఆర్డరుద్వారా వచ్చెను. పోస్టువారందరు ఆతనికి పరిచితులే గనుక ఆ సొమ్మాతనికి వెంటనే ఇచ్చివేసిరి. మోహనుడు సంతోషభరితు డయి ఆ సొమ్మందుకొని వెంటనే బజారునకు వెళ్ళి ఒక మంచి పట్టు చీరను కొనెను. కాని కమల ఆ పట్టుచీరను పసందుచేయునో చేయదో యని ఆతనికి సందేహముగ నుండెను. తాను జమీందారుడ నని చెప్పుచు నింత చిన్న బహుమతి నిచ్చుటకు సంకోచపడుచుండెను. చీర నొక కాగితమందు కట్టి పట్టుకొని గుఱ్ఱముపై నటు నటు దిరుగు చుండెను. ప్రతిదినమాతడు వట్టిచేతులతో నిస్సందేహముగ కమలా బాయివద్దకు పోవుచుండెడివాడు. కాని ఈరోజున నీ చిన్న బహుమతిని దీసికొని వెళ్ళుటకు తటపటాయించుచుండెను. చీకటి పడిన తర్వాత మనస్సును స్థిరపరచుకొని, మెల్లగ కమల మేడపైకి వెళ్ళి, ఆ చీరను ఆమె బట్టలదండెముపై నుంచెను. మోహనుడు వచ్చుట ఆలస్యమైనందున కమల చిన్నబుచ్చుకొని కూర్చొని యుండెను.

ఇంతలో అతడు వచ్చుట జూచి పుష్పమువలె కలకలలాడు ముఖముతో నవ్వుచు ఆతని కెదురుగ బోయి, ఏమి తీసికొని వచ్చితి ... యడిగెను.

మోహ—(సంకోచించుచు) ఏమి లేదు. ఈరోజున బజారులో ఈ చీరను జూచి చాలా బాగున్నదని నీకొరకు కొన్నాను.

కమ—(చిరునవ్వుతో) ఈరోజున మీకొరకింతవరకు నిరీక్షించి నందుల కిదియా ఫలము? (అని అనుచు ఆ చీరను దీసి చూచెను.)

నిజముగ మోహనుని అవస్థనుబట్టి చూచిన నది పెద్ద బహుమతి యనియే చెప్పవచ్చును.

కమల తనలో "ఎంతసొమ్మిచ్చి తనికొని తెచ్చినదో! ఇంటిలో నుండి ఎత్తుకొని పోలేదు కదా? లేకపోయిన శర్మగారి తనకింత సొమ్మెందుకిస్తారు? ఈతడేదైనా వంక జెప్పి అడిగి తెచ్చెనేమో?" అని అనుకొనుచూ ఆమె చీరను త్రిప్పివేయుదలచెను. కాని అందువలన నాతని మనస్సు చిన్నపోవునేమో యని భయపడెను. అయినా చీరను పుచ్చుకొన్న నాతని ప్రోత్సహించినట్లగునేమో యని తిరిగీ అనుమానించెను. చివర కీమాట చీర నుంచివేసి ఇకముందిట్టివి తేవలదని చెప్పుటకు నిశ్చయించుకొనెను.

కమ—మీ అనుగ్రహము వలన కృతార్థురాలనైతిని. మీవలన బహుమతులు పొందవలెనను ఆశ నాకు లేదు. శ్రమపడి మీరింత దూరము వచ్చుటయే నాయందు మీకు గల ప్రేమకు దర్శనము. నేను కేవలము మీకృపాదృష్టినే కోరుచున్నాను.

ఈ బహుమతి నిచ్చుటవలన మోహనుని మనోరథము పూర్తి కాలేదు. కమల ప్రవర్తనలో తారతమ్యమేమియు కనబడనందున తన శ్రమ యంతయు నిష్ఫలమయ్యెనని అతడు విచారింపసాగెను. అతడు తనలో, "నేనొక తుచ్ఛబహుమతి నిచ్చి, దానికే ఖించిన

ఫలము నాశించితిని. భూమిమీందనుండి ఎగిరి నక్షత్రములను బట్టుటకొనుట కాశించినట్లున్నది." అని అనుకొనుచు సిగ్గుపడజొచ్చెను. మోహనరావు తిరిగి మరియొక విలువగల బహుమతి నిచ్చు నాలోచనలో నుండెను. కాని కొన్ని నెలలవరకు దీనికి తగిన సమయము దొరకలేదు.

ఒకనాడు మోహనుడు స్నానము చేయుటకు నూతివద్దకు వెళ్ళి నబ్బుకొరకు స్నానపు గదిలోనికి వెళ్ళెను. లోపల కాలు పెట్టినతోడనె ఆతని దృష్టి చిలుకకొయ్యకు తగిలించిన వాచీగొలుసుపై బడెను. సుభద్రమ్మ అప్పుడే స్నానముచేసి ఆ గదిలోనుండి వెళ్ళెను. ఆమె స్నానము చేసినప్పుడు తీసి చిలుకకొయ్యకు తగిలించిన గొలుసును తిరిగి వేసికొనుట మరచిపోయెను. కచ్చేరివేళ అగుటవలన త్వరగా వంటచేయవలెనను తొందరలో సీగొలుసుమాట జ్ఞప్తికి రాలేదు. మోహనుడు దానిని జూచినతోడనె ఒక్కదాటున పోయి తీసెను. అప్పుడాతని మనస్సునం దేమియు చెడు ఆలోచనలు లేవు. పినతల్లిని కొంతసేపు తంటాలుపెట్టి తిరిగి ఆమె వస్తువామె కిచ్చివేయవలెనని తలచెను. తమాషా చేయుటకు మంచి సమయము దొరకెనని సంతోషించుచు, దొంగతనముగ ఆ గొలుసును తెచ్చి, తన సందుగలో దాచెను. సుభద్రమ్మ భోజనము చేసి పనులు చక్కబెట్టుకొని పరుండెను. అలసి యుండుటచే ఆమెకు రెండు గంటల వరకు మెలకువ రాలేదు. ఇంతలో శర్మ కచ్చేరినుండి వచ్చుటచే ఆయనకు ఫలహారము పెట్టి తరువాత నాతనితో మాట్లాడుచు కూర్చుండెను. కాని ఇంతవర కామెకు గొలుసు సంగతియే జ్ఞాపకమునకు రాలేదు. వారు గొలుసు గురించి యేమైనను మాట్లాడుచున్నారేమో యని తెలిసికొనుటకు మోహనుడు రెండు మూడుసార్లు లోనికి తొంగిచూచెను. కాని ఆ విషయమై ప్రస్తావన యేమియు ఆతని చెవుల బడలేదు.

సాయంత్రము కాగానే మామూలు ప్రకారము మోహనుడు షికారునకు తయారగుచుండెను. ఇంతలో నకస్మాత్తుగ ఆతని కొక ఆలోచన స్ఫురించెను. వెంటనే ఆతడు సందు తెరచి గొలుసునుదీసి జేబులో వేసికొని, తనలో "నేనీ గొలుసును కమలకు బహుమతిగ నివ్వనా? ఇక్కడ దీనిగురించి నన్నెవ్వ రడిగెదరు? ఒకవేళ నడిగిన నేనేమియు నెరుగనని చెప్పివేసెదను. పిన్ని నౌఖరులమీదనే అనుమానపడును." అని అనుకొనుచుండెను. తుదకీ చెడు ఆలోచనలు ఆతని సంకల్పమును దృఢపరచెను. ఈబహుమతిని కమల కిచ్చుట కాతనిమనస్సు తొందర పెట్టుచుండుట వలన, మరి ఎక్కడను షికారు తిరుగుట కాతనికి బుద్ధి పుట్టుట లేదు. మామూలుకన్న ముందుగనె గుఱ్ఱము నెక్కి బజారువైపు బయలుదేరెను. ఆతడక్కడ చిన్న ముఖమలు పెట్టెను కొని, దానియందా గొలుసు నమర్చి, కమల యిల్లు చేరెను. ఈ విలువ గల నగను సామాన్య బహుమతివలె ఖాతరులేనట్లామె కిచ్చుట కాతడు తలచెను. ఈ రోజున అతడు కమలవద్ద చాలసేపు కూర్చుండెను. కాని మామూలువలె సంతోషముగను, చనువుగను మాట్లాడుట కాతని బుద్ధి వెళ్ళకుండెను. ఈ బహుమతి ఆమె కెట్లిత్తునా యను ఆలోచన ఆతినిని బాధించుచుండెను. ఇంతలో చాల రాత్రి యగుట వలన మోహనుడు లేచి జేబునుండి పెట్టెను దీసి మంచముమీద నుంచి వెళ్ళిపోవుటకు సిద్ధపడెను. కమల ఆవైపు జూచి పెట్టెయం దేమున్నదని యడిగెను.

మోహ—ఏమీలేదు. ఖాళీ పెట్టె.

కమల—లేదులేదు. ఒక్కసారాగండి. అందులో నేమున్నదో చూచెదను.

ఇట్లనుచు ఆతనిచెయ్యి పట్టుకొని పెట్టెను దెరచి చూచెను. ఆ గొలుసు నిదివరకు సుభద్రమ్మ వేసికొని యుండగ నామె జూచెను.

అవి చాల సంపన్నముగను పనివాడితనముగను నుండెను. ఆ గొలుసును చూచినతోడనే కమల గుండెలలో పెద్ద రాయి పడినట్లయ్యెను.

కమల—(విచారముతో) ఇటువంటి బహుమతులు కొరకు కాసపడుట లేదని ఇదివరకే చెప్పితిని. మీరు నిష్కారణముగ నన్ను సిగ్గుపరచు చున్నారు.

మోహ—(గొప్ప జమీందారునివలె ఖాతరులేనట్లు నటించుచు) ఈ బీదవాడు యథాశక్తితో నిచ్చిన ఈచిన్న బహుమానమును పుచ్చుకొనక తప్పదు.

కమ—నాకన్నిటికన్నను అమూల్యమైనది మీ అనుగ్రహమే. ఇప్పటివలెనే యీ అనుగ్రహ మెల్లప్పుడును నాపైనుంచిన నదియే నాకు పదివేలు. ఈ గొలుసును రావోపు మీ క్రొత్త రాణిగారికి నాతరపున మీరియ్యండి. నా హృదయమునందు మీపవిత్ర ప్రేమ యున్నది. దాని కేమియు నితర కోరికలు లేవు. మీ యీ నడవడి వలన, నన్ను మీరు సాధారణ వేశ్యవలె తలచినట్లు తోచుచున్నది. కాని అది పొరబాటు. మీకొరకే నాప్రేమ నంతను అర్పించి వేసితిని. కాని ఇప్పటికిని మీరు దాని విలువను గ్రహింపలేకున్నారు.

మోహనుని కండ్లు నీటితో నిండిపోయెను. అతడు తనలో, "నిజ ముగ తప్పంతయు నాదే. అమూల్యమైన ఆమె ప్రేమ ఈ తుచ్ఛ బహుమతులను ఆశించుచుండెనని తలచితిని. ఈమె ప్రేమ కొరకు నా సర్వస్వమును ధారవోయునివా రెవరు కలరు ? కాని ఎంత గొప్ప ధనవంతులు వచ్చినను ఈమె వారివైపు ప్రేమతో కన్నెత్తియైనను జూడదు. నేను వట్టి భావశూన్యుడను, నీచుడను. ఈ అమూల్య ప్రేమను డబ్బుతో కొనదలచితిని" అని విచారింపజొచ్చెను. విచార కరమైన యీ ఆలోచనల వలన అతనికి చాల దుఃఖము కలిగెను.

కమ—(తన మాటలాతనిని బాధించెనని తెలిసికొని కరుణాస్వర

మనసులో) మోహనరావుగారూ! మీకు నామీద కోపమువచ్చినట్లున్నది?

మోహ—(ముఖమును త్రిప్పుచు) ఔను కోపమే వచ్చినది.

కమ—ఎందుకు కోపము వచ్చినది ?

మోహ—నీవు నన్ను మాటలను బాణములచే నొప్పించినావు. నేను ప్రేమకు కొనునంతటి నీచుడనని తలచినావు.

కమ—ఐతే ఈ వస్తువు లెందుకు తెచ్చినారు ?

మోహ—నాకు బుద్ధిపుట్టి తెచ్చాను.

కమ—క్షమించి ఇక్కడనుండి ఇటువంటి బహుమతులు తేవద్దు.

మోహ—సరే. చూద్దాం.

కమ—సరే. మీ ఇష్టానుసార మిప్పటికీ వస్తువు నుంచెదను. మీ రింకను స్వతంత్రులుకారు. జమీందారై మీ చేతికివచ్చిన తర్వాత నాయిష్టమువచ్చిన బహుమతులు మీవద్ద వసూలుచేస్తాను. కాని ఇప్పుడు కాదు.

## ౨౧

నారాయణదాసు తాను తలపెట్టిన కార్యమెప్పుడును నగములో విడిచి పెట్టువాడు కాడు. కస్త్రమాటల వలన నిరాశుడై కమలాభాయి కొరకు నెలకేబది రూపాయల నెట్లు సంపాదింతునా యని యాలో చింప జొచ్చెను. ఆయన స్థాపించిన సంస్థలన్నియు చందాలవల్లనే జరుపబడుచున్నవి. కాని ఆ చందాలు వసూలగుట మాత్రము చాల కష్టముగా నుండెను. ఆతడు వితంతు శరణాలయము కట్టించుటకు తల పెట్టెను. కట్టడము ప్రారంభించి రెండుసంవత్సరములైనను సొమ్ము జతపడక పైకప్పు వేయించలేక పోయెను. అందువలన గోడలన్నియు

వానకు నాని పడిపోవుచుండెను. బీదవాలు కొనుటకు ధనము లేసందున ఉచితపుస్తకాలయములోని పుస్తకములన్నియు చెదపురుగుల కాహారమగుచుండెను. ఇన్నికష్టములు కలుగుచున్నను చందాలు తప్ప మరియొక యుపాయము లేకుండెను!

బలభద్రరావునాయుడు ఊరిలో పేరుపడ్డ ధనికుడు. ఆయన ఆనరెరి మేజస్ట్రేటు, పురపాలకసంఘాధ్యక్షత మొదలగు గౌరవోద్యోగములను చేయుచుండెను. దాసు ధనసహాయము నిమిత్తము మొదట ఆయనవద్దకు వెళ్ళెను. నాయుడు తనబంగాళా వరండాయందు పడకకుర్చీలో పండుకొని చుట్ట కాల్చుచుండెను. మనిషి బాగా పొడగరి, బక్క పలచగాను తెల్లగాను ఉండును. చాలా రసికుడు. షోకుదారుడు. ఆలోచించనిదే ఏమే పనియందును కలుగజేసుకొనడు.

బల—(దాసుయొక్క ప్రస్తావనవిని) ఉద్దేశమేమో చాలామంచిదే. కాని కమలాభాయిని ఎక్కడనుంచుటకు నిశ్చయించినారు?

నారా—వితంతు శరణాలయమునందు.

బల—అట్లుంచిన శరణాలయమునకు చెడ్డపేరు వచ్చును. అదిగాక అక్కడి వితంతువులు భయపడి శరణాలయమును విడిచిపెట్టెదరు.

నారా—ఆలాగైతే మరియొక యిల్లు పుచ్చుకొని అందులో నుంచెదను.

బల—అట్లుంచిన మరీ యల్లరగును.

నారా—అయితే మరియేదో ఉపాయము సెలవియ్యండి.

బల—ఈయక్కరలేని తంటాలు మీామీాద పెట్టుకొనవద్దనే నా యభిప్రాయము. లోకనిందకు భయపడని స్త్రీని యెవరు బాగుచేయగలరు. మన శరీరమందేయవయవమైనను చెడిపోయిన ఆ విషము తక్కిన అవయవముల కెక్కకుండ దానిని కోసి పారవేయవలెనను సిద్ధాంతములేదా? సంఘవిషయమందు కూడ ఆ సిద్ధాంతమే అవలం

బించవలెనని నా యుద్దేశము. ఎంతవరకు నాకో యేకీభవించును నాకు తెలియును. ఐనను నా యుద్దేశ మేదో స్పష్టముగా చెప్పివేసితిని. శరకాలయకార్య నిర్వాహక సంఘమునందు నేనొక సభ్యుడను. కనుక ఒక వేశ్యను తెచ్చి శరణాలయమున నుంచుటకు నే నంతమాత్ర మొప్పుకొనను.

నారా—[రోషముతో] ఇంతవరకు తెలిసిన నా దాసోశము నాకు మీరీ విషయములో యేమాత్రము సహాయము చేయరన్న మాట. మీవంటి మహానుభావులే యీ విధముగా నన్నప్పుడు మిగిలినవారిమాట చెప్పే దేమిటి! నే నిదివరకే మీ కాలమును నష్టపరచితిని. క్షమింపుడు. వెళ్లుచున్నాను.

ఇట్లు చెప్పి దాసు అక్కడనుండి బయలుదేరి సుబ్బయ్యసెట్టిగారి యిల్లు చేరెను. సెట్టి చాలాలావుగాను నల్లగాను ఉండును. ఆ లావు పాటి స్థూలశరీరము ఎముకలకు బదులు మాంసముతోను, మాంసమునకు బదులు గాలితోను నిండి అంజచ దంతములు లేక ఒకనల్లని చిన్నకొండవలె నుండును. అతని యాలోచనలు కూడ అతని శరీరమువలె తుద మొదలు లేకుండ ఉండును. ఆతడు సనాతనహిందూసభకు అధ్యక్షుడు. రామలీలాకమిటీ చైర్మెను. గాంధర్వమహాలు యొక్క ముఖ్యస్థాపకులలో నొకడు. ఆతడు రాజకీయములనిన విషసర్పములకువలె భయపడుచుండును. గాని అధికారులయొక్కయు, దొరల యొక్కయు స్నేహము సంపాదించుటకు మాత్రము తల్లక్రిందులపడు చుండును. ఆంగ్లేయులకు ఈతడన్న అభిమానము గౌరవముకూడ కలదు. వారెల్లప్పుడు ఈ తని గుణములను ప్రశంసించు చుందురు. సెట్టి అంత ఔదార్యవంతుడుకాడు. అంత లోభియుకాడు. తనలోపము లను కప్పిపెట్టుకొను మహాగుణ మాతనియందు కలదు. ఆతని నడత యంతయు మహావిచిత్రమైనది.

సుబ్బ—[నారాయణదాసు (ప్రవేశించిని)] నమస్కారము! కేవలము శూన్యవ్యాపకులు. మీలో కొంచెమైనను రసికత లేదు. ఇన్ని రోజులకీ బజారువీధిలో ఒక సుందరి స్త్రీవేష వళ్ళు వేసుకుంటూ ఉంటే దానిని మీరు మానకం చెయ్యడానికి చూస్తూవున్నారు. చివరకు రామలీలోత్సవమైనా జరగనియ్యండి. పట్టాభిషేకమునాడు ఆమె పాలకచేరీ వైభవంగా జరిపించాలని ఉన్నది. అష్టమైన సానివాళ్లను మందిరంలోనికి రానిస్తున్నాము. బ్రాహ్మణ ఆవిడ ఉంటే సరేసరి కదా! పోస్తాని కన్నాను సుమండీ క్షమించండి. మీరిటువంటి ఘన కార్యములన్నియు తలపెట్టి జరిపించుచున్నందుకు మీ కనేక వందనములు. చందాపట్టీ ఏదీ? ఈలా తెండి!

నారా—[తలవంచుకొని] నేనింకా బలభద్రరావునాయుడు గారింటికే వెళ్లినాను. ఆయన యెటువంటి మనిషో మీ రెరుగరా! ఈ సంగతి ఆసంగతి మాట్లాడి ఏమీ చెప్పకుండా పంపివేశాడు.

నాయుడు ఒక రూపాయి వేస్తే, తాను రెండు. రెండు వేస్తే, నాలుగు. ఈ మొత్తంగా గుణించివేసి తన యాధిక్యతను కనబరచు స్వభావము కలవాడు సెట్టి. కాని అసలు అంకెయే లేనప్పుడు దానిని గుణించుటెట్లు? కనుక యీ చందాను తప్పించుకొనుటకు ఉపాయము చాలో యోచించి "నాకు మీయుద్దేశమునందు సానుభూతి కలదు కాని దీనిలో యేదో రాజకీయవిషయము కలసియున్నదనియే బలభద్రరావునాయుడు గారు తప్పించుకొనియుంటారు. నాకుకూడ అలాగే తోస్తూఉన్నది. ఇందులో యేమియు సందేహములేదు. మీదృష్టికి కనబడకపోయినా నాకు మాత్రమిందులో రాజకీయము గుప్తముగా కలసియున్నట్లు కనబడుతున్నది. ఈ సంగతి తెలిసిన, దొరతనపు పక్షపాతులకు కోపంవచ్చి అధికారులతో చెప్పివేయుదురు. వారి కిదంతా యేదో కుట్రగా తోచి మనల నందరనుకూడ అల్లరిలోనికి దింపుతారు.

నారా—(నవ్వుచు) మీకిచ్చుట కిష్టములేనియెడల మొదటే చెప్పివేయకూడదా; ఈ కింతకోపమంతా యెందుకు!

సుబ్బ—మీరాలాగే అనుకోండి. ఇటువంటి చందా లిచ్చుటకు నేనేం బద్ధుడనా మీకు!

ఇక్కడకూడ నారాయణదాసు మనోరథము పూర్తి కాలేదు. కాని ఇది ఆతనికి క్రొత్తకాదు. ఇటువంటి నిరాశాజనకములైన అనుభవము లాయనకు తరుచు కలుగుచునేయుండును. అక్కడి నుండి నారాయణదాసు డాక్టరు శ్యామలరావు యింటికి వెళ్ళెను. డాక్టరు బాగుగా చదువుకొన్నవాడు. ప్రపంచజ్ఞానముకలవాడు. ఆయన ఆ పట్టణమునకలి జాతీయవాదులలో నొకడు. ఆతనికి ప్రాక్టీసు చాల యెక్కువగా నుండెను. డాక్టరు తనపేరుకొరకు, గౌరవముకొరకు పాటుపడు స్వభావముకలవాడు. ఆతని స్నేహమువలన నొకనికి లాభముగాని, విరోధమువలన నష్టముగాని లేదు. ఈ విధముగ చరించుటవలన లోకు లాతని నొకప్పుడు మిత్రునిగను, ఒకప్పుడు విరోధిగను తలచుచుందురు. ఆత డా పట్టణము తరఫున శాసన సభయందు సభ్యుడుగ నెన్నుకొనబడెను.

శ్యామ—(దాసు చెప్పిన సంగతు లన్నియు విని) నాకు మీరు చెప్పిన విషయమునందు చాలా సానుభూతి కలదు. నే నిటువంటి సంఘసేవ జేయుటకు సిద్ధముగా నున్నాను. కాని నాయుద్దేశముగా నిటువంటి దురాచారములను మాన్పించుటకు వానిమూలకారణము కనుగొనుట ముఖ్యము. ఇప్పుడు మీరొక్క యువతిని రక్షించుట వలన సంఘమున కంత లాభము కలుగదు. ఇటువంటి దుర్ఘటనలు ప్రతిరోజు జరుగుచునే యున్నవి. కనుక మూలకారణమే మార్పు జెందవలసియున్నది. ఈ విషయము మీ కౌన్సిలులో ఏమైన ప్రశ్నలు వేయమన్నారేమో చెప్పండి.

నారా—(సంతోషముతో) జొండీ! అట్లేకూడ తప్పక చేయ వలెను. డాక్టరు వెంటనే ప్రశ్నల జాబితాను తయారుజేసెను.

" 1. క్రిందటి సంవత్సరము వేశ్యల సంఖ్య ఎంతవరకు వృద్ధియైనదో గవర్నమెంటువారు చెప్పగలరా?

" 2. ఈ వృద్ధికి కారణమేమో గవర్నమెంటువారు పరిశీలించిరా? దానినాపుట కేమి యుపాయముల నాలోచించిరి?

" 3. ఈ దుస్థితి మనోవికారములకు కెంతవరకు సంబంధించినది? సంఘ దురాచారముల కెంతవరకు సంబంధించినది? "

ఈ ప్రశ్నలు చదివి దాసునకు వినిపించి డాక్టరు తన రోగులతో మాట్లాడుటకు ప్రారంభించెను. డాక్టరు డబ్బు విషయమై యేమైనను చెప్పునేమోయని నారాయణదాసు అరగంటవరకు నిరీక్షించి చివరకు విసిగి ఆయనతో " ఐతే నేను చెప్పిన విషయమై యేమాలోచించి నారు! " అని ప్రశ్నించెను.

డాక్ట—నామాట నమ్మండి. ఈ సారి కౌన్సిలులో గవర్న మెంటు పక్షముయొక్కయు ప్రజాపక్షముయొక్కయు దృష్టి ఈవిష యమై ఆకర్షింపజేసెదను.

డాక్టరును తన రెండుచేతులతో బాగా మొత్తవలెనన్నంత కోపము నారాయణదాసునకు వచ్చెను. కాని ఆ కోపమును శాంత పరచుకొని వెనుకకు తగ్గెను. తిరిగి మరియెవరివద్దకు పోవుటకు ఆయనకు బుద్ధిపుట్టుటలేదు. కాని ఆకర్మవీరుడు పరిశ్రమ కెన్నడును వెనుకంజ వేయువాడు కాడు. ప్రతిదినము ఆతడిద్దరుముగ్గురు పెద్ద మనుష్యులను కలుసుకొని వారి సహాయమును కోరుచునేయుండెను. ఈ పరిశ్రమ ప్రతి స్థలమునందును నిష్ఫలముకాలేదు. ఆయనకు కొన్ని వందలరూపాయల వాగ్దానములును కొన్ని వంకలరూపాయలును దొరికెను. కాని నెలకు పూర్తికావలసిన మువ్వదిరూపాయ లీ ఈ

సొమ్మంతో నెట్లు పూర్తియగును! మూడునెలలు కిల్లక్రిందులపడిన తర్వాత అతికష్టముపైని నెలకు పదిరూపాయలు చందా వేయించుట యందాతడు సఫలుడయ్యెను.

చివరకింతకంటె హెచ్చుసహాయము దొరకునన్న యాశలేనందున నొకనాడు ప్రొద్దుటే ఆయన కమలాభాయి యింటికివెళ్ళెను.

నారా—కమలాభాయి! నీవు చేసిన ఖరారు జ్ఞాపకమున్నదా?

కమ—ఎప్పుడో అన్నమాట మరచిపోవుట నాతప్పుకాదు!

నారా—నీకు తగిన సదుపాయము వేగముగా చేయవలెనని నేను చాల తంటాలుపడితిని. కాని జాతీయభావముగల యిటువంటి సంఘముతో ఎంతతంటాలు పడినను తగినంత లాభము కలుగలేదు. ఇప్పటికి నేను నెలకు ముప్పదిరూపాయలు వచ్చునట్లు ఏర్పాటు జేసితిని. ఇంకామిగిలినదికూడ త్వరలోనే పూర్తి చేయగలనను ఆశకూడనున్నది. ఈ సొమ్మును పుచ్చుకొనుమనియు నీరోజుననే ఈనరకకూపమును వదలిపెట్టుమనియు నిన్ను వేడుకొనుచున్నాను.

కమ—శర్మగారిని మీరెందుకు తీసికొని వచ్చినారుకారు?

నారా—ఎంతచెప్పినను ఆయనవచ్చుటకొప్పుకొనలేదు. ఈ నెలకు వచ్చు ముప్పదిరూపాయల చందాలో నిరువదిరూపాయలు ఆయన యిచ్చినవే.

కమ—(ఆశ్చర్యముతో) బాగున్నది. ఆయన చాలా ఉదార మును చూపించినారే. నాయుడుగారివద్దనుండి, సెట్టిగారివద్దనుండి యేమైనను సహాయము కోరికినదా!

నారా—సెట్టిమాట నాయుడుమాట అడుగకు. సెట్టి రామలీలో త్సవములకు వేలకొలది ధనము సంతోషముతో ఖర్చుపెట్టగలడు. నాయుడు, ఆఫీసరులను, దొరలను సంతోషపెట్టుటకు వారడిగినదే తడవుగా నింతకంటె ఎన్నోరెట్లధికముగ ధనమిచ్చుచుండును. కాని

వారివిషయమై ముఖముచూచుటకు సిగ్గుపడుచుండెను.

కమల యిప్పుడు మోహనుని యొక్క మోహపాశములను చిక్కుకొని యుండెను. ప్రేమవలన కలుగు ఆనందమును కదపరకెన్నడును ప్రాప్తించి యుండలేదు. ఇప్పుడా యమూల్యరత్నమును సంపాదించి దానిని చేతులార వదలిపెట్టుటకు మనస్సొప్పకుండెను. ఈ ప్రేమ యొక్క పరిణామము వియోగము తప్ప మరియేమియు లేదని ఆమెకు తెలిసినప్పటికి, యెంతవరకీ యానందము ప్రాప్తించునో అంత వరకు దాని ననుభవించమని ఆమె మనస్సు ప్రోత్సహించుచుండెను. ముందికేమి జరుగునో తెలియదు. ఈ జీవననౌక యే యే సుడిగుండములలో చిక్కుకొనునో ఎక్కడ నొరిగిపోవునో యేమియు తెలియదు. రాబోవు విచారస్థితి నామె తన మనస్సునకు తెచ్చుకొనుటకు భయపడుచుండెను. దానిని తలచిన ఆమెకు భయసంకరమైన అంధకారము తప్ప ఇంకేమియు కనబడుటలేదు. అందువలన నిదివరకు తాను నారాయణదాసువద్ద నుత్సాహముతో ప్రస్తావించిన ఉద్దేశములు క్షీణించెను. ఇప్పుడు దాసు నెలకు నూరు రూపాయలు నిచ్చెదనని ఆశ పెట్టినను ఆమెకు సంతోషము కలుగదు. కాని యొకసారి ఇష్టపడి ఖరారుచేసిన మాటను తప్పిపోవుట కామెకు సిగ్గు వేయుచుండెను.

కమ—మీా మాటలకు జవాబు రేపు చెప్పెదను. ఇంకా కొంత ఆలోచించుకొనుటకు శెలవియ్యండి.

నారా—ఇందులో ఆలోచించుకొనుటకు బోధపరచుకొనుటకు యేమున్నది?

కమ—ఏమియులేదు కాని దయచేసి రేపటివరకు ఆగండి.

రాత్రి పదిగంటలైనది. చక్కని శరత్కాలపు వెన్నెల పిండి యారబోసినట్లుండెను. కమల కిటికీనుండి నీలవర్ణాకాశమును తదేక

హృదయమునందు తోచుచుండెను. క్రమశోషమానమైన ఆ చంద్రకాం
తిలో నక్షత్రములెల్ల కాంతి హీనము లగుచున్నవో ఆ విధముగానే
ఆమె హృదయమునందు చంద్రకాంతి రూపమైన సదుద్దేశములు చెడు
తలంపులను తారలను కాంతి హీనములుగ జేయుచుండెను. "నా
రాయణదాసు గారికేమి జవాబు చెప్పుదునా?" యను కఠిన సమస్య
ఆమె మనస్సును బాధించుచుండెను. ఆ రోజు ప్రొద్దుట, "రేపు జవా
బు చెప్పెదను" అని వంకజెప్పి నారాయణదాసును తప్పించుకొనెను.
కాని నిస్సంశయము తర్కవితర్కములు గావించిన పిదప నామెపూర్వో
ద్దేశములందు చాల మార్పుకలిగెను. కమల కిక్కడ భోగములకు
తగిన సమృద్ధియును లక్ష్మియు గలవు. కాని యెవరినిజూచిన తానస
హ్యించుకొనుచుండునో ఎవరి మాటలువిని తాను చీదరించుకొను
చుండునో వారినే చాలవరకు గౌరవించవలసి వచ్చుచుండును. ఇప్ప
టికిని ఆమె మనస్సునందు మంచియుద్దేశములు లేకపోలేదు. మంచి
భావములను నష్టపరచు దుర్వ్యసనములను అలవరచుకొనునంతటి
అధోగతి నింకను ఆమె పొందలేదు. భోగవిలాసములయం దామెకు
మిక్కిలి ప్రీతి యనుటలో సందేహ మించుకయు లేదు. కాని యీ విలాస
ములకు తగిన సామగ్రిని సంపాదించుట కవసరమైనది చెడునడవడి
యగుటచే ఆమెకది మిక్కిలి అసహ్యము. అప్పుడప్పుడామె ఏకాంత
ముగా కూర్చుని తన పూర్వపు దశకును ఇప్పటి దశకును తైఫారువేసి
కొనుచుండును. పూర్వము భోగవిలాసములు లేకున్నను ఆమె తన
సంఘమునందు గౌరవదృష్టితో చూడబడుచుండెను. అప్పుడామె
గుడికిపోవునపుడు వారి యెదుట తనవంశ గౌరవములను గురించి గొప్ప
గా చెప్పుకొనుచుండెడిది. తన భక్తిభావములను ధర్మనిష్ఠను వెల్లడిం
పగలుగు చుండెడిది. ఎవరియెదుటను గూడ తాను తక్కువదాని
నని పించుకొనలేదు. ఇక్కడ ఆమె అభిమానహృదయము అడుగడుగు

నకు కృంగిపోవు చుండెను. ఎంత నీచురాలి యైనప్పటికి నను తాను తలనత్తుట కర్హురాలను కాదని ఆమె తలచుచుండెను. పూర్వము సహించుచుండిన అవమాన నిరాదరణల కంటె నిక్కడి ప్రేమాలాపములు కన్నుగీటులు ఆమె కధికదుఃఖమును కలిగించు చుండెను. ఆమె భావపూర్ణహృదయమున కవి శూలపుపోట్లవలెనుండెను. అట్టిసమయమందామె శర్మపై కండ్లు పటపట కొరుకుచుండెను. "ఆ నిర్దయుడు తన చెడుపేరునకు భయపడక నా కాశ్రయమిచ్చిన నీ నరక కుండమునందు దుముకుటకు నేను సాహసించి యుండను రెండుమూడు రోజులు నన్నాయన తమయింటిలో నుండనిచ్చిన బహుశః నేను తిరిగి మాయింటికి వెళ్లిపోయే యుందును. లేక ఆ యనయైనను నన్ను సమాధానపరచి తీసుకొనివెళ్ళి యుండును. తిరిగి మామూలుప్రకారము పోరు పొందులలో జీవితము గడుపుకొని యుందును." ఈమాటలన్నియు శర్మ కప్పుచెప్పుటకే ఆయన నొకసారి తీసుకొని రమ్మని దానను నామె కోరెను.

ఈ రోజున దానుమాటల వలన శర్మ తన నుద్ధరించుట కెంత ఉత్సుకుడై యున్నాడో తన సహాయమును కొరకెంత ఉదారమును జూపుచున్నాడో ఆమెకు తేటపడెను. అందువలన కమల కిప్పుడు ఇదివరకు శర్మయెడల గల అసహ్యత గౌరవముగా మారెను. "శర్మగారు మిక్కిలి సత్పురుషులు. నేను బుద్ధిపూర్వకముగా జేసిన దోషము నాయనపై మోపితిని. ఆయన నాపై నెంతోదయజూపిరి. ఇప్పుడు నేనాయన కాళ్లపై బడి, "ఈ నిర్భాగ్యురాలికి చేసిన యుపకారమునకు తగిన ఫలము ఈశ్వరుడు మీ కిచ్చుగాక!" యని చెప్పికొందును. ఈహారమును కూడ ఆయనకు సమర్పించు కొందును. దీనివలన తాను రక్షించదలచు కొన్న అభాగ్యురాలింకను అధఃపతితురాలు కాలేదని ఆయన తెలిసికొని సంతోషించును. అటు తరువాత నీ పాపభూయి

ష్టమైన స్థలమునుండి తొలగిపోవుదును." అని చింతింపసాగెను.

కమల తన చంచలహృదయముపై ధిక్కారము జూపుచు, ఏమీ! ఈ పాపపు ప్రేమకొరకు ఈ దుర్లభమైన యువకాశము నోడుదునందునా! ఈ నాలుగురోజుల వెన్నెలకొరకు ఎప్పటికిని యీ పాప అంధకారమున పడియుందునా? నాతో కూడ నొక సరళహృదయ యువకుని జీవితమును కష్టపరచుట న్యాయమా? నన్నుద్ధరింపజూచుచున్నట్టి సజ్జనునియెడల నా ఇట్టి మోసము జేయుట? ఛీ! ఈ కలుషితప్రేమను నా హృదయమునుండి పారదోలెదను. మోహనుని మరచిపోయెదను. "నేనీ జాలమునుండి తప్పించుకొనుటకు నీవు కూడ సాయము జేయుము" అని ఆతనిని వేడికొందును.

ఆహా నేనెంత మోసపోతిని? ఈ స్థలము దూరమునుండి ఎంత మనోహరముగాను ఎంత సుఖప్రదముగాను ఎంత ఆనందకరముగాను కనబడినది? నేను దీనిని పువ్వులతోటగా భావించితిని. కాని ఏమైనది? విషసర్పములతోను క్రూరమృగములతోను కూడుకొనియున్నది.

ఈ నది దూరమునుండి వెన్నెలతో కప్పబడినట్లుండి ఎంత మనోహరముగా కనబడినది? కాని లోపల యేమున్నది? పెద్దపెద్ద కరాళ వదనములతో కూడుకొన్న జలజంతువులకు క్రీడాస్థలముగా నున్నది."

కమల యీవిధముగా విచారసాగరములో మునిగిపోయెను. ఎప్పుడు తెల్లవారునా? ఎప్పుడు దాసు వచ్చి ఇక్కడనుండి తన్ను తప్పించునా యని ఆమె ఆతృతపడుచుండెను. అర్ధరాత్రి యైనను ఆమెకు నిద్రపట్టుటలేదు. తెల్లవారి నారాయణదాసు వచ్చునో రాడో యని ఒకప్పు డామెకు శంక కలుగుచుండెను. "తిరిగి నేను ఉదయము మొదలు సాయంత్రమువరకు నీ పోకిరీవారియొక్కయు, ఈ గెడ్డముల సాయిబులయొక్కయు అనందర్భాలాపములు వినక తప్పదా? తిరిగి ఈపాపపంకిలముతో కూడుకొన్న యీ కుత్సితుల్లకు

ఆసనస్నానములు సేయుచుండి వచ్చునా ?"

కమల యిక్కడ నివసించుచుండి, సంవత్సర మారునెలలే యైనది. కాని ఈ కొద్దిరోజులలోనే ఆమె కీ స్థితియొక్క పూర్తి యనుభవము కలిగెను. ఆమె యిల్లెప్పుడును వచ్చిపోవు రసికులతో నిండియుండును. వారు తమయొక్క కపటము దురాచారము నీచతల గురించి గొప్పగా చెప్పుచుందురు. వీరిలో కొందరు జూదగాండ్రు, కొందరు తాగుబోతులు కొందరు మోసగాండ్రు. వారందరు తమ దుస్సాహసములామెతో చెప్పి పొంగిపోవుచుందురు. ఇరుగుపొరుగు స్త్రీలామె యింటికి ప్రతిదినము వచ్చుచుందురు. పైకి వారు మతాబులవలె వెలిగిపోవుచుందురు. కాని లోపల నంతయు విషమయమే! వారియం దెంత నిర్లజ్జ ? ఎంత కపటము ? ఎంత చెడుబుద్ధి ? నిర్లజ్జతో కూడుకొన్న తమ దుష్ప్రవర్తనను వారెంతో గొప్పగా చెప్పుకొనుచుందురు. వారిహృదయము లెప్పుడును పాపతృష్ణతో కూడుకొని యుండును. వీ రెల్లప్పుడు పట్టణములోని సచ్చరిత్రులను తిట్టుచు పిరికి వారనియు లుబ్ధులనియు వారిని హేళన జేయుచుందురు. వారు దినమంతయు పట్టణమందలి హత్యల గురించియు, దొంగతనముల గురించియు వ్యభిచారముల గురించియు చర్చించుచుందురు. కమల కిప్పుడిక్కడ ప్రేమాదరముల యదార్థరూపము కనబడుచుండెను. ఇది నిజమైన ప్రేమకాదు. ఆదరణ కాదు. కేవలము కామోద్రేకము. ఇంత వరకు కమల ధైర్యముతో నీ యాపదల నన్నిటిని అనుభవించినది. ఇంక నీ నరకకూపమునందే యున్న యెడల ఈనరకధర్మముల నాదరింపక తప్పదని ఆమెకు బోధపడెను. మొదట దా సామెయొద్దకు వచ్చినప్పుడు ఇక్కడి సాధకబాధకముల బోధపరచుకొనలేక ఆయన నుపేక్ష చేసెను. కాని యిప్పు డీముక్తిద్వారము తెరచియుండుట జూచి ఇక నీ కారాగృహమునం దొక్క క్షణమైన నుండుటకు

సహించలేకుండెను. సమయమును బట్టి దుర్గుణము లెట్లు జాగరిత ములగునో ఆవిధముగానే ఈ సమయమునందామె సద్గుణములు కూడ జాగరితము లయ్యెను. అప్పుడు తెల్లవారుఝాము అయ్యెను. గడియారము టంగుటంగని మూడుగంటలు కొట్టెను. కమల యిప్పటి వరకు నిద్రపోక ఈ ఆలోచనలతోనే ప్రక్కపై నిటు నటు దొర్లుచుం డెను. ఆమె మనస్సు నెంత త్రిప్పుకొన్నను మోహానునిమిత్తమై పోవుచుండెను. వేకువ సమీపించుచున్న కొలది ఆమె యాందోళన వృద్ధిపొందుచుండెను. "ఓ మనసా! నీ వీ ప్రేమను జూచి పొంగిపోవు చున్నావా? ఈ ప్రేమయొక్క యాధారము కేవలము రూపురేఖలని నీకు బోధపడలేదా? ఇది ప్రేమకాదు. మోహావేశము. ఇక్కడకు నిజమైన ప్రేమ జూపుట కెవ్వరును రారు. ఏప్రకారముగా మంది రమునకు నిజమైనభక్తితో దేవుని నుపాసించుటకు రారో, ఆవిధము గానే రసికు లిక్కడకు నిజమైన ప్రేమ నర్పించుటకు రారు. ఇక్క డకు వచ్చినవా రందరు కేవలము తమ మనోవాంఛలను దీర్చుకొను టకే వచ్చెదరు. ఈ కృత్రిమప్రేమలో జిక్కుకొనకు."

తెలతెల్లవారుచుండగా కమలకు చిన్న నిద్ర పట్టెను.

## ౨౨

సాయంసమయ మయ్యెను. కమల దిన మంతయు నారాయణదాసు కొరకు నిరీక్షించెను గాని యిప్పటివరకు నాతడు రాలేదు. ఆమె మనస్సునందు కలుగుచున్న శంక లన్నియు బలపడుచుండెను. "దాసు గా రిప్పటివరకు కూడ రాకపోవుట జూడగ తప్పక ఏదో ఆటంకము వచ్చినట్లు తోచుచున్నది. బహుశా ఆతడు మరియొక పనియందు

చిక్కుకొని రాలేకపోయినారేమో? సహాయము చేసెదమని ఖరారు చేసినవారు మాట తప్పిపోయి యుందురు. ఏమైనను ఆత డొకసారి ఇక్కడకు రావలసినది. అట్లైన నే నేమి చేయవలెనో నిశ్చయించు కొనుటకు వీలుగా నుండును. ఎవరు సహాయము చేయకపోయినను సరే. నేనే నాజీవితము నెట్లో గడుపుకొందును. కాని యొక సత్పురుషుని అండమాత్రము కావలసియున్నది. ఏమీ, దాసుగారీమాత్రము సాయము చేయరా? ఆతని కలుసుకొని ఇతరుల సహాయము నా కవసరము లేదనియు, మీరీవిషయమై హైరాణ పడవద్దనియు, ఉండుటకు కేదో యొక చిన్న యిల్లు సర్దుబాటు చేయవలసినదనియు, నా కావేళకు తిండికి సరిపడు పని నేదైనను చూపించవలసినదనియు వేడుకొందును. కాని ఆత డెక్కడ నుందురో తెలియదు. ఎవరి నడిగి తెలిసికొందును? చల్లగాలికొరకు పార్కునకు అనేకులు పెద్దమనుష్యులు వచ్చుచుందురు. అక్కడకు వెళ్ళిన ఆతని దర్శన మగునేమో! కృష్ణశర్మగారు కూడ చల్లగాలికొరకు ప్రతిదిన మక్కడకు వెళ్ళుచుందురు. కనుక ఆయనను కూడ నక్కడ కలసికొనవచ్చును. ఆయనకీ హారము నిచ్చివేయు వంక బెట్టి ఆయనతో నీవిషయమై కొంత మాట్లాడెదను.''

ఇట్లు నిశ్చయపరచుకొని కమల ఒక గుఱ్ఱపుబండిపైని ఒంటరిగా బయలుదేరెను. బండి తలుపు లన్నియు మూసి, సందునుండి జూచుచుండును. అనేకులు ఆబాటను వచ్చుచు బోవుచుండిరి. కాని వారిద్దరు మాత్ర మామెకు కనబడలేదు. పార్కువైపు బండి నడిపింపుమని బండివానితో నామె చెప్పబోవుచుండగా గుఱ్ఱముమీద సవారీ చేయుచు మోహనరావు వావైపునకే వచ్చుచుండుట ఆమె జూచెను. కమల హృదయము దడ దడ లాడసాగెను. ఆతని నెన్నో సంవత్సరములకు జూచినట్లామెకు దోచెను. ఆతనిని పిలువవలెనని ఆమెకు

బుద్ధిపుట్టినగాని, నోరు రాలేదు. కండ్లకగపడునంతవరకు నాతని ప్రేమదృష్టితో జూచుచుండెను. మోహనుని లావణ్యమున కామె ఎన్నడు నింత ముగ్ధురాలు కాలేదు. బండి పార్కును సమీపించెను. పట్టణమునకు పార్కు దూరములో నుండుటవలన సాధారణముగ నందరు నక్కడకు రారు. కాని శర్మకు నిశ్శబ్దమునెడల గల ఇష్టమే ఆతని నింతదూరము తీసికొని వచ్చుచుండును. అక్కడ నున్న యొక రాతిసోపానపై నాతడు కూర్చుని గంటలకొలది ఆలోచించుచుండును. ఆయన ఒంటరిగ కూర్చునియుండుటను కమల జూచెను. ఆమె హృదయము గాలిలోని దీపమువలె చలింపసాగెను. భయసంకోచములు రెండును ఆమెను వెనుకకు లాగుచుండెను. ఆమెకు తన మనస్సు యొక్క దశ ముందుగనే తెలిసియుండిన ఆమె ఇక్కడకు రాలేకపోయి యుండును. కాని ఇంతదూరము వచ్చి, శర్మ ఎదురుగా నుండుట జూచి కూడ నిష్ప్రయోజనముగ తిరిగిపోవుట మూర్ఖత్వము.

ఆమె కొద్దిదూరమునుండియే బండి దిగి గాలికి ప్రతికూలముగా బోవు శబ్దమువలె ఆమె శర్మవైపు వెళ్లెను.

కృష్ణశర్మ కుతూహలముతో బండివైపు జూచుచుండెను. ఆతడు కమలను పోల్చుకొనలేదు. “ఎవరు చెపుమా ఈ యువతి ఇట్లు వచ్చుచున్నది!” అని ఆశ్చర్యపడసాగెను. క్రిష్టియను స్త్రీ యని ఆతడు మొదట భావించెను. కాని ఆమె దగ్గరకు వచ్చినతోడనే పోల్చిపట్టెను. ఆమె కమల యని తెలియగనె ఆతని కాళ్లు చేతులు వణకసాగెను. ఆమె ఆయన సమీపమునకు వచ్చి తలవంచుకొని నిలువబడెను. శర్మ తత్తరపాటుతో దాగికొనుటకు స్థలము వెదుకుచున్నట్లిటు నటు జూడసాగెను. ఒక్కనిముష మట్లు తడబడి, అకస్మాత్తుగ లేచి వెనుక కొక్క దాటు వేసి తొందరగా నడువసాగెను. కమలకు వజ్రాఘాతమయినట్లయ్యెను. ఆమె ఎట్టి ఆశతో వచ్చినది? తప్పును

కండ్లలో నేమి జూచుచున్నది ? "ప్రభో! నాకీనాడు కూడ తాకకూడ నంతటి అధమురాలినిగ ఈయన నన్ను తలచెనా ?" ఇదివరకు శర్మ యెడల ఉత్పన్నమైన భక్తి క్షణములో మాయమయ్యెను.

కమ—(ముందునకు పోయి శర్మతో) నేను మీతో కొంచము మాట్లాడవలసి యున్నది. ఈ మాత్రపు కృప నాపై జూపి కొంతసేపాగండి.

కృష్ణశర్మ తన్ను భూతము వెంటాడుచున్న ట్లింకను తొందరగ నడవసాగెను.

కమ—(ఈ యవమానమును సహింపజాలక తీవ్రస్వరముతో) మీ రంత భయపడి పారిపోవుటకు నేను మిమ్ముల నేమియు నడుగుటకు రాలేదు. ఈ హారమును మీ కిచ్చుటకు మాత్రమే వచ్చితిని. ఇదిగో దీనిని పుచ్చుకొనుడు. నేనిప్పుడే పోవుచున్నాను.

ఇట్లు చెప్పి కమల హారమును శర్మవైపు గిరవాటువేసెను. కృష్ణశర్మ తులుక్కుపడి యా హారమును దీసి చూచెను. అది సుభద్రమ్మ యొక్క పోయిన హారమే. ఇంతలో కమల బండివైపునకు బోవుచుండెను. శర్మ ఆమెవద్దకు తొందరగ పోయి "నీ కీ హార మెక్కడ దొరికినది ? అని ప్రశ్నించెను.

కమ—నేను మీమాటలను వినకపోయినను, మీవైపు తిరిగి చూడకుండ వెళ్ళిపోయినను, నన్ను మీరు చెడ్డగ భావించకూడదు.

కృష్ణ—కమలాబాయి! నన్ను సిగ్గుపరచకు. నేను నీకు ముఖము జూపుటకు తగినవాడను కాను.

కమ—ఎందుచేత ?

కృష్ణ—అప్పుడు నేను నిన్నింటినుండి త్రోలివేయకపోయిన, నీ కిప్పుడీస్థితి సంభవించకపోయి యుండునుకదా యని నా మనస్సెల్లప్పుడును బాధించుచుండును.

కమ—ఐతే దీనికి మీరు సిగ్గుపడవలసిన ఆవశ్యక మేమిటి? మీరు నన్నింటినుండి పంపివేసి మహోపకారము చేసినారు. దీనివలన నా జీవితము బాగుపడినది.

కృష్ణ—(ఈ మెంగతాళికి నొచ్చుకొనుచు) ఇది యుపకారమే యైన యెడల, సిద్ధముగ నీ పుణ్యము నారాయణదాసునకు రామప్రసాదునకు జెందును. నేను ఇటువంటి ఉపకారము యొక్క పుణ్యమును కోరను.

కమ—మీరు ఉపకారముచేసి మరచినను నేను మరువక ఎల్లప్పుడును కృతజ్ఞురాలనై యుండెదను. శర్మగారు! నన్ను కదపకండి. మనస్సులోని మాట మనస్సులోనే ఉండనివ్వండి. కాని మీవంటి సదయహృదయులు ఇట్టి నిర్దయను జూపుదురని నే ననుకొనలేదు. పెద్దమనుష్యులే ఆదర సన్మానమునకు తగుదురని మీ రనుకొనవచ్చును. కాని దీనులే వారికన్న దీని నెక్కువ ఆశించెదరు. ఎందుకనగా నీ యాదరము పొందుటకు వారికి మరి యే ఇతర సాధనము లుండవు గనుక దీనికొరకు కపటము, మోసము, దొంగతనము చేయుదురు. ధన భోగవిలాసములవలన కలుగని సంతోషము ఆదరణవలన కలుగును. ఈ యాదరణ ఎట్లు దొరుకునను చింతయే ఎల్లప్పుడు నా మనస్సును బాధించు చుండెను. అప్పుడు దీనికి తగిన సమాధానము నాకు దొరకును. మీ ఇంటియందు సంవత్సరాదినాడు జరిగిన గాన సభయందు నాకు కలిగిన యనుభవము నా భయమును, సంకోచమును దూరపరచెను. ఆనాడు సభకు నేను రానియెడల నే నిప్పటికి ఆ పూరియింటియందు సంతుష్టితో, పడియుందును. నేను మిమ్మును సత్పురుషులని భావించితిని. అందువలననే మీ రసికతయొక్క ప్రభావము నామీద పనిచేసినది. రామతిలకము మీముందు గర్వముతో కూర్చుండెను. మీరామె కెదురుగ భక్తి గౌరవములు మూర్తిభ

మించినట్లు కూర్చుండిరి. మీ స్నేహితు లామె కన్ను గీటులకు ఆట బొమ్మలవలె మెలగిరి. ఆదరము నాశించు నొక అమాయకపు స్త్రీ కాపృత్యమువలన ఎట్టి ఫలము కలుగునో ఆ ఫలమే నాకు కలిగినది. కాని ఈ మాటలవలన నిప్పుడు లాభమేమి? పనదేదో పపోయినది. మిమ్ముల నెందుకు నిందించుట? - ఇది యంతయు నా దౌర్భాగ్యమే. నేను.........

కమల ఇంకనూ చెప్పదలచుచుండగా, గంభీర భావముతో వినుచున్న శర్మ మాట కడ్డము వచ్చి, "కమలాబాయి! ఈ మాటలన్నియు నన్ను సిగ్గుపరచుటకే చెప్పుచున్నావా? లేక నిజమేనా?"

కమ—చెప్పడమేమో మిమ్ములను సిగ్గుపరచుటకే చెప్పుచున్నాను. కాని ఈ మాటలన్నియు నిజమే. చాలరోజులక్రిందటనే ఈ సంగతులన్నియు మరచిపోయినాను. ఇప్పుడు మీరు నానీడను సహితము త్రొక్కుటకు భయపడి పారిపోవుటవలన నీ సంగతులన్నియు నాకు జ్ఞప్తికి వచ్చినవి. కాని ఇప్పుడు నాకే పశ్చాత్తాపము కలుగుచున్నది. క్షమించండి.

శర్మ మరి తలయెత్తలేదు. ఆతడు తిరిగి ఆలోచనాసముద్రములో మునిగిపోయెను. కమల ఆతనికి వందనము లర్పించుట కిక్కడకు వచ్చియుండెను. కాని మాటలు ముదురుటవలన అందుకు వీలు కలుగలేదు. ఇంతవరకు వచ్చినతర్వాత నిప్పుడు కృతజ్ఞతను దెలుపుట కామె కసందర్భముగా దోచెను. కనుక ఆమె మరి మాట్లాడక బండి వైపునకు వెళ్లబోవుచుండెను. అప్పుడు శర్మ హారము సంగతేమని ప్రశ్నించెను.

కమ—ఈ హారము నిన్న నొక షరాబువద్ద నేను జూచితిని. దీనినిదివరకు సుభద్రమ్మగారి మెడలో జూచుటవలన ఆనవాలు పట్టి మీ వద్దకుతీసికొని వచ్చితిని.

ెను. కృష్ణశర్మ తొందరపడి లేచెను. అప్పుడప్పుడే చీకటి పడుచుం డెను. దగ్గరగానున్న శివాలయము నందలి గంట వాగుచుండెను. ఆ ధ్వనులు, "కమల దుర్గతికి నీవే కారకుడ" వని చెప్పుచున్న ట్లుండెను.

ఆతడీ తలంపు లన్నిటిని బలవంతముగా నడచుకొని ఇంటికి బయ లుదేరెను. అప్పుడాతని దృష్టి ఆకాశముపై బడెను. నల్లని పటముపై ప్రకాశమానములైన అక్షరములతో, "కమల దుర్గతికి నీవే కారకు డ" వని వ్రాసినట్లుండెను. మైదానమునందు పోవుచున్న యాత్రికుడు మేఘములను జూచి దూరమున నున్న వృక్షములను సమీపించుటకు త్వరగా పోవునట్లాతడు పెద్దపెద్ద అడుగులు వేయుచు హైరోడ్డువైపు బయలుదేరెను. కాని ఆ ఆలోచనలాతని నెక్కడ విడిచిపెట్టును ? కమల వెనుకవెనుక వచ్చి ఆతని త్రోవనడ్డుచు, "నాకీదుర్గతిని నీవే కల్పించితివి" అని అధిక్షేపించుచున్నట్లాతనికి తోచుచుండెను. శర్మ తుదకెట్లో ఇల్లుచేరి గదిలో ముసుగు పెట్టుకొని పరుండెను. భోజనము నకు లెమ్మని సుభద్రమ్మ ఎన్నియో సార్లు లేపెను కాని తలనొప్పిగా నున్నదని చెప్పి ఆతడు లేవలేదు. రాత్రియంతయు కమల ఆతని గుండెలపై కూర్చొని, "నీవు చదువుకొన్నవాడవనియు, బుద్ధివివేక ములు కలవాడవనియు, గర్వించితివి. నీ రసికతయును నగ్నిని గుడిసెల వైపు వదలెదవా ? ధనమును విరజిల్లవలెనని నీకున్నయెడల పోయి మైదానములయందు జల్లుకో. దరిద్ర దుఃఖితుల ఇండ్లెందుకు మంట బెట్టెదవు ?" అని ధిక్కరించు చున్నట్లుండెను.

తెల్లవారగనే కృష్ణశర్మ నారాయణదాసింటికి బయలుదేరెను.

సాయంత్రము పడినతోడనె సుభద్రమ్మకు తన వాడీగొలుసు సంగతి జ్ఞాపకమునకు వచ్చెను. తాను స్నానము చేయుచున్నప్పుడు ఆగొలుసును చిలుకకొయ్యకు తగిలించినట్లామెకు బాగుగ జ్ఞాపకము. అందువలన నక్కడ కామె పరుగెత్తుకొని వెళ్ళెను. ఎంతవెదకినను గొలుసు కనబడనందున ఆమె గందరగోళపడుచు నిల్లంతయు మూలమూలల వెదకెను. కాని ఎక్కడను కనబడలేదు. తిరిగి పెట్టెలను, అల్మారులను సూదికొరకు వెదకినట్లు వెతికెను. కాని లాభము లేకపోయెను. వంటలక్క నడుగగ ప్రొద్దుట తాను రానేలేదనియు, తానివ్వడింకను స్నానపు గదివైపైనను వెళ్ళలేదనియు పిల్లలపై నొట్టుపెట్టి చెప్పెను. వెంకటస్వామిని పిలచి యడుగగా వాడు "అమ్మగారు! నాకీముసలితనములో మచ్చ తేకండి. నాజీవితమంతా మీవంటివారివద్ద నమ్మకముగా నౌఖరీ చేయుచునే గడపితిని. కాని ఎప్పుడును, నిట్టి దొంగతనము నెరుగను. చచ్చేకాలములోనా యిట్టి బుద్ధి?" అని ఏడ్చుచు దీనముగ పలికెను. ఏమనుటకును సుభద్రమ్మకు నోరు వచ్చినదికాదు. ఇంక నెవ్వరి నడుగగలదు? ఏమియు తోచక సందుకపెట్టెలు, బట్టలపెట్టెలు, తిరుగవేసి వెతకెను. నిలువ సామానులు, పిండికుండలు కూడ వదలిపెట్టలేదు. చివరకు నిరాశురాలయి మంచముపై పరుండెను. ప్రొద్దుట తాను నీళ్ళుపోసుకొని వచ్చినతోడనె మోహనుడు స్నానపు గదిలోనికి వెళ్ళుచుండగ జూచినట్లామెకు జ్ఞాపకమునకు వచ్చెను. ఒకవేళ అతడు హాస్యమునకు దీసి దాచెనేమో యని యామె యనుమానించెను. కాని ఈసంగతి నతనిని నడుగుటకు సంకోచముగా నుండెను. కృష్ణశర్మ యింటికి వచ్చినతోడనే ఈసంగతంతయు జెప్పెను.

కృష్ణ—మరియొకసారి బాగా వెతుకు. ఇంట్లో ఏమూలో పడవేసి యుంటావు.

సుభ—ఇల్లంతా గాలించేశాను.

కృష్ణ—నౌఖర్లను అడిగావా?

సుభ—వాళ్ళందరను అడిగాను. వారెవ్వరూ నగను తీయలేదని ఒట్టు పెట్టుకొని మరీ చెప్పినారు. ఆగొలుసు నీళ్ళు పోసుకొన్నప్పుడు చిలక్కొయ్యకు తగిలించినట్టు బాగా జ్ఞాపకము.

కృష్ణ—ఐతే ఏమైపోతుంది? రెక్కలొచ్చి ఎగిరిపోయిందా ఏమిటి?

సుభ—నౌఖర్లపై నాకెంతమాత్రం అనుమానంలేదు.

కృష్ణ—దీనికోసం పై వాళ్ళెవరు వచ్చినారు?

సుభ—ఐతే చెప్పండి. మోహనని అడగమన్నారా! అతడు నీళ్ళగదిలోనికి వెళ్ళుచుండగా చూశాను. తమాషాకు తీసి దాచాడేమో?

కృష్ణ—నువ్వెందుకలా అనుమానం పడతావు? దాచిఉంటే ఈపాటికి చెప్పడా?

సుభ—అడిగినంత మాత్రాన్ని తప్పేమిటి? బాగా తంటాలుపెట్టి చెప్పుదామని ఊరుకొన్నాడేమో.

కృష్ణ—తప్పు కాదు. ఒకవేళ వాడు గొలుసు తియ్యకపోయిన తన మీద దొంగతనం కట్టావని అనుకోడా!

సుభ—అతడా గదిలోనికి వెళ్ళుచుండగా నాకళ్ళార చూశాను.

కృష్ణ—ఐతే వాడు నీగొలుసు తీసుకోనడమునకే వెళ్ళాడంటావా ఏమిటి? అసందర్భపు మాటలాడకు. ఎవరేనా వింటే బాగుండదు. వాడికెంతమాత్రం ఈసంగతనకవద్దు. వాడెంతమాత్రం తీసి ఉండడు. ఒకవేళ తీస్తే ఈవేళ కాకపోతే రేపిచ్చేస్తాడు. అంత తొందరెందుకు?

సుభ—మీలాంటి దిట్టమైనవాండ్లు నాకులేరు. అంతవరకు తొందరపడకుండ నేనుండలేను.

కృష్ణ—ఏమైనాసరేగాని వానిని ఎంతమాత్రం అడుగవద్దు.

సుభద్రమ్మ అప్పటిమట్టుకు ఏమనలేక యూరకుండెను. కాని రాత్రి తండ్రి కొడుకులిద్దరు భోజనము చేయుచుండగా ఉండ మనస్సు పట్టలేక మోహనునితో, "బాబూ! నా వాచీగొలుసు ఎక్కడా కనబడడం లేదు. ఒకవేళ తమాషాకు తీసిదాస్తే చెప్పు. మరి తంటాలు పెట్టకు" అని మెల్లగా నడిగెను.

మోహనుని ముఖము వెలవెలబోయెను. గుండెలు దడదడ కొట్టుకొనసాగెను. దొంగతనముచేసి దానిని కప్పిపుచ్చుట నాతడెరుగడు. నోటిలోపెట్టుకొన్న అన్నము నోటిలోనే ఉండెను. మతిపోయిన వానివలె నేమియు మాట్లాడక తెల్లపోయిచూడ మొదలుపెట్టెను. కృష్ణశర్మ సుభద్రమ్మవైపు తీక్ష్ణముగ జూచుటవలన ఆమె భయపడి మరి నోరెత్తుటకు సాహసించలేకపోయెను. మోహనుడు తొందరగా భోజనముచేసి లేచి వెళ్ళిపోయెను.

కృష్ణ—నే నేపని చెయ్యవద్దంటే ఆపనే చేస్తావు నీకెందుకింత నిర్లక్ష్యం?

సుభ—మీరు రాత్రిని ముఖం చూడలేదా? అతడే తప్పకుండా తీశాడు. ఒకవేళ అబద్ధమైన అప్పుడు నన్ననండి.

కృష్ణ—సాముద్రికవిద్య ఎప్పుడు నేర్చుకున్నావు?

సుభ—అతని ముఖములోనే అంతా స్పష్టముగా కనబడుతూ ఉన్నది.

కృష్ణ—ఐతే సరే వాడేతీశాడనుకో. ఒక్కగొలుసేమిటి? నాదంతా వాడిదే. ఇష్టంవస్తే చెప్పి తీసుకుంటాడు. లేకపోతే చెప్పకుండా తీసుకుంటాడు.

సుభ—(చీదరతో) మీకిష్టమైతే మీసర్వస్వము వానికిచ్చెయ్యండి. కాని నావస్తువు మాత్రంపోతే నేను చూసి యూరుకోలేను.

కమలను కలుసుకున్న నాటిరాత్రి శర్మ షికారునుండి వచ్చిన తోడనే సుభద్రమ్మ భోజనమునకు పిలచుటకు వెళ్ళగా ఆతడా గొలుసును ఆమెవైపు పడవేసెను. సుభద్రమ్మ గొలుసును దీసి తన దనిపోల్చి, "మోహనుడే తీసి దాచియుంటాడని నేననలేదా? అంతేనా?"

కృష్ణ—మళ్ళీ అతలతిక్కమాటనే ఆడుచున్నావు? దీనిని నేను బజారులో నొక షరాబువద్ద చూసినాను. మోహనునిపై అనుమాన పడి, వాడినెందుకు దుఃఖపెట్టుతావు. ఈలాంటి తెలివితక్కువ మాట లాడకు. వదినే వాళ్ళు వింటే మావాడిని ఉంచుకోలేక దొంగతనం కట్టారని మనని నిందిస్తారు.

## ౨౪

కమల నెలకు ముప్పదిరూపాయలు పుచ్చుకొనుట యొప్పుకొన దేమోయని నారాయణదాసునకు సందేహముగా నుండెను. ఇందు వలననే ఆమె రేపు జవాబు చెప్పెదనని వంకపెట్టి తప్పించుకొన్న దేమోయని యాతనికి సందేహముగా నుండెను. కనుకనే మరునటి దినమాతడు కమలవద్దకు వెళ్ళలేదు. "మిగిలిన రూపాయలెట్లు సమ కూర్తునా?" యను విచారముతో ఆతడు కొట్టుకొని పోవుచుండెను. ఒకొక్కప్పుడేదైన నాటకమూడి సొమ్ము సంపాదించవలెనని యను కొనును. ఒకొక్కప్పు డితరపట్టణములకుకూడ వెళ్ళి చందాలను వసూలు చేయవలెనని యనుకొనును. కళ్యాణపురమునందు రామ

దేవశర్మయను జమీందారుడు కలడు. ఆతడు చాలా సజ్జనుడు, ఉదారుడు. కాని దాసు వారింటికి వెళ్ళినప్పు డాతడు సంగీతపరవశుడై యుండెను. "ఇంత రసికత్వము కలవాడు నాకుసహాయము చేయునా?" యని తలంచి తిరిగి వచ్చివేసెను. తన కీ సమయములో సహాయము చేసినవారు పుణ్యాత్ములనియు చెయ్యనివారు పాపాత్ములనియు ఆతడు భావించుచుండెను. ఈయాలోచనలతో కొట్టుకొనుచు కమల వద్దకు వెళ్ళుటా, మానుటా, యని సంశయించుచుండగా నింతలో కృష్ణశర్మ వారింటికి వచ్చెను. ఆతనికళ్లు పొంగి ఎఱ్ఱగా నుండెను. ముఖమంతయు వాడి తెల్లవార్లు జాగరముచేసినట్లుండెను. విచారాలోచనలు ఆయనయందు మూర్తీభవించినట్లుండెను. దాసునకు శర్మ యెడల భావన్ను విరిగిపోవుటవలన మూడుమాసములనుండి వారింటికి వెళ్లుట మానివేసెను. కాని శర్మయొక్క యిప్పటిస్థితిని జూచి యాతనిమనస్సు కరిగెను. దాసు ప్రేమతో ఆయనచేతులు పట్టుకొని, "అన్నగారూ! చాలావిచారముగా కనబడుచున్నారు. అంతా క్షేమముగా నున్నారా?"

శర్మ—ఆ. అందరుక్షేమమే. రెండుమూడు నెలలనుండి మిమ్ములను కలునుకోవడములేదు. మిమ్ములను చూడవలెనని బుద్ధిపుట్టి వచ్చినాను. కమల విషయమై యేమి నిశ్చయించిరి?

నారా—ఆయాలోచనలతోనే రాత్రి పగలు కొట్టుకొనుచున్నాను. ఇంతపెద్దపట్నంకదా? నెలకు ముప్పది రూపాయలు వచ్చే దారెక్కడా కనపడుటలేదు. అడగడం నేర్పుకూడ నాదగ్గిర లేదేమో యని అనిపిస్తూయున్నది. ఇతరుల మనస్సును ఆకర్షించే నేర్పు నాదగ్గరలేదు కాబోలు. పరులయందు ఆ నేరము మోపుచున్నాను కాని ఆతప్పంతా నాదే. ఇప్పటికి పదిరూపాయలు వచ్చు యేర్పాటైనది. ఇందరు గొప్పవారున్నను అందరిది రాతిగుండే,

తక్కినవారి సంగతి అలా నుంచండి. ఆఖరికి ప్రకాశరావుగారు కూడ నిర్మొహమాటముగా జవాబు చెప్పివేసినారు.— పత్రికలలో ఆయన వ్యాసములు చదివిననాకు ఆయనంత దయాసాగరులు, దేశాభిమానులు వేరని అనుకొనెదను. మా యింట్లో సంవత్సరానినాడు పాటకచ్చేరీ ఐన తర్వాత కొన్ని రోజులవరకూ మీపైని పుష్పవర్షము కురుస్తూనే వుండెను. కాని నిన్న నా మనసిష్టకేవిషయమై వెళ్ళగా "సంఘమునకంతకూ సేవచే ఋణపడియున్నానా! నావద్ద కేమున్నది. దేశసేవ చేయుచున్నాను. ధనమున్నవారిని దానితో సేవ చెయ్యమనండి.'' అని పలికేసరికి నేను నిర్ఘాంతపోయాను. ఇప్పుడాతడు పెద్దమేడ కట్టించుచున్నాడు. "మేపగుబిల్లు'' లో ఎన్నో "షేర్లు'' కొన్నాడు. దానికి దరిద్రం లేదు. ఈ జాతీయకార్యం అనగానే ఎక్కడ లేని దరిద్రం వచ్చింది. తక్కినవారంతా యేదో అనుమానించారు కాని ఈతడు నామీదకే అడ్డంగా తిరిగాడు.

శర్మ—నెల కేబదిరూపాయలిచ్చిన ఆమె అక్కడనుండి వచ్చుట కొప్పుకొనునా?

నారా—ఆం. ఒప్పుకొనునని నాకు నమ్మకముగానే యున్నది. వీలైతే విధవాశ్రమమునందుంచవలెనని నాకున్నది కాని కమిటీ వారు ఒప్పుకొనెదరో లేదో? లేని యెడల మరియొక యేర్పాటు చేసెదను.

శర్మ—ఐతే సరే. మీరిక తంటాలు పడకండి. నేనే యేబది రూపాయలు ఉంస్తాను.

నారాయణదాను ఆశ్చర్యమును కృతజ్ఞతను వెలిబుచ్చుచు శర్మను కౌగలించుకొని "సోదరా! మీకు శుభమగుగాక! మీరు తలపెట్టిన యీ ఘనకార్యమునకు నామనస్సు సంతోషముతో పొంగిపోవుచున్నది. మీరు హిందూజాతి గౌరవమును నిలువబెట్టి, గొప్పవారము,

సంఘాభిమానులము అనుకొని గర్వపడు వారందరకు సిగ్గువచ్చునట్లు చేసినారు. కాని ఇంత భారమును తామొక్కరెట్లు వహించగలరు?

కృ. శ—దైవమే యేదో త్రోవ చూపిస్తాడు.

నారా—ఇప్పుడు మీరాబడి బాగున్నదా!

శర్మ—రాబడిమాట అడగకండి. కారు అమ్మేసినచో ముప్పై రూపాయలు మిగులుతాయి. పెట్రోలు దీపాలు మానేస్తే అవో పది రూపాయలు మిగులుతాయి. తక్కిన పదిరూపాయలకు ఏదో తంటాలు పడుతాను.

నారా—ఈ భారమంతా మీయొక్కరిమీద మోపుటకు నాకు చాలా కష్టముగా ఉంది. కాని యేమి చెయ్యగలను? పట్నంలో ఉన్న పెద్దమనుష్యులందరు ఈ లాగు దగాచేశారు. కారు అమ్మేస్తే కచ్చేరీ కేలాగు వెళ్లుతారు. రోజూఅద్దెబండిమీద వెళ్ళగలరా?

శర్మ—అద్దెబండిమీద వెళ్ళను. మా అబ్బాయి ఒక గుఱ్ఱాన్ని కొన్నాడు. అవసరమైతే అదే ఉపయోగిస్తాను.

నారా—రోజు బజారువీధిలో గుఱ్ఱమెక్కి తిరుగుతూ వుంటాడు. అతడేనా యేమిటి మీఅబ్బాయి?

శర్మ—వాడే అయి యుంటాడు.

నారా—ముఖం అచ్చంగా మీ పోలికగానే ఉంటుంది. మంచి ఖరీదుగల కోటు వేస్తాడు. పెద్దకళ్లు. ఎఱ్ఱగా ఉంటాడు. మంచి కసరత్తు చేసిన వాడిలాగు బలంగా అగుపడుతాడు, అతడేనా?

శర్మ— ఆఁ, ఔను. వాడే. పోలిక బాగా చెప్పినారు.

నారా—సానివీధిలో తిరుగవద్దని ఎందు కడ్డుపెట్టినారుకారు?

శర్మ—వాడెక్కడెక్కడ తిరుగుతున్నాడో నా కేం తెలుసును; కాని పనిమీద అప్పుడప్పుడు అటుప్రక్కవెళ్ళినాడేమో? పిల్లవాడు చాలా బుద్ధిమంతుడు. అందువలన వాడెటువైపు వెళ్ళినా నాకనుమానంలేదు.

నారా—ఇంకాలో మీరు చాలా పొరపాటు పడుచున్నారు. మొదట ఆలోచం బుద్ధిమంతుడే అయి ఉండవచ్చును. కాని యిప్పటి తసి సంగతి ఏమీ బాగులేదు. ఒకసారి కాదు, పెక్కుసారులాతని సాని వీధిలో చూశాను. కమలాబాయి మోహంలో ఆతడు చిక్కుకొన్నట్లు కనబడుతుంది.

శర్మ—(తెల్లబోవుచు) మీరు పొరబడి ఉంటారు. వాడే మా వంశోద్ధారకుడు ఈ చేతులారా పెంచిన మందరము గంగలో దిగనిచ్చిన దే. నేనక అక్క గారి మొహం చూడలేను. (ఇట్లుచెప్పుచు కన్నీళ్ళు కార్చి) ఓరి! వాని నెలాగున్నైనను మంచి మార్గమునకు తీసికొని రండు. ఈ సంగతి ఏమాత్రము మా అన్న గారికి తెలిసెనా ఇక ఆయన నా ముఖం చూడగు..

నారా—భయంలేదు. భయపడకండి. ఆతనిని మంచిమార్గమునకు తీసికొని రావచ్చును. ఇప్పటివరకాతడు మీవాడని నాకు తెలియనే తెలియదు! నేటి రోజునుండి నేను ఈవిషయమై కనుక్కుంటాను. కమల అక్కడనుండి వచ్చివేసినట్లయితే ఆతనంతటాతడే బాగు పడుతాడు.

శర్మ—కమలవచ్చేస్తే ఆవీధంతా ఖాళీ అవుతుందా యేమిటి? మరియొకరి మాయలలో చిక్కుకుంటాడు. ఇప్పుడేమి చెయ్యడం, మాయూరు పంపేసేనా?

నారా—అక్కడినుండి వచ్చినవాడే కదా? వెళ్ళమంటే అసలు వస్తానో నే నప్పుకోడు. ఒకవేళ వెళ్ళినామరునాడే తిరిగీ వచ్చివేస్తాడు. యౌవనకాలపు మోహము చాల ప్రబలమైనది. మనపట్టణముయొక్క మధ్య సెట్టివారి నుండనిచ్చుట వల్లనే ఈయనర్థములు సంభవిస్తూ యున్నవి. ఇటువంటి మనోవికారములను కలిగించు దృశ్యములను ఏకాన్తముగా నుంచుటకు బదులు బహిరంగ వీథులయందు వారికి

తావిచ్చి అమాయకులగు బాలుర మనోవృత్తుల చెడగొట్టుటెంత యత్యాచారము. ఈ దురాచారమెట్లు తొలగించుటో? ఏమియు తోచుటలేదు. విషయలోలుర బు పాడుపాల కాలమును డి యీదురా చారము ప్రబలినదని నాయుద్దేశ్యము గ్రంథాలయములు, సంస్థలు, శరశాలయములు అలంకరింప వలసిన స్థలములయందు పెట్టి దురాచా రుల గృహములున్నవి. ఇది దురాచారమునకు ప్రోత్సాహము కాక మరియేమిటి? మనకు తెలిసి తెలిసే మన పిల్లలను, సూతులలో ద్రోయుచున్నాము. అయ్యో! ఎంత విచారకరము?

శర్మ—మీరీ విషయమై ఇదివరకు కొంత యాందోళన సలిపి నారు కదా?

నా—చెప్యేడమేమో చేశాను. కాని మీరు మొదట కొంత సానుభూతి చూపించి తర్వాత యేలాగు తగ్గిపోయారో, అలాగే తక్కినవారు కూడ వెనక్కి తగ్గిపోయారు. నాదగ్గిర ధనంలేదు. విద్య లేదు. నేనేమి గొప్ప ఉద్యోగిని కాను. నామాట వినిపించుకొను వారెవ్వరు? నన్నుజూచి అందరు "వాగుడుకాయలాగు అస్త మానం వాగుతూ ఉంటారు. ఇతనికేమీ పనిలేదు కాబోలు?" అని అనుకుంటారు. ఈపట్నంలో విద్యాంసులు సంపన్నులు అనేకు లున్నారు. వారి వాంసులమే జూచుకుంటు కాలుమీద కాలు వేసికొని హాయిగా కూర్చుంటారు కాని "అయ్యో! యీదురాచారా ముల నెట్లు తొలగించుట?" అన్నమాట వారికక్కరలేదు. నేనెంత చెప్పినా వారికి చీమకుట్టినట్టైనా ఉండదు.

కృష్ణశర్మ నిరుత్సాహ ప్రకృతిగల మనుష్యుడు. ఆయన కార్య రంగమునకు దింపుట కుత్సాహము పుట్టించవలెను. స్నేహితుల యొక్క ఉత్సాహ వాక్యములు సాధారణముగా మనుష్యులను నిద్ర నుండిలేపును. కాని అంతమాత్ర మాయనకు చాలదు. ఆతడు నిద్ర

పోవుటలేదు. మేలుకొనే యుండెను. కాని కదలుటకు బద్ధకము, కనుక గట్టిగా పిలచి లేపనవసరములేదు. నిద్రపోవుచున్న వానికంటె మేలుకొన్నవానిని లేపుటే కష్టము. నిద్రపోవుచున్నవాడు తనపేరు వినబడగానే తులుక్కుపడి లేచును. మేలుకొని ఉన్నవాడు "ఎవరు పిలుచుచున్నారు? వారికి నా అవసరమేమి! నేను లేవనియెడల పని జరుగదా? " అని ఆలోచించుచు వాటికి సంతుష్టికరమైన సమాధానములు తోచిననే లేచును. లేనియెడల ఊరకుండును. శర్మ మేలుకొని యుండు రకములోని వాడు. అనేకపర్యాయములు దేశమాత పిలుపాయన చెవులబడెను. కాని ఆ పిలుపు వినుచున్నను, కార్యాచరణకు దిగలేదు. ఇప్పుడా తని చెవులబడ్డ ఈపిలుపాయనను బలాత్కారముగ కార్యాసక్తుని జేసెను. తన పుత్రసమానునిగ జూచుచున్న తన అన్నకుమారుని చెడుమార్గము నుండి కాపాడుటకును, తన అన్నగారి మనస్సునకు నొప్పి కలుగకుండ చేయుటకును, ఏపని చేయుటకైన నాతడు నిశ్చయించుకొనెను. అనర్థదాయకములైన దురాచారములను వ్రేళ్ళతో పెల్లగించదలచిన వారికి వట్టిప్రమాణములతో నవసరములేదు.

శర్మ—మీరేపనిని జేయమన్నను చేయుటకు సిద్ధముగా నున్నాను.

నారా—(సంతోషముతో శర్మను కౌగలించుకొని) సోదరా! మీరు నాకు సహాయపడిన యెడల నేను భూమిని ఆకాశమునుగూడ నేకము చేయగలను. కాని నేనొక్కమాట చెప్పెదను. క్షమించండి. మీరు నిలుకడలేని మనుష్యులు. ఇప్పుడీ విధముగా జెప్పి రేపు పశ్చాత్తాపపడుతారు. ఇటువంటి విషయములలో చాలపట్టుదలగాను ధైర్యముగాను ఉండవలెను.

శర్మ—(సిగ్గుపడుచు) దేవుని దయయుంటే, ఇక మీకీవిధముగా నిరుత్సాహపడ నవసరములేదు.

నారా—అయితే మనకార్యము సాఫల్యమొందుట నిశ్చయము.

శర్మ—అది దైవముచేతిలో నున్నది. నా కుపన్యాసము లిచ్చుట గాని, వ్యాసములు వ్రాయుటగాని చేతగాదు. మీరే త్రోవను నడుస్తే ఆ త్రోవను కళ్లుమూసుకొని మీతో నడుస్తాను.

నారా—ఒక్క ఉత్సాహమున్న యెడల తక్కినవి వాటంతటవే వస్తాయి. దృఢసంకల్పము గాలిలో సహితము కోటలను కట్టగలదు. వినువారు ముగ్ధులగు నంతటి ప్రభావము మీ వాగ్ధోరణియందు కలుగును. కాని మనస్సును మాత్రము చలింపనీయకూడదు.

శర్మ—మధ్య మధ్య మీరే కదలిక పుట్టించుచుండవలెను.

నారా—సరే, ఇప్పుడు నా యభిప్రాయం వినండి. మొదటిది, వేశ్యలను సంసారుల మధ్యనుండి తొలగించుట. వారి నాటపాటలకు పిలచు దురాచారమును తొలగించుట. నా యభిప్రాయములతో మీరేకీభవించెదరా ?

శర్మ—ఇంకా సందేహమేనా ?

నారా—వారి నాటపాటలకు పిలువకుండు విషయముతో సంకా మీ కేమీ యనుమానము లేదుకదా ?

శర్మ—ఒకసంసారమును కూలద్రోసి యింకా ఆట సరదాకూడానా? ఆ రోజులలో నా కెందు కటువంటి సరదా పుట్టినదో, ఆ పాట కచ్చేరీయే కమలాబాయి యింటినుండి లేచిపోవుటకు కారణమైనదని నా కిప్పుడు బాగా బోధపడినది. కాని యొక సందేహము మాత్రము నన్ను బాధించు చున్నది. మన మందరముకూడ పట్టణవాసము చేయుచున్నను యెందుకు చెడుయలవాటులలో చిక్కుకొనలేదు ? పట్టణములో గానసభలు జరుగుచున్నను నీవిధముగా చెడిపోవుటయరుదే! దీనివల్ల మనుష్యస్వభావమే ముఖ్యకారణమని నాకు తోచుచున్నది. ఈ యాందోళనచేసి మనము మనుష్యస్వభావమును మార్చగలమా ?

నారా—దుర్బలస్వభావులను రక్షించుటకే మన ప్రయత్నముగాని మరియొకటి కాదు. కొందరు పుట్టుకతోనే బలముగా నుందురు. అందువలన వారికి విశేషబలమైన వస్తువులావశ్యకముండవు. కొందరు నీరసముగా నుండి నెయ్యి పాలతో బలవంతులగుదురు. కొందరెన్ని పాలుత్రాగినను, ఎంతవెన్న తిన్నను నీరసముగానే యుందురు. మన ప్రయత్నము కేవలము రెండవ రకవు మనుష్యులకొరకే. సంసారతాపత్రయములలో కొట్టుకొనుచు పొట్టకూటికి తంటాలు పడుచున్నటువంటియు, ప్రేమకును, రసికతకును భేదము తెలిసికొనునట్టియు వారిటువంటి చెడుమార్గములలో నెందుకు పడుదురు ? కేవలము ధనమదాంధులు, రూపవంతులు రసికులు మాత్రమే యీ వలలో జిక్కుకొందురు. దేవుడు స్త్రీలకు సౌందర్యము నిచ్చి ధనలోపము లేకుండ జేయుగాక ! ధనహీనులును సౌందర్యవంతులును దుర్బలమనస్కులును అగు స్త్రీలపైనే యిట్టి దుష్టుల మాయా తంత్రములు త్వరగా పని చేయును.

కమల పార్కునుండి యింటికి వచ్చినదగ్గరనుండియు తాను కృష్ణశర్మ నెందు కటువంటి బాధించు మాటలనంటినా ! యని విచారింప సాగెను. "శర్మగారంత యుదారముతో సహాయము చేయబూనుకొనగా ఆయనకు నేను చేయు ప్రతీకారమిదియా ? నా మనోదౌర్బల్యము వలన జేసిన యపరాధములను నిష్కారణముగ నాయనపై నారోపించి పాపము కట్టుకొన్నాను. ప్రపంచములో ప్రతిగృహమందును సాధారణముగా పాటకచ్చేరీలు జరుగుచునే యున్నవి. పెద్దవారు, పిన్నవారు, దుఃఖితులు, దరిద్రులు వారు వీరననేల ? అందరును జూచి, విని యానందించుచునే యున్నారు. నేను నా చపలత వలన విప్లవములో దూకిన అందు శర్మగారియొక్క గాని తదితరులయొక్క గాని దోషమేమున్నది ? దాసుగారు పట్టణమందలి పెద్దమనుష్యుల

నందరిని జూచిరి. ఇక్కడకు వచ్చు సెట్టిగార్లవద్ద కాయన వెళ్ళెనో లేదో? కాని యొక్కరును ఆయనకు సహాయము చేసినట్లు కనవడదు. ఎందువలననో? బహుశః ఈ నరకకూపమునుండి నేను విడుదలగుట వారి కిష్టము లేక కాబోలు. వారు క్రూరవ్యాఘ్రములవలె నా మనస్సును గాయపరచి, నేను బాధతో కొట్టుకొనుచుండగా జూచి యానందించుటకు కోరుచున్నారు కాబోలు. కేవల మొక్క మహాపురుషుడు మాత్రమే నన్ను నరకకూపమునుండి ఉద్ధరించుటకు చెయ్యిచాపినాడు. ఆయనను నేనే ఇట్లవమానపరచితిని. ఆయన తన మనస్సునందు నన్నెంత కృతఘ్నురాలినిగ భావించెనో! నన్ను జూడగానే ఆయన ఎట్లు తప్పించుకొనుటకు ప్రయత్నించెను! నేనప్పుడక్కడ సిగ్గుచే కొయ్యబారవలసినదే! కాని నా పాప నిందల తప్పించుకొనుట కట్లు తిరస్కరించితిని. దుష్టత్వముతో నా జీవితమును నాశనము చేయజూచువారిని నేనెట్లాదరించుచున్నాను? పక్షి తన వలలో పడనప్పుడు బోయవానికి దానిపై నెంతకోపము వచ్చును? కుక్కవాడేదైన నంటరాని వస్తువు నంటుకొని దానిని తక్కిన స్నేహితులకు కూడ నంటించి వారినికూడ నపవిత్రుల చేయుటకు జూచును. నేను హృదయశూన్యుడగు బోయవాడి వంటిదాననా? లేక బోధ బాలకుని వంటిదాననా?"

ఏ గ్రంథకర్తయైనను నిష్పక్షపాతబుద్ధితో, విమర్శించిన కఠినవిమర్శన వాక్యములకంటె ఆలోచించలేని పొగడ్తలను మూలముగా తలచునా? కమలకూడ నట్లే రసికులయొక్క ప్రేమకంటె శర్మయొక్క తిరస్కారమునే యమూల్యముగ దలచెను.

రాత్రి యంతయు కమల యిట్టి యాలోచనలలో మునిగి తేలుచుండెను. తెల్లవారగానే దాసువద్దకువెళ్లి, అయనతో "నా కేదైనను తలదాచుకొనుట కొక చిన్న యిల్లేర్పాటుచేసిన చాలును. సురక్షిత

మైన స్థలము. తదితర సహాయము మేమియు నేను కోరను. పిండి విసరి కాని బట్టలు కుట్టిగాని నా జీవితమును గడుపుకొందును!" అని చెప్పుటకు ఆమె నిశ్చయపరచుకొనెను.

ఇంతలో తెల్లవారినది. ఆమె లేచి నారాయణదా సింటికి వెళ్ళుటకు తయారగుచుండగా నింతలో నాయనయే స్వయముగా నక్కడకు వచ్చెను. భక్తునకు దైవము ప్రత్యక్షమైనంత సంతోష మప్పుడామెకు కలిగెను.

కమ—బాబుగారు! దయచెయ్యండి. నిన్ననంతా మీకొరకే యెదురుచూచుచుంటిని. ఇప్పుడు తమ దర్శనమునకు వచ్చుటకే సిద్ధపడుచున్నాను. ఇంతలో తమరే దయచేశారు.

నారా—అనేక కారణములవలన నేను నిన్న రాలేకపోయినాను.

కమ—అయితే నాకొరకేదైన నేర్పాటు చేయించారా?

నారా—నే నేమియు చేయలేకపోతిని కాని శర్మగారే పరువు నిలబెట్టినారు. వారే నిన్నుద్ధరించుటకు పూనుకొన్నారు. ఇప్పుడే ఆయన మాయింటికి వచ్చి నీకు నెల కేబదిరూపాయల నిచ్చెదమని ఖరారుచేసి వెళ్ళినారు.

ఈమాటలు వినగానే కమల కండ్లు నీటితో నిండిపోయెను. శర్మ యొక్క యౌదార్య మామె మనస్సును భక్తిశ్రద్ధలతో నింపివేసెను. కమల తన కఠినవాక్యములను తలచి క్షోభపడుచు, "శర్మగారు దయాధర్మసాగరులు. నే నీ జన్మమున ఆయన ఋణము దీర్చుకొనలేను. దైవ మాయనను రక్షించుగాక. నే నప్పు డన్నమాట లన్నియు పరీక్షార్థమే యంటిని. మీరు నన్నుద్ధరించుటకే యనుచున్నారో లేక హేళన జేయుటకే యిట్లనుచున్నారో దయచేసి చెప్పండి. మీ రిద్దరు నిజముగా దైవస్వరూపులని నే నిప్పుడు తెలిసికొనగలిగితిని. మీకు వృథాగా శ్రమ నిచ్చుటకు నా కిష్టములేదు. నేను కోరుచున్న

సానుభూతి దొరకినది. అదియే చాలు. నా జీవితభార మిక తమపై వేయజాలను. నే నుండుటకు తగిన స్థలము మాత్ర మేర్పాటు చేయించండి."

ఈమాటలు విని నారాయణదాసు విస్మితు డయ్యెను. జాతీయ గౌరవమును తలచి, ఆతడు గర్వపడుచు మన దేశములోని పతిత స్త్రీల యందు కూడ నిటువంటి గొప్ప యుద్దేశములు కలవని ఆనందించెను.

నారా— కమలాబాయి! నీనోటినుండి ఇటువంటి పవిత్రవాక్యములను వినుటవలన నాకు కలిగిన ఆనందమును చెప్పజాలను. కాని డబ్బు లేకుండ నీవెట్లు నిర్వహించుకొనగలవు?

కమ—నేను కష్టపడి జీవించెదను. దేశమునందు లక్షలకొలది దరిద్రు లున్నారు. వారి కందరకు ఎవరు సాయపడుచున్నారు? దీనులకు దైవమేదిక్కు. నా చెడునడతకు తగిన ఫలము నేనే యనుభవించెదను.

నారా—నీ వట్టి కష్టములను సహించగలవా?

కమ—మొదట సహింపలేకపోతిని, కాని యిప్పుడు సహింపగలను. ఇక్కడకు వచ్చిన తర్వాత అన్నికష్టములకన్న ఈసిగ్గుమాలిన తనమే దుస్సహముగా నున్నది. ఇతరకష్టములు శరీరమును మాత్రమే శ్రమపెట్టును. కాని యీ కష్టము నన్నునే తినివేయుచున్నది. నన్ను రక్షించుటకొరకు మిమ్ములను పంపినందులకు దైవమున కనేక వందనములు చేయుచున్నాను.

నారా—కమలమ్మా! నీవు నిజముగా విదుషీమణివే.

కమ—ఐతే, నే నిక్కడినుండి ఎప్పుడు బయలుదేరడం?

నారా—ఈరోజునే. ఆశ్రమ సభ్యులకు తెలియజేయునప్పటికి వరవాలేదు. నీవక్కడ నుండవచ్చును. సభ్యు లాటంకపరచి నప్పుడు చూచుకొనెదము. కాని ఒక్కటిమాత్రము జ్ఞాపకముంచుకో. నీసం

వఫాసాహేబు వచ్చేను. అతనికి సిగరెట్లన్న చాలాప్రీతి. కనుక ఈ రోజున మామూలు ప్రకారముగ కాక సంతోషముతో మాట్లాడుచు, "సాహేబుగారు ! దయచెయ్యండి. ఈ రోజున మీకొరకు నుంచి సిగరెట్లను తెప్పించినాను.

అ. వ—ఏహావ్వా, బడాసంతోష.

కమ—మీకొరకు ప్రయత్నించి ఇంగ్లీషు షాపులనుండి మొదటి రకం తెప్పించాను. పుచ్చుకోండి.

అ. వ—బెడీకుసీ ఐం.

ఇట్లనుచు అతడు సిగరెట్టును నోటిలో పెట్టుకొనిన తోడనే కమల అగ్గిపెట్టెను దీసి పుల్ల వెలిగించెను. అతడు సిగరెట్టును కాల్చుటకు ముందునకు వంగగనే సిగరెట్టు అంటుకొనుటకు బదులు గెడ్డమెట్లో అంటుకొని, దూదివలె నొక్క నిముషములో గెడ్డము సగము కన్న ఎక్కువగా కాలిపోయెను. అతడు సిగరెట్టును పారవేసి రెండుచేతులతో గెడ్డమును నలుపుచు దగ్గరనున్న అద్దములో ముఖమును జూచుకొని విచారించసాగెను. కమల సిగ్గుతో, నావలన మీగెడ్డము కాలిపోయినది. నేనజాగ్రత్తగానే అగ్గిపుల్లను అంటించాను.

ఆమె ఎంత ఆపుకొన్నను నవ్వాగినది కాదు. అతిదీనముగా వఫాసాహేబామె నవ్వును జూచి, "ఎంతపని చేశావురే భయ్"

కమ—నేను రెండుచేతుల్లను మొట్టుకొని చెప్పుతాను. నేనంటి చవలెననే అంటించానను కొన్నారా? ఒక వేళ నాకు మీ మీద కోపమున్నా నన్ను మీ గడ్డమేమి చేసింది కాల్చుటకు?

అ. వ—నీ కీతమాసా, ససమ్ బలే బొగుంది. బడా అచ్ఛా. నాకీ ముఖంతో పైకి ఎట్లాపోవాల?

కమ—నాకూ చాలావిచారంగానే ఉంది. ఐతే ఏం చేసేది? బజారులో మాయగెడ్డాలు దొరుకుతాయి కాబోలు.

అ-వ—కమలాబాయి! ఎందుకు మాకీ అషమ్‌చేస్తావ్? కోరీ లోగ్ ఐతే వార్‌కి ఖూసీ కండ్లచూస్తాం.

కమ—ఓహో ఈ పాటిదానికేనా ఇంత అల్లర! రెండురోజులకు తిరిగి అదే పెరుగుతుంది. ఇంత చిన్నదానికింత బ్రహ్మాండమా?

అ-వ—కమలాబాయి! జలావోమత్. నాకీ నోరు అచ్ఛానహి. ఇప్పుడు నాది వొల్లు ఆఫ్ మెనంహి.

కమ—నారాయణ. నారాయణ. ఈ గడ్డం కొరకేనా ఇంత అల్లర? నిజంగా నేనే మీ గడ్డం కాల్చేశాననుకోండి. ఐతే మీరు నాఆత్మను, నాధర్మమును, నా హృదయమును ప్రతిదినము మంటబెట్టుచున్నారే. దానికంటె మీగడ్డమే మూల్యమైనదా? గడ్డము వలన ముఖానికి అందంరాదు. ఇక మీ ఇంటిదారి పట్టండి. ఇక ఇప్పుడు యీ వైపుకు రాకండి. మీ వంటి నీచుల సంపర్కమికనా కక్కరలేదు.

అబ్దుల్ వఫా కమలవైపు కోపముతో జూచుచు జేబునుండి రుమాలును దీసి గడ్డమును కప్పుకొని అక్కడనుండి వెళ్ళిపోయెను. అప్పుడు మోహనుడు వచ్చుసమయ మయ్యెను. కమల ఆతనిని కలుసుకొనుట కాతృతతో ఎదురు జూచుచుండెను. ఇదియే వారి చివరిసమావేశము. ఈ రోజుతో వారి ప్రేమ అంత మొందును. ఆ మోహనమూర్తిని జూచుటకిక అవకాశము జిక్కదు. ఆ ప్రేమవాక్యము లిక విన్పబడవు. జీవనము, ప్రేమశూన్యమై నప్పుడు విరక్తిని జెందును. “భగవానుడా! ఈ నిజమైన ప్రేమయొక్క వియోగమును సహించుటకు నాకు శక్తినిమ్ము. కలుషితమైనను నిది నిజమైన ప్రేమ. కాదుకాదు. మోహనుడు రాకపోవుటయే మంచిది. ఇప్పుడతనిని కలుసుకొనక పోవుటయే యుత్తమము. ఆతని ముందు నా సంకల్పము స్థిరముగ నుండు నో ఉండదో! ...

మొదల నా మనస్సును విప్పి అన్ని సంగతులను, జెప్పి, ఆతడీ పాప కూపమున బడకుండ రక్షించెదను.” అని కమల తనలో నాలోచించుచుండెను.

ఇంతలో నారాయణదాసు బండినుండి దిగుట ఆమె జూచెను. అప్పు డామెగుండెలు దడదడ కొట్టుకొనసాగెను. క్షణములో అతడు మేడపైకి వచ్చి కమలతో,“సిద్ధముగా లేవా?

కమ—నేను సిద్ధముగానే ఉన్నాను

నారా—ఇంకా పరుపేనా కట్టినట్టు లేదే.

కమ—ఇక్కడ వస్తువు లెక్కటైనను తీసికొని వెళ్లుట నా కిష్టము లేదు. నిజముగ నేను పునర్జన్మ మెత్తుచున్నాను.

నారా—ఐతే. సామానంతా ఏమి చేస్తావు?

కమ—మీారీ సామానంతా అమ్మించి ఏదైన నొక ధర్మకార్యమునకు వినియోగించిన సంతోషించెదను.

నారా—సరే, బాగానే ఉన్నది. ఐతే ఇంటికి తాళం వేస్తాను. ఇక బయలుదేరు. వీధిలో బండి సిద్ధముగా నున్నది.

కమ—పదిగంటలు కొట్టనిదే నేను బయలుదేరలేను. నా స్నేహితులవద్ద సెలవు పుచ్చుకొనవలెను. కొన్ని సంగతులు వారికి జెప్పి వారివద్ద కొన్ని సంగతులు విననలసి యున్నవి. అప్పటివరకు తమరు డాబాపై విశ్రమించండి. నేను సిద్ధముగా నున్నట్టే.

నారాయణదాసున కిదియంతయు ననహ్యముగా దోచెను. కాని ఏమియు ననలేక డాబాపైకి వెళ్ళి పచారు చేయుచుండెను.

పదుగంటలైనను మోహనుడు రాలేదు. ఎనిమిదివరకు కమల, అతని కొరకు నిరీక్షించి, చివరకు నిరాశురాలయ్యెను. మోహనుడక్కడకు వచ్చుట ప్రారంభించినది మొదలు ఒక్కనాడైననువచ్చుట మానలేదు. అతని కేదైన నాపద రాలేదు కదా? యని ఆమెవిచా

కమ—ఇంకొక్కపని యుండిపోయింది. పండిత సూరిశాస్త్రిగారు వేస్తూయుంటారు. ఆయనతోటే ఇక్కడపని పూర్తిఐపోతుంది. ఇం కొక్క నిముషము శ్రమపడండి.

నారాయణదాసు తిరిగి డాబాపైకి వెళ్ళగానే సూరిశాస్త్రి వచ్చెను. తలపైని ఒనారనుపాగా, ఆల్పాకాకోటు, పైన పట్టంచుల జరీవాణి, నల్లంచు సన్నపంచె ఆతని ఎత్తునివంటికి వన్నె తెచ్చు చుండెను.

కమ—శాస్త్రిగారు! దయచెయ్యండి. నమస్కారము

శాస్త్రి—దీర్ఘాయుష్యమస్తు, మాఅందరి కనులపండువగా నీవు ఎల్లప్పుడు నవయువ్వనురాలవై వర్ధిల్లవలె.

కమ—తమరు నిన్న నెందుకు దయచెయ్యలేదు? నభికులందర తోను మీకొఱకు చాలరాత్రివరకు కనిపెట్టుకొని ఉన్నాను.

శాస్త్రి—అసంగతడగకు. అనవసరపు గొడవలలో చిక్కుకున్నాను. డాక్టర్ శ్యామలరావు, ప్రభాకరరావు నన్ను స్వరాజ్యసభ కీడ్చుకొని పోయారు. అక్కడ వకటే ఉపన్యాసాలు. ఎవరినోటికి వచ్చినట్లు వారు వాగారు. నన్నుకూడా చెప్పమని పట్టుకున్నారు. కాని మెల్లగా యేలాగో తప్పించుకొని వచ్చేసరికి, చాలా రాత్రి ఐపోయింది. అందు చేతే రాలేకపోయాను.

కమ—ఎన్నిరోజులనుండో తలుపులకు వార్నీసు వేసిపెట్టమని మిమ్మల్ని బ్రతిమాలుకుంటున్నాను. కాని ఎక్కడా మంచివార్నీసు దొరకడంలేదని, జరుపులు పెట్టుతున్నారు. ఇదిగో చూడండి. నేను వార్నీసుసీసా తెప్పించాను. రేపు తప్పకుంటా వార్నీసు వేసిపెట్టాలి.

శాస్త్రి ఠీవిగా కుర్చీపై కూర్చుండెను. సరిగా వార్నీసుసీసా పెట్టిన ఖల్లక్రిందే కుర్చీయుండెను. కమల ఆతనికి చూపించుటకు సీసా తియ్యబోవుచుండగా చెయ్యిజారి సీసా పడిపోయెను. శాస్త్రి స్నానముచేసి

నట్లు ఆతని నంటిసిండా వార్నీసు ఒలికిపోయెను. శాస్త్రి తులుక్కుపడి లేచి, రుమాలుతో ముఖమును తుడుచుకొనసాగెను.

కమ—సీసా అలా ఎందుకు చెయిజారిపోయినదో. వార్నీసంతా నిష్కారణంగా వలికిపోయింది.

శాస్త్రి—నువ్వు వార్నీసుకోసం విచారిస్తున్నావు. చూడు! నిష్కారణంగా నా ఖరీదుగల బట్ట లేలాగున పాడైపోయినాయో? పిల్లిలో ఇంటి కేలాగు పోను?

కమ—రాత్రి మిమ్మలిని చూచేవా ళ్ళెవరు? గుప్‌చుప్‌గా వెళ్లి పోండి.

శాస్త్రి—ఊరుకో. ఇంకా మాట్లాడుతున్నావు. నిష్కారణం బట్టలన్నీ పాడుచేసి ఉపాయం చెప్పొచ్చావు. ఇక నీ బట్టలు దమ్మిడీ కేనా పనికిరావు.

కమ—ఐతే నేను వలకపొయ్యాలనే వలకపోశాననుకుంటున్నారా ఏమిటి?

శాస్త్రి—ఏమో. నీ మనస్సులో ఉన్న వుద్దేశ్య మేమిటో నా కేం తెలుసును.

కమ—సరే. నే నెరుగుండే పోశాను. ఇక దయచెయ్యండి.

శాస్త్రి—అయ్యో! నే నాలాగ అనలేదు. నీ కింకా పొయ్యాలని ఉంటే పొయ్యి.

కమ—పాపం మీ బట్టలు పాడైపోయాయికాబోలు? వాటి ఖరీదు ఇచ్చేస్తానులెండి.

శాస్త్రి—అయ్యో సర్కారువారికి నామీద ఎందుకింతకోపం? వార్నీసు నామీద పొయ్యడమే నాకు సంతోషమంటున్నాకదూ?

కమ—నాతో హాస్య మాడుతున్నారా?

శాస్త్రి—కమలాబాయి! నన్నెందుకు సిగ్గుపరుస్తావు?

కమ—ఒక్క పిసరు బట్టలు పాడై పోగానే ఇదనుకు నాకు మీరు చూపించుతూఉన్న ప్రేమంతా తెలిసిపోయింది. మీరు నాకు బాగా బుద్ధి చెప్పారు. ఇటువంటి కృత్రిమప్రేమతో నాకు సంబంధ లేదు. ఇక నింటికి దయచెయ్యండి. మీధర్మమూఅంటూ నాకళ్లువిడ్డాయి.

పైనుండి ఈ తమాషాయంతయూ జూచుచున్న దాసు జట్టీ ముగిసినదని తెలసి క్రిందకు వచ్చెను. అతనిని జూచి శాస్త్రి తెల్ల పోయి తలవంచుకొని త్వరగా క్రిందకు వెళ్లి పోయెను. కొంతసేపునకు కమల క్రిందకు వచ్చెను. ఆమె ఒక తెల్లని బట్టను నార్లు మే కట్టు కొని యుండెను. చేతుల గాజులను సహితము తీసివేసెను. ఆమె ముఖము విచారముగా నుండెను. భోగవిలాసములను విడిచిపెట్టు చున్నాను కదాయని కాదు. "ఎందుకీ నరకకూపమున పడిపోతిని" అని యామె విచారము. ఈ విచారమునందు మాలిన్యములేదు. ఒక విధమైన ప్రకాశము వెలువడుచుండెను. ఇది మదిరను సేవించు వాని ముఖమునందు గల విచారముకాదు. దానియందు త్యాగ విచారములు సమ్మిళితములగుచుండెను. నారాయణదాసు ఇంటికి తాళమువేసి, తానుపోయి కోచిమేన్ ప్రక్కను కూర్చుండి, బండి తోలుట కాజ్ఞాపించెను. బజారునందలి దుకాణములన్నియు మూసి వేయబడెను. కాని ఇంకను మనుష్యులు తిరుగుచుండిరి. కమల యొకసారి బండినుండి తొంగిచూచెను. ఆమెకు దీపములన్నియు సుందరమైన మాలగా కనబడుచుండెను. మనుష్యుల కోరికలవలె ఆ దీపములు దగ్గరగా నున్నట్లేయుండి బండి పోవుచున్న కొలదియు దూరమగుచుండెను. కమలయొక్క భావిజీవనయానము, విచారసాగరములో వేగముగా కొట్టుకొనుచు, నక్షత్రముల సహాయమున దారి చూచుకొనుచు పోవుచుండెను.

## ౨౬

మోహనుడు ప్రొద్దుటనే ఇంటిలోనికి వెళ్ళగనే తన పినతల్లి మెడలో వాచీగొలుసు అగుపడెను. దానిని చూచినతోడనె సిగ్గుచేతను, భయముచేతను అతని ముఖము వెలవెలబారెను. అతడు వేగముగా కాఫీ త్రాగి తన గదిలోనికివెళ్ళి, ఆ గొలుసు తిరిగీ ఈమె కెట్లు వచ్చినదాయని ఆలోచింపసాగెను. "కమలయే, దీని నిక్కడకు పంపి యుండునా? ఈ గొలు సెవరిదో ఆమె కెట్లు తెలియును? నే నెక్కడ నుంటినో ఆసంగతికూడ నామెకు చెప్పలేదే! ఇది ఆ మోస్తరుదే మరియొక గొలుసేమో! కాని పిన్ని ఇంత వేగ మెట్లు క్రొత్త నగను చేయించుకొనగలదు? కమలయే నాయిల్లు తెలిసి కొని పిన్నివద్దకే గొలుసు పంపియుండును" అని ఊహించుకొను చుండెను.

మోహనుని మనస్సు పరిపరి విధముల పోవుచుండెను. కమలయే ఈగొలుసు నిక్కడకు పంపియుండునని నిశ్చయించుకొని, "నేనంత ప్రేమతో ఇచ్చిన వస్తువును ఇట్లు తిరుగగొట్టుట ఆమెకు న్యాయమునా? ఎంత విశ్వాసఘాతుకము? ఆమె నన్ను ధూర్తునిగను మోసగానిగను తలచినది కాబోలు?"

ఆ రోజున కమల ఎదుట పడుట కాతడు సాహసింపలేకపోయెను. చోరుడు దగాకోరునై ఆతడు కమలవద్ద కెట్లు పోగలడు? పాపమా రోజున అతని మనస్సు అతి వ్యాకులముగ నుండెను. ఇంటివద్ద కూర్చొనుట మరింత కష్టముగా నున్నను, ఈ కష్ట మెట్లో సహించుచుండెను గాని కమలవద్దకు మాత్రము వెళ్ళలేకపోయెను.

ఈ విధముగ నొక వారము దినములు గడచెను. కమలను కలుసుకొనుట కాతని మనస్సు ఆవేగపడుచుండెను. గాని ఈ అనుమానము

లన్నియు అతనిని కదలకుండ నష్టపెట్టుచుండెను సాయంత్రము కాగానే మోహను డున్మత్తునివలె నగుచుండెను. జబ్బుపడినవా రతరులతో మాటలాడుటకుగాని, లేచి కూర్చొనుటకు గాని, శక్తిలేక ఎట్లు చికాకుపడుచుందురో ఆవిధముగనే మోహనుడు మాటిమాటికి చికాకుపడుచుండెను.

చివర కాతడు నిలువలేక గుఱ్ఱముమీద నెక్కి కమల యింటి వైపు బయలుదేరెను! అత డీరోజున తన సంగతినంతయు కమలతో చెప్పివేయుటకు నిశ్చయించుకొనెను. "మనసార ప్రేమించిన యువతి వద్ద, నాసంగతి దాచు టెట్లు? చేతులు జోడించి, "సర్కార్! నేను మంచివాడనైనను, పెద్దవాడనైనను మీ సేవకుడనేకదా. దొంగతనము జేసితిని. దగా చేసితిని. ఏమిచేసిననూ నీప్రేమకొరకే. నీ ఇష్టమువచ్చిన శిక్ష విధించి నన్ను క్షమించు" అని కాళ్ళపై బడెదను."

మోహము నీతిని, జ్ఞానమును, సంకోచమును, దేనినికూడ లక్ష్యపెట్టదు. ఆ మదమునందు మనుష్యునికి చైతన్యముండదు.

మోహనుడు వ్యాకుల పడుచు తిరిగి, తిరిగి, ఐదుగంటలు కొట్టు సరికి నదియొడ్డునకు వచ్చి చేరెను. మండుచున్న అతని దేహమునకు ఆశీతలవాయువు కొంత హాయినిచ్చెను. నిర్మల శ్యామలోదకము నుండి ఉండుండి ఎగురు చిరుచేపలు, సన్నని తెరలోనుండి జూచు సుందరయువతియొక్క చంచల నయనములవలె ప్రకాశించు చుండెను. మోహనుడు గుఱ్ఱమునుదిగి ఈ మనోహర దృశ్యమును జూచుట యందు మగ్నుడయ్యెను. ఇంతలో నకస్మాత్తుగా చెట్లవైపునుండి జటాధారియగు నొక యోగి తన వైపునకు వచ్చుచుండుట నాతడు జూచెను. అతని మెడయందు రుద్రాక్షమాలలు వ్రేలాడుచుండెను. ముఖమునందు జ్ఞానయోగములకు బదులు, దయాశాంతములు ప్రక

క్షేత్రము లోనికి గుచుండెను. యోగి తనవద్దకు వచ్చుచుండుటను జూచి మోహనుడు లేచి, అతనికి నమస్కరించెను.

ఆ యోగి పూర్వ పరిచితునివలె మోహనుని చెయ్యిపట్టుకొని, "మోహనా! నేను నిన్ను కలుసుకొనుటకై చాల దినములనుండి ప్రయత్నించుచున్నాను. నీకు హితముగా కొన్ని మాటలను జెప్ప దలచితిని. నీవు కమలాబాయియొద్దకు వెళ్ళుట మానుకొనుము. లేనియెడల నీజీవితము సర్వనాశన మైపోవును. ఆమె ఎవ్వరో నీవెరుగవు. మోహాంధత వలన నీవామె చెడుగులను కనిపెట్టజాలకున్నావు. ఆమె నిజముగ నిన్ను ప్రేమించుచున్నదని తలచుచున్నావు కాబోలు! అది వట్టి పొరబాటు. తన పతిని విడచిన యువతి ఇతరుని మాత్రము ప్రేమింపగలదా? నీవిప్పుడక్కడకే వెళ్లుచున్నావు. ఈ సాధువుయొక్క వాక్యములను విని ఇంటికి మరలిపొమ్ము. దీనివలన నీకు కళ్యాణమగును."

ఇట్లు చెప్పి, మోహను డేదో మాటలాడబోవుచుండగా ఆతడేవైపునుండి వచ్చెనో ఆవైపునే అదృశ్యుడయ్యెను.

మోహనుడు తనలో, "నీమహాత్ము డెవ్వరో కదా? ఈతడు నన్నెరుగును కాబోలు? నారహస్యవర్తనమంతయు నీతడెట్లు కనిపెట్టగలిగెనో" యని ఆశ్చర్యపడుచుండెను. ఆనదీదృశ్యము, తనస్థితి, మహాత్ముని ఆకస్మికాగమనము, అతని దివ్యదృష్టి, అన్నియుకలసి, మోహనునకు ఆసాధు వాక్యములు ఆకాశవాణి దివ్యవాక్యములవలె తోచెను. అతని మనస్సునందు తనకేదైనను అమంగళము కలుగునేమోయను శంకకలిగెను. కమలవద్దకు వెళ్ళుటకు మరి సాహసించలేక, అప్పుడు జరిగిన ఆశ్చర్యఘటనలను తలచుకొనుచు, నింటివైపు మరలిపోయెను.

సుభద్రమ్మ తన గొలుసు విషయమై మోహనునిపై అనుమానపడినప్పటినుండియు కొన్ని కామెపై కోపముగా నుండెను. అందు

వలన ఆమె మనస్సేమియు స్థిమితముగా లేకుండెను. ఈ చికాకుల వలన మోహానునెట్లైన నింటికి పంపివేయవలెనని శర్మ ఆలోచించుచుండెను. ఇప్పుడు మోహానునికిగూడ నిక్కడ నుండుట కష్టముగానే యుండెను. ఎట్లైనను ఇంటికి పోవలెననియే అతడుకూడ తలచుచుండెను. కాని యొకరును నీవిషయమై, మనస్సువిప్పి పైకనలేకుండిరి. ఆ మరునాడే గోపాలశాస్త్రివద్దనుండి యుత్తరమువచ్చి అందరి కోర్కెలను దీర్చివేసెను. ఆ యుత్తరమునందు, మోహానునిపెండ్లి మాటలగుచున్నవనియు, మరకలితో మోహానుని తక్షణమే పంపవలసినదనియు, అని ఉండెను. ఈ సంగతిని విని ఒకటి, రెండు నెలలు తమ గ్రామమునందు సరదాగా కాలము గడపవచ్చునని సుభద్రమ్మ చాల సంతోషించెను. కృష్ణశర్మకు మాత్ర మామె నన్ని దినములు వదలియుండుట కిష్టములేకుండెను. ఆమె సంతోషమును జూచి అతడు తనలో "తన సరదాలేకాని నా ధ్యాసమేలేదు. నేనిన్ని దినము లిబ్బందిపడుచు ఒంటరిగా నుండునను తలపేలేక ఎంత నిర్విచారముగా నున్నది?" అని చికాకుపడుచుండెను.

మోహానుడు ప్రయాణసన్నాహములో నుండెను. అతడు వెళ్ళనని పట్టుపట్టునని శర్మ తలచెనుగాని అట్లు జరుగలేదు.

అప్పుడు ప్రొద్దుట ఎనిమిది గంటలయ్యెను. మధ్యాహ్నము రెండు గంటలకే రైలువేళ అగుటవలన కృష్ణశర్మ కచ్చేరికి వెళ్లుట మానివేసెను. ఎన్నిసార్లో సుభద్రమ్మతో సంతోషముగా మాట్లాడవలెనని అతడు లోపలకు వెళ్ళెనుగాని అతనితో మాట్లాడుటకు సుభద్రమ్మకు తీరుబడి యెక్కడ? ఆమె నగలు బట్టలు సద్దుకొనుచు, పరుపులు కట్టించుచు, మరచెంబులు తోమించుచు అతి సందడిగా నుండెను. ఇరుగుపొరుగు స్త్రీలామెను జూచుటకు వచ్చిరి. ఆ అడావడిలో సుభద్రమ్మ తిన్నగా భోజనమైనను చేయలేదు. మోహానునకు, శర్మకు

ఫలహారము క్షేత్రగరులోనికే పంపివేసెను. అప్పుడే వంటిగంటయ్యెను. వెంకటస్వామి కాఫీను తెప్పించి వాకిట్లో సిద్ధముగా నుంచెను. మోహానుడు తనట్రంకును సంచును బండిలో పెట్టించెను. అప్పుడు సుభద్రమ్మకు శర్మనూరాట జ్ఞాపకమునకు వచ్చెను. అతని నొకసారి పిలువమని నౌఖరును బంపి ఆమె మేడమీదను, దిగువనుకూడ నాతనికొరకు వెదకెను. కాని ఎక్కడను అతడు కనబడలేదు. ఆమె చికాకు పడుచు ఆయన రానిదే నేనెట్లు బయలుదేరుదునని పట్టుబట్టి కూర్చుండెను. శర్మ ఎచటను ఎక్కడకును వెళ్ళలేదు. డాబాపైనే యుండెను. వంటిగంటయైనను సుభద్రమ్మ యీవలకు రాకుండుటను జూచి శర్మ చికాకుపడుచు డాబాదిగి వచ్చి సుభద్రమ్మతో, “ఇంకా ఏంచేస్తున్నావు? వంటిగంట దాటిపోయింది” అని కోపపడెను. బయలుదేరు సమయమందు శర్మ చికాకుపడుట జూచి సుభద్రమ్మకు కండ్లనీరు గిఱ్ఱున తిరిగెను. కృష్ణశర్మ తన కాఠిన్యమునకు పశ్చాత్తాపపడుచు, ప్రేమతో ఆమెను బుజ్జగించి, బండిలో కూర్చుండబెట్టెను.

వీరు స్టేషనునకు వెళ్లుసరికి రైలు, బయలుదేరుటకు సిద్ధముగా నుండెను. మోహాను డొక్క దాటునపోయి బండిలో కూర్చుండెను. సుభద్రమ్మ బండిలో కూర్చొనుచే తడవుగ, బండి కదలెను. శర్మ కంటికి కనబడుపరకు ఆమె కిటికీనుండి తొంగి చూచుచుండెను. సాయంత్రమునకు వీరు విష్ణువర్ధన గ్రామము చేరిరి. గోపాలశాస్త్రి బండితో స్టేషనునకు వచ్చి వీరిని కలుసుకొనెను. మోహానుడు రైలు దిగగనే తండ్రికి నమస్కరించెను. ఇంటిసమీపమునకు వచ్చుచున్నకొలదియు మోహానుని తొందర ఎక్కువగుచుండెను. ఇల్లుఅరమైలున్నదనగనే అతడు బండిదిగి అడ్డత్రోవను పోవుచుండెను. ఇప్పుడాతనికి తనగ్రామ మతినిశ్శబ్దముగా నున్నట్లు తోచెను. అప్పుడే సూర్యాస్తమాన మగుచుండెను. వ్యవసాయదారు లెడ్లను తోలుకొని ఇండ్లకు పోవు

చుండిరి. మోహనుడు త్రోవలో నెవ్వరిని పలుకరించకుండ తిన్నగా నింటిలోనికి పోయి తల్లికి నమస్కరించెను. ఆమె యాతని నాశీర్వదించి కౌగలించుకొనెను.

జాని—వారందరు ఏరి?

మోహ—వారు వెనుకనుండి వచ్చుచున్నారు. నేను అడ్డత్రోవను నడచి ముందుగా వచ్చివేసితిని.

జాని—బాబయ్యవద్ద పిన్నివద్ద ఉండడం సరదా తీరినదా?

మోహ—ఏమీ?

జాని—ఆ సంగతి నీముఖము మీదనే కనబడు చున్నది.

మోహ—వహవ్వా. బాగానే. ఉంది. నాకు మునుపటికంటె వళ్లు వచ్చినది.

జాని—ఊరుకుందూ. నీ మాటలకేం గాని, పిన్ని తిన్నగా నిన్ను కనుక్కునీదా?

మోహ—పాపం.పిన్ని అలా టిదికాదు. ఇక్కడకన్న నాకు అక్కడే సౌఖ్యముగా ఉండేది. అక్కడ పాలుకూడ మంచివి దొరుకుతాయి.

జాని—ఐతే సొమ్మెందుకు పంపమన్నావు?

మోహ—మీ ప్రేమ ఎటువంటిదో తెలుసుకోడానికి రాశాను. ఇన్నాళ్ళకు మీరు పంపినవి ఇరువది యైదురూపాయలే కాదూ? బాబయ్యవద్ద ఏడువందల రూపాయలులాగాను. ఒక్కసవారీ గుఱ్ఱమే కొన్నాను నాలుగువందలు పెట్టి. మంచి మంచి షోకైన బట్టలు కట్టుకుని ఊళ్ళోతిరిగేవాడిని. పిన్ని ప్రొద్దుటే కాఫీ, ఉప్మా మధ్యాహ్నం పాలు, మిఠాయి ఇస్తూవుండేది. నేనక్కడ పడ్డ సౌఖ్యము ఎప్పుడూ మరచిపోను.

జానికమ్మ వానిమాటలు విని కొంతవరకు డాబులు కొట్టుతూయున్నాడనియు, పట్నవాసపు గడుసుతనము నేర్చుకున్నాడనియు తల

చెను. మోహనుడు తన పూర్వపు జీవితమును అత్యుత్సాహముతో వర్ణింపసాగెను. ఈ మాటలతో జానకమ్మకు తోటికోడలిమీది కోపము ప్రేమగా మారెను.

మోహనుడు తాను వృద్ధుడ నగుచున్నానని తెలిసియుకూడ కమలపై ప్రేమ విడువజాలకుండెను. ఈ ప్రేమ కామాతురతయే కాని నిజమైనది కాదు. కమల అతని హృదయమును ఆక్రమించినను అతని సహధర్మచారిణి కాజాలదు. మోహనుని యొద్ద కుబేరసంపత్తి యున్న యెడల ఆకడామె కల్పించుటకు వెనుదీయుడు. ఆమెకొరకు తన సౌఖ్యమునంతయు త్యజింపగలడు. కాని తనదుఃఖములవలన, విపత్తులవలన, కష్టములవలన నిరాశుడై, ఆమెకు దూరముగా నుండెను. ప్రేమకు ప్రాణమైనట్టి విశ్వాసము కమలయం దాతని కెక్కడ? ఇప్పు డాత డాకపటప్రేమయొక్క మాయాజాలమునుండి విముక్తుడగును. ఇప్పు డాత డాప్రేమకొరకు మాయవేషములు వేయనవసరము లేదు. ఇప్పు డాతడు యథార్థరూపముతో ప్రేమను పొంది, యథార్థరూపముతో దాని ననుభవింపగలడు. కమలవద్ద దొరకని అమూల్యవస్తు వెక్కడాతనికి దొరకగలదు. ఈ యాలోచనలన్నియు మోహనుని నూతన ప్రేమాభిలాషునిగ జేసివైచెను. ఇప్పుడాతనికి తన నూతన వధువు సౌందర్యవంతురాలు కాదేమో యను సంశయము బాధింపసాగెను. రూపలావణ్యములు నైజములగుటవలన దానియందు ఎట్టి మార్పును కలుగజాలదు. స్వభావమట్లుగాక సరియైన బోధనవలనను, మంచిసహవాసమువలనను, సరియైన మార్గము ననుసరింపగలదు. మోహనుడు తన కాబోవు భార్యయొక్క సౌందర్యవిషయమై పెండ్లివారితో వచ్చిన నౌకరు ననుగ నిశ్చయించి, వానిని మంచిమాటలతో చేరబిలచి, ఒకజరీవాణీయు, కొంతసొమ్ము వానికి ఇనాముగా నిచ్చి మాటల సందర్భములో వానితో నీప్రస్తావనను దెచ్చెను. ఆ

కాదు. తన చెల్లెలి నెందుకు తీసుకువచ్చితినా యని అని డిప్పుడు పశ్చాత్తాప పడసాగెను. రామనాథము తన భార్యను సంతోష పెట్టుటకు ఆమె 'సందన్న సంది, పందిన్న పంది' అని అనుచు ఆమె మాటలకే తాళము వేయుచుండెను. జగదాంబ యిప్పుడు తెల్లని బట్ట కట్టుకొనుట కధికార మెక్కడిది? పూర్వము సుశీల ఎంత గారాబముగా పెరిగినది? కాని యిప్పుడామెకు తన మేనమామ కూతుం డ్రతో సమానముగా నుండుటకు కూడ అధికార మెక్కడ? రామనాథము తన భార్య సాధింపుమాటలు విని తల నాడించుచుండెను. కామేశ్వరమ్మ తన మగని ఆసరా జూచుకొనే తనసట్లు చులకన చేయుచున్నదని తలచి జగదాంబ అన్నపై దుఃఖపడుచుండెడిది. రామనాథము తనకు సమయము దొరికినప్పుడు తన చెల్లెలిని పిలచి ఏకాంతముగా ఓదార్చుచుండెడివాడు. కాని యిట్టి అవకాశము దొరకకుండ కామేశ్వరమ్మ చూచుచుండెడిది. అందువలన జగదాంబకు కూడ అతని యోదార్పు మాటలయందు విశ్వాసము లేకుండెను.

ఈ ప్రకారముగా నొక్క సంవత్సరము గడచిపోయెను. జగదాంబ మనోవ్యాధివలననూ, నిరాశవలననూ, రోగగ్రస్థురాలై క్రమముగా మంచము పట్టెను. ఆమెకు జ్వరము వచ్చుచుండెను. రామనాథము మామెకు మొదట చిన్నచిన్న మందు లిప్పించెను గాని లాభము లేకపోయెను. అందువలన అతడు విచారగ్రస్థుడై యొకనాడు తన భార్య పొరుగింటికి వెళ్లుట జూచి, యిదే సమయమని తన చెల్లెలి గదిలోనికి వెళ్ళెను. జగదాంబ వంటిమీద తెలివిలేక మంచము మీద పడియుండెను. పక్క అతికుళ్ళుగా నుండెను. కట్టుకొన్నబట్ట చిరిగి మాసియుండెను. సుశీల ఆమెవద్ద కూర్చుని మెల్లగా విసరుచుండెను. ఈ విచారకరమైన దృశ్యమును జూచి రామనాథము కంట తడి

బెట్టెను. "పూర్వము ఎంతోమంది నౌఖరుల చేత సేవ చేయించుకొన్న యీమె కెంతగతి పట్టినది!" అని దుఃఖించుచు, తన పిరికితనమునకు చేతకాని తనమునకు విచారపడుచు ఆమె పక్కనే కూర్చుని "చెల్లెమ్మా! నిన్నిక్కడకు తీసుకొనివచ్చి చాల కష్టపెట్టుచున్నాను. దాని పర్యవసానమిట్లగునని నేనెన్నడు అనుకొనలేదు. ఇప్పుడే వెళ్ళి మంచి వైద్యుని తీసుకొని వచ్చెదను. దైవకృపవలన నీకు త్వరలో ఆరోగ్యము కలుగగలదు" అని యూరడించెను.

ఇంతలో కామేశ్వరమ్మ వచ్చెను. ఆమె యీ మాటలు విని "ఆc. ఆc. వేగం పడుగెత్తు. లేకపోతే చాలా అనర్థం సంభవిస్తుంది. నేనిది వరకు నలుగురు తోడుబడిని జబ్బుపడినప్పుడు, వైద్యుని పిలుచుటకైనను దిక్కు లేకపోయినది. నేనుకూడా అప్పుడు ముసుగుపెట్టుకొని పడుకొని వుంటే తెలిసివచ్చును కాని యింటి చాకిరీ అంతా ఎవరు చేస్తారు? ఇంతకీ నానుదుట సుఖపడడానికి వ్రాసిలేదు." అని దెబ్బలాట ప్రారంభించెను.

దీనితో రామనాథము నిరుత్సాహుడయ్యెను. వైద్యుని పిలుచుటకైనను అతనికి సాహసము లేకపోయెను.

జగదాంబ అవస్థ రోజు రోజుకు క్షీణించుచుండెను. చివరకు జ్వరాతిసారము పుట్టి, బ్రతుకాశ పోయెను. ఇట్టి సమయములో పగ్గుజావను కూడ ఆరగించుకొనుశక్తి లేనప్పుడు, ఆమె నూకలజావ ఎట్లు ఆరగించుకొనగలదు? ఆరు మాసములిట్లు బాయిలాపడి యిక నీ కష్టములను భరింపలేక ఆమె అకాలమృత్యువు వాతబడెను. సుశీలకిప్పు డీప్రపంచమున నా అను వారెవ్వరును లేరు. కమలకు రెండు త్తరములు వ్రాసినను ఆమె యొకదానికైనను జబాబు వ్రాయలేదు. అక్కకూడ తన్ను మరచెననియు, తనకెవ్వరును దిక్కు లేరనియు ఆమె దుఃఖింపసాగెను. తల్లి బ్రతికియున్నప్పుడా మొకర్కలో పడు

కుని తన కష్టములను చెప్పి యేడ్చుచుండెడిది. గ్రుడ్డివాని చేతికఱ్ఱ విరిగిపోయి నట్లిప్పుడామె కా అనరాకుండ పోయినది. సుశీల యిప్పుడు గడియుందొక మూల కూర్చుని ముఖము కప్పుకొని యేడ్చుచుండెను. కాని గడమూలకును, తల్లివొడికిని యెంత అంతరవుగలదు! ఒకటి చల్లని జలాశయము, రెండవది మరుభూమి.

సుశీల కిప్పుడు మనశ్శాంతి యెక్కడ? ఆమె హృదయము మండిపోవు నిప్పువలె మండుచుండెను. తన అత్తమామలే తన తల్లి మృత్యువునకు కారకులని ఆమె భావించుచుండెను. జగదాంబ జీవించి యున్నప్పుడు ఆమెను తన మేనత్త తిరస్కారములనుండి తప్పించుటకు సుశీల చాల ప్రయత్నించుచుండెడిది. తన తల్లి మాటపడకుండునట్లు ఆమె తన మేనత్త కనుసంజ్ఞలను కనిపెట్టియే పనులను చేయుచుండెడిది. ఒకనాడు జగదాంబ చేతినుండి నేతిగిన్నె జారిపోయెను. సుశీల తన తల్లి మాటలను పడలేదని తలచి. తానే ఆగిన్నెను పడవేసితినని చెప్పి మేనత్త చేత అతిట్లనన్నియు తానే తినెను.

కాని సుశీల కిప్పుడాభయమంతయు పోయినది. తాను నిరాధారురాలైనప్పటికిని యిప్పుడామెకు గుండెధైర్యము కలిగినది. ఇప్పుడామెకు ఓర్పులేదు. త్వరగా కోపము వచ్చుచుండెను. సుశీల మును పటివలె గాక మేనత్త పెట్టు చివాట్లకు యెదురుజవాబు చెప్ప మొదలు పెట్టెను. ఆమె తన హృదయమును కఠిన యాతనను అనుభవించుటకు తయారు చేసికొనుచుండెను. సుశీల తన మేనమామకు కొంచెము మొదుగుచుండెను. కాని మేనత్తను నిర్లక్ష్యపెట్టుచు ఆమె పిల్లలను నిరసనతో జూచుచుండెను. సుశీల యిప్పుడు దెబ్బలకు తెగించి యితరుల పొలములో మేయు ఆవువలె నుండెను.

ఈ ప్రకార మొక సంవత్సరము గడచెను. రామనాథము సుశీల పెండ్లినిమిత్తమై చాల ప్రయత్నము చేయుచుండెను. కాని చాలగ

సంబంధ మెక్కడను కుదురుటలేదు. అతడాయూరి పెద్దమనుష్యుల కొలువునివద్ద సుశీల పెండ్లినిమిత్తమై రెండువందలు జమచేసెను. కాని అంత తక్కువ కట్నమునకే పెండ్లికొడుకు వచ్చును? కామేశ్వరమ్మ నల్లమే మైన సుశీల నిప్పటికి కేముప్పదియుండగా నాడే మెడలో కట్టిపెట్టి తనమీద వదలించుకొన దలచెను. కాని రామనాధము మునుపటివలె గాక తన భార్య మాటలను నిర్లక్ష్యపెట్టి సుశీలకు మంచిసంబంధము కుదుర్చుటకు నిశ్చయించుకొనెను. జగదాంబయొక్క అకాల మృత్యువు అతని మనస్సును దిట్టపరచెను.

## ౨౮

సంఘసంస్థలు తగినవారి సహాయము లేనియెడల వృద్ధిబొందనేరవు. నారాయణరావునకు అనుచరుల లోపము లేదు. కాని వారిలో చాల వరకు సామాన్యగృహస్థులే. గొప్పవారతనిని జూచిన దూరము దూరముగా పోవుచుండిరి. కొందఱు యీ సంస్థలయందు చేరగానే వాటికి ప్రాణము వచ్చినట్లయ్యెను. సభయొక్క సన్నాహము యుప్పొంగెను. పెద్దమనుష్యులీ విషయమై చర్చింపసాగిరి. ప్రజలకు వీటి యందు విశ్వాసము కలుగుచుండెను. సాధారణముగా ఏవిషయమందైనను మనము బాగుగ నాలోచించికూడ దానిలో చేయిపెట్టుటకు భయపడుచుందుము. నలుగురి ఆమోదముండదేమోయని భయపడుచుందుము. పెద్దమనుష్యులెవరైనను కలసిన బాగుండునని చూచుచుందుము. ఒకరు దారితీసిన అప్పుడు మనకు ధైర్యము కలుగును. నలుగురు మనలనుజూచి నవ్వుదురన్న భయము పోవును. మనయింటివైపున ఒంటరిగా నుండుటకు భయపడుదుము. కాని

యిద్దరుముగ్గురు మున్నప్పుడు అడవిలోనైనను నిర్భయము. ప్రొఫెసర్ శంకరరావు, భగవంతరావు, బారిష్టర్ శివరామ్, యిదివరకు నారాయణదాసు కీవిషయమై రహస్యముగా సహాయము చేయుచుండిరి. ఇప్పుడు వారు శక్తితోకూడ కలసి బహిరంగముగా పని చేయుచుండిరి. సహాయకుల సంఖ్య రోజుకురోజు వృద్ధి పొందుచుండెను.

సంఘ సంస్కరణ విషయములో మృదువుగా మాట్లాడిన లాభము లేదని నారాయణదాసు నమ్మకము. ఇందువలననే అతని మాట లందరకు రుచికరములుగా నుండవు. సౌఖ్యముగా నిద్రపోవు వారికి అతని కఠినవచనములు అప్రియములుగా నుండును. కాని దాసునకా లక్ష్యమే లేదు.

కృష్ణశర్మ ధనవంతుడు. గౌరవకుటుంబములోనివాడు. వేశ్యలను పట్టణ ముఖ్యస్థలములయం దుండనీయకూడదను విషయమై అతడతి పట్టుదలతో ఆందోళన చేయుచుండెను. మ్యునిసిపాలిటీయందు నారాయణదాసున కిద్దరు ముగ్గురు స్నేహితులున్నను, వారీ ప్రస్తావన కౌన్సిల్‌నందు తెచ్చుటకు సాహసింపలేకపోయిరి. ఈ విషయమై ఆలోచించుటకే భయమును కలిగించునంతటి కఠిన సమస్య యది. మ్యునిసిపాలిటీయం దీ ప్రస్తావన తెచ్చిన ప్రళయం దేమి గడబిడ పుట్టునోయని వారి భయము. పట్టణమందలి యెందరో యుద్యోగస్థులకు, వర్తకులకు, ధనవంతులకు, నీ వేశ్యలతో సంబంధమున్నది. ఇట్టివారితో విరోధమును తెచ్చిపెట్టుకొనుట కెవరు సాహసింతురు? మ్యునిసిపల్ అధికారులుకూడ వీరి చేతిలోని కీలుబొమ్మలె గదా!

కృష్ణశర్మ మ్యునిసిపల్ సభ్యులనందరను కలుసుకొని యీ ప్రస్తావన విషయమై వారికి నచ్చచెప్పుచుండెను. ప్రభాకరరావుయొక్క ఉద్రేకపూరితములైన వ్యాసము లాతనికి సహాయము చేయుచుండెను. ఈ విషయమై ప్రజలను మేల్కొలుపుటకు కరపత్రములు వెలువడ

సాగెను. వరుసగా నుపన్యాసములు కూడ నిచ్చుచుండెను. ప్రొఫెసర్ శంభురావు, కృష్ణశర్మ యీవిషయమై చాల సమర్థులు గనుక ఈభారమంతయు తమపైనే పెట్టుకొనిరి. ఇప్పుడు ప్రజలలో ప్రబోధము కొంతవరకు కలిగెను.

కృష్ణశర్మ కౌన్సిలునందు పెట్టుటకు నొక తీర్మానమును తయారు చేయుచుండెను. కాని యీవిషయమై ఆలోచించిన కొలదియు అతనికి అంధకారమయముగా నుండెను. వేశ్యలను పట్టణమునుండి బహిష్కరించుటవలన ననుకొన్నంత మేలు కలుగునన్న నమ్మకము నాతనికి లేకుండెను. ఒక్కొక్కప్పు డుపకారమునకు బదులు అపకారమే కలుగ వచ్చును. చెడుగునకు మనుష్యునియొక్క సద్వర్తనమే తగిన శత్రువు. అంతకు తప్ప మరి ఒక మార్గము లేదు. ఒక్కొక్కప్పు డీ ఆలోచనలన్నియు ఆతని మనస్సునకు తోచి, ఆతని హతాశుని చేయుచుండెను.

ఉపన్యాసములను కొనసాగించుట కాతడు ప్రజలయెదుట నిస్సంకోచముగ నిలువబడెను. కాని తన స్నేహితులు, బంధువులయెదుట ఆతని పృథక్త్వము నిలువకుండెను. వారియెదుట పడుట, ఆతనికి కఠిన పరీక్షగా నుండెను. "సౌఖ్యముగ నుండలేక నారాయణదాసు మాయలలో పడి జనవనప్పు చిక్కులు ఎందుకు తెచ్చిపెట్టుకుంటా" వని కొందరు స్నేహితులును "నీ స్నేహ వేశ్య మైనను దగా చేసినదా యేమిటి? వాళ్ళపని పట్టించుతున్నావు!" అని మరికొందరును గేలి చేయ సాగిరి. ఇటువంటి మిత్రులయెదుట ఆ ధర్మములు, సంఘసంస్కరణముల విషయమై ప్రస్తావించుట తెలివితక్కువ గాక మరియేమి?

కృష్ణశర్మ ఉపన్యాసము లిచ్చునప్పుడు భావపూరితమైన విషయములను చెప్పవలసి వచ్చినను, కరుణాత్మకములైన దృశ్యములను నిరూపింపవలసి వచ్చినను, అతనికి సమయమునకు, తగిన మాటలు

స్ఫురించెనేని కాదు. ఒకప్పుడు స్ఫురించినను అటువంటి మాట ను చెప్పుట కాతడు సిగ్గుపడుచుండెను. నిజముచేత అత డిట్టి మాటల యందు సమర్థుడు కాడు. తన భావశూన్యతను తెలుసుకన్నప్పు డాతడు తన హృదయమునందు ప్రేమానురాగములు లేవేమో యని సంశయించుచుండెను.

ఏదైననొక ఉపన్యాస మిచ్చిన తర్వాత, దానివలన ప్రజలయం దెట్టి ప్రబోధము కలిగెనో యని తెలిసి కొనుటకన్న, తన ఉపన్యాసము సాగినదా, ప్రమాణములతో కూడి ఉద్దేశ పూర్తికముగా నున్నదో లేదో తెలిసికొనుటకే ఎక్కువ ఆతృత పడుచుండెను.

అటువంటి సభలు తరచుగా జరుగుచుండుటవలన రోజురోజు ప్రజలలో ప్రబోధము వృద్ధి పొందసాగెను. ఈసఫలతవలన కృష్ణకు ఉత్సాహ మెక్కువగుచుండెను.

మోహనుని వివాహ మింకను రెండు మాసము లుండెను. ఇప్పు డింటివద్ద ఏతాపత్రయము లేకపోవుటవలన కృష్ణశర్మ రాత్రింబగ ళ్లీవిషయమై కష్టపడి పనిచేయుచుండెను. కచ్చేరీ పనులందాయన మనస్సేమియు వెళ్ళకుండెను. కచ్చేరీయందు సహితము తన మిత్రులతో సాధారణముగా నీవిషయమైనే చర్చించుచుండును. ఒక్క విషయమునే ఎల్లప్పుడు ఆలోచించుచు, తర్క వితర్కములు చేయుచుండుటవలన ఆవిషయమై ప్రేమ అధికమగుచుండెను. క్రమక్రమముగా కృష్ణశర్మ హృదయమందు ప్రేమ అంకురించసాగెను.

కాని వివాహము దగ్గర పడుచున్నకొద్ది ఆతని ఉత్సాహము కొంచెము కొంచెము క్షీణించుచుండెను. అతడు తనలో "అన్నయ్యా పానిమేళముకొరకు నాపేర వ్రాసెదరు. అప్పుడు నేనేమి చేయుదును? మేళము లేనియెడల ఊరేగింపుటుత్సవము చిన్నపోవును. దగ్గర దగ్గర గ్రామములనుండి అనేకులు మేళమును చూచుటకే వచ్చెదరు. వారికి

మేళము లేనియెడల, ఆశాభంగమున, మా అన్నయ్యకు చిన్నతన మును కలుగును. ఇటువంటి స్థితిలో నేనేమి చెయ్యవలెను? ఈ దురాచారమునుండి అన్నయ్యను తప్పించవలెను. కాని యీ దుష్కర కార్యమునందు నేను సఫలతను పొందగలనా? పెద్దవారి యెదుట న్యాయ సిద్ధాంతముల గురించి చెప్పుచుట అసంగతముగా నుండును. అన్నయ్య మనస్సున ను పెక్కు కోరికలున్నవి. వాటియందు దేమాత్రము లోటు కలిగినను ఆయన మనస్సు చిన్నపోవును. కాని ఏమైనను నా సిద్ధాంతముల ప్రకారము నడచుకొనుటయే నావిధి" అని ఆలోచించు చుండెను.

ఈ యత్నమునకు అనుకూలురు తక్కువగాను, ప్రతికూలురు ఎక్కువగా నున్నప్పటికి, న్యాయమైన పనిని చేయుటయే తన విధియని కృష్ణశర్మ తలచెను. తన యింటియందే సంస్కరణ జేయలేనిచో ఇతరుల కావిషయమై బోధించుట, ఎంత హాస్యాస్పదము! తుదకాతడు సానిమేళమును కుదర్చక పోవుటకే నిశ్చయించెను.

ఇట్లు నిశ్చయపరచుకొని అన్న తలపు ప్రకారము కృష్ణశర్మ పెండ్లి సామానులు సిద్ధపరచు చుండెను. ఇటువంటి సంతోషసమయములో లాభనష్టములు జూచుకొనుట అనుచితమని అతని యుద్దేశము. మిగిలిన వేడుకలు ఎక్కువగా జరిగిన సానిమేళములేని లోపము కనబడదు. అదిగాక [illegible]భత్వముచే సానిమేళము మానివేసినను నింద రాకుండును.

ఒకనాడు నారాయణదాసు కృష్ణశర్మతో "మీరు పెండ్లి వేడుకలకు ఎంత కర్చుపెట్టుచున్నారు" అని అడిగెను.

కృ-శ——పెండ్లి పూర్తియైన గాని ఆ విషయము తేలదు.

నారా——ఐనా రెండు వేలకు తక్కువ కాదను కుంటాను.

కృ-శ——అవును. బహుశః, అంతకన్న కొంచెము ఎక్కువే యౌతుంది.

నారా——మీ రింత సొమ్ము బూడిదలో పోయుచున్నారు. ఏమని

మరి ఏ మంచి కార్యమున కైనను ఖర్చుపెట్టిన దేశమున కెంతలాభముగా నుండును? మీవంటివారే యిటువంటి అనవసరపు ఖర్చులుజేసిన మిగిలినవారి సంగతి చెప్పేదేమిటి?

కృ-శ—ఈ విషయమై నేను మీతో ఏకీభవింపజాలను. దైవ మింత యిచ్చినప్పుడు, ఇటువంటి సంతోషసమయమందైనను ధారాళముగ ఖర్చుపెట్టవద్దా? ఐతే ఎవరిశక్తికొలది వారు ఖర్చుపెట్టవలెను గాని లేనిశక్తికి మించి, ఇళ్ళు వాకిళ్ళు అమ్ముకొనిగాని, ఋణపడిగాని ఖర్చుచెయ్యమని కాదు. మనస్సులోనున్న సరదాలు, వేడుకలు ఇటువంటప్పుడు తీర్చుకోనక పోతే మరెప్పుడు?

నారా—ఐతే డాక్టరు శ్యామలరావు వంటివారు ఇటువంటి సమయమందు ఐదారు వేలు ఖర్చుపెట్టవలెననేనా మీ ఉద్దేశము?

కృ-శ—ఔం. అంతకన్న ఎక్కువఖర్చుపెట్టవలెననే నా ఉద్దేశము.

నారా—కాని మొన్న నాతని కుమారుని వివాహమందిటు వంటి వేడుకలకు చాల తక్కువ ఖర్చుపెట్టినాడు.

కృ-శ—ఔను. వేడుకలవిషయమై తక్కువగా ఖర్చుపెట్టినను, టీ పార్టీల కని, డిన్నర్ల కని అంతకన్న ఎక్కువే ఖర్చుపెట్టినాడు. బీదవాళ్లకు, పనులుచేసిన వారికి చెందవలసిన సొమ్ము 'వైటవే' మొదలగు గొప్ప ఇంగ్లీషు కంపెనీలకు చెందినది. ఇది మరింత అన్యాయము గాని లాభముకాదు. ఇది దేశమునకు నష్టము చేసినట్టు కాదా?

౨౯

రాత్రి తొమ్మిది గంటలయ్యెను. కృష్ణశర్మ తన అన్నవద్దకూర్చుని వివాహవిషయమై మాట్లాడు చుండెను. ఆ మరునాడే తల్లి వెళ్ళ

డం. వీధిగుమ్మములో బ్యాండుమేళము వాయించుచుండెను. ఇంట్లో ఒకరి మాట యొకరికి వినబడకుండ అతిసందడిగా నుండెను.

గో-శా—నువ్వు పంపిన మనుష్యులు రేపు సాయంత్రమునకు రామవరము చేరునా?

కృ-శ—రేపు మధ్యాహ్నమునకే చేరవచ్చును.

గో-శా—ఐతే, యిక మనతో నేమేమి సామానులు తీసుకు వెళ్ళవలె?

కృ-శ—మన స్వంతసామాను, త్రోవలోకి ఫలహారములు తప్ప ఇంకేమియును తీసుకు వెళ్ళనక్కరలేదు.

గో-శా—సానిమేళము ఎంతకు కుదిర్చావు? పెద్దమేళమేనా?

కృష్ణశర్మ యీప్రసంగము వచ్చునని భయపడుచునే యుండెను. అన్నగారి ప్రశ్న వినగానే భయముచే వణంకుచుకొని కంపితస్వరముతో “మేళమును నేను కుదర్చలేదు.”

గో-శా—(తులువకు పలికే ధిక్కారముగా) చాలా సంతోషించినా నయ్యా! మహారాజా! నీ సత్తెకి! ఐతే పెళ్ళికి నీవుచేసిన సరంజాం ఏమిటి? తీరుబడిలేక మానివేశావా? డబ్బు ఖర్చైపోతుందని మానివేశావా? ఈ విషయమై నీకు ఐదారు రోజులక్రిందటే రాశానే. సంతర్పణ జేయువారు దక్షిణలు ఇచ్చుటకు కూడ సామర్థ్యము కలిగి వుండాలి. నీ డబ్బు ఖర్చైపోతుందని భయమైతే నా పేర స్పష్టముగా వ్రాశేయలేకపోయినావా? ఇక్కడనుంచి నేను పంపియుందును. దేవుని దయవల్ల డబ్బు కాపాటి లోటులేదు. ఇప్పుడేనా చెప్పు, మేళము కొరకు ఎవరిపేర వ్రాసిన కుదురునో? తగినవారము పెళ్ళికి తర్లి వెళ్లుతూ మేళము తీసుకువెళ్ళకపోతే నలుగురిలో నెంత తలవంపులు? పెండ్లివారు గొప్పగా వస్తున్నారని దగ్గిరగ్రామములవారందరు వస్తారు. మేళం లేకపోతే వారందరు ఏమనుకొంటారు? చెప్పేనా ఏమి కోళ

న్కారంగా ఉంటుంది? (ఉస్సూ) నమ్మినందుకు బాగా చేశావు.

వైద్యనాథమునకు ఆ గ్రామమునందు చాలా పలుకుబడి కలదు. అతడు గోపాలశాస్త్రివైపు మర్మదృష్టితో జూచుచు "మనస్సులో అనుకోవడమే గాదండి. బహిరంగంగానే నలుగురు లేవదీస్తూ కొట్టుతారు. మీరుగొప్ప పూయదిబ్బ అని వేళాకోళాలు కూడా చేస్తారు. నలుగురిలో చాలా తలవంపులు వస్తాయి. మేళం లేకపోతే ఊరేగిం పేమిటి? పెళ్ళికి వచ్చినవారికి పడిదెలో వుబుసుపోవడ మెలాగు? నే నెప్పుడు మేళంలేని పెళ్ళిచూడలేదు. బహుశః తమ్ముడుగారు ఈ విషయమై మరచిపోయినారేమో? లేకపోతే లగ్గసరిరోజుల నుండి మేళం కుదరలేదో.

కృ-శా—(భయపడుచు) కాదండీ. సంగతదికాదు ..

గో-శా—కాకపోతే మరేమిటి? నీ నెత్తిన అంతబరువు పడేశా నను కొన్నావు కాబోలు. నేను నిజంగా చెప్పుతున్నాను. ఈ బరు వంతా నీ నెత్తిని పులమాలని నా ఉద్దేశ్యముకాదు.

కృ-శా—(అన్న కఠినవాక్యములు సహింపలేక గద్గదస్వరముతో) అన్నయ్యా! మీరు నా విషయమై అలాంటి మాటలాడుట ధర్మము కాదు. అవసరమైనచో మీ విషయమై నా ప్రాణము లర్పించుట కైనను వెనుదీయను. ఎట్టైనను మీ సేవ దొరకునా యనియు, మిమ్ము లను సంతోషపెట్టవలె ననియు నే నెల్లప్పుడును కోరుచుందును. సాన మేళము వలన సంఘమునకు చాల హాని కలుగుచున్నదనియు, మేళము పెట్టరాదనియు, పట్టణములో చాల ఆందోళన కలుగుచుండుట వల నను నేను మీ మాటకు వ్యతిరిక్తముగా నడవవలసి వచ్చినది. సంఘ సంస్కరణ సభ్యులీవిషయమై గట్టిగా పనిచేయుచున్నారు. నేనుకూడ ఆ సంఘమునందు సభ్యుడనే. అందువలన సంఘనియమములకు వ్యతి రిక్తముగ నడువజాలక పోతిని,

మవలంబించుట వలన శర్మ ఏమనుకొనునో యని వైద్యనాథము సంకోచించుచుండెను. అన్నగారి కోపమునకు భయపడుచు తల వంచుకొని కూర్చుండి యుండెను. ఒకవైపు అన్నగారి ఆగ్రహము. రెండవవైపు తన సిద్ధాంతములయొక్క బలిదానము. ఒకవైపు నుయ్యి. ఒకవైపు గొయ్యి. దేనిని దాటుటకు మార్గము కనబడకుండెను. చివరకు కృష్ణశర్మ భయపడుచు భయపడుచు "అన్నయ్యా! మీరు నా తప్పులెన్నిసార్లో క్షమించినారు. ఈ యొక్కటి కూడ క్షమించండి. మేళము తెచ్చు కార్యము దూష్యమని వీఁడు కూడ తలచినప్పుడు మీరు కూడ దానిని ఎందుకు బహిష్కరింపకూడదు?"

గో-శా—(సంకోచపడుచు) నీవు పరాయి దేశస్థునిలాగు మాట్లాడుతున్నావు. ఇదే ఒకటే కాదు. ఇంకా ఎన్నో చెడు ఆచారము లున్నవి. అవి చెడ్డవని తెలిసికూడ విధిలేక చేస్తున్నాము. కన్యాశుల్కములు మంచివా? వరశుల్కములు మంచివా? ఒకరిని నిందించడం మంచిదా? కాని లోకరీత్యా నడవకపోతే నలుగురిచేత వేలెత్తి చూపించుకోక తప్పదు. అది నాకిష్టంలేదు. ఇప్పుడు మేళం పెట్టకపోతే లోభత్వంచేత పెట్టలేదని నలుగురు దూషిస్తారు. కాని నాసిద్ధాంతమునమాట ఎవరికి తెలుస్తుంది? నేనా నింద పడలేను.

కృ-శ—సరే ఐతే. ఈ సొమ్ము మరియొక మంచివిషయమై ఖర్చు పెట్టిన లోభి అను అపవాదు మీకుండదు. మేళం విషయమై మీరు ఐదారు వందలు ఖర్చు పెట్ట దలచుకొన్నారు. ఇప్పుడు లగ్గవర్లు అవడంచేత ఇంకా హెచ్చే కావచ్చును. దానికి బదులు ఏడెనిమిది వందలు పెట్టి రామపురంలో బీదవాళ్ళకు బట్టలుకొని పంచిపెట్టిన బాగుంటుందేమో? వారందరు మిమ్ముల నాశీర్వదించి, ఆబట్టలున్నంతకాలం మీ దాతృత్వమును కొనియాడుచుందురు. ఇది మీకిష్టములేనియెడల అక్కడ నొక మంచినీళ్ళ బావిని త్రవ్వించండి.

దానివలన మనకీర్తి యెల్లకాల ముండును.

గోపాలశాస్త్రి తనకు తలవంపులు వచ్చునని పెట్టెనంతట యీ సభలో ముందు జరిగిందికాదు. అతడు దీనికి తగిన జవాబు ఆలోచించుచుండెను. కృష్ణశర్మకు కోపము వచ్చునని తెలిసినప్పటికీ, వాగ్వాదముకొఱకు తన బుద్ధి బలమును జూప కుతూహలముతో వైద్యనాథుడు "ఏసంకల్పములో చేయవలసిన ఖర్చు ఆ సంకల్పములో చేయవలెను. దానము చేయవలసి వచ్చినప్పుడు దానము చేయవలెను. మేళము పెట్టవలసి వచ్చినప్పుడు మేళము పెట్టవలెను. కాని ఒక ఖర్చుకు మారుగ నింకొక ఖర్చుపెట్టుట అసంబద్ధము. పట్నాలలో తెలిసినవారైతే యొక మోస్తరు [illegible] యిటువంటి సందర్భాలలోను, జమీందారీ గ్రామములలోను యిటువంటప్పుడు బీదవాళ్ళకు అన్నము పంచిపెట్టితే నలుగురు మిమ్మల్నిని జూచి నవ్వుతారు." అనెను.

ఈ మాటలు విని యిదివరకు జబాబు చెప్పలేక సతమతముగా నున్న గోపాలశాస్త్రి వైద్యనాథుని ప్రశంసాపూర్వకముగా జూచి, నవ్వుచు "ఆం. బాగా చెప్పారు. కాకపోతే ఏమిటి? అతి మేలుకోలుపులు పాడినట్లే వుంటుంది. సమయం కాని సమయములో ఏమి రాణించును? అందుచేతనే నా మాటలు విని, మీరు బయలుదేరి వెళ్ళి మంచి సాన్ని మేళమేదో మాట్లాడిరండి."

కృష్ణశర్మ తనలో "వీరు తము ఇష్టప్రకారమే చేసెదరు. కాని యేమి యుక్తులచే, తమ వాదమును బలపరచుకొనెదరో చూచెదను. అన్నదానము చేసినప్పుడు వైద్యనాథంమాటలే వచ్చుచున్నవి." అని విచారపడుచు, నిస్సంకోచముతో "ఐతే, వివాహ మొక్క వేడుకలకు, సంతోషమునకే తగిన సమయమని మీరెల్ల స్థిరపరచగలరు? ఉపకారములకు, దానములకు, ఇంతకన్న మరియొక మంచి సమయ ముండదని నా అభిప్రాయము. వివాహ మొక ధర్మబద్ధమై ప్రతిమను

ఆత్మ సంబంధమైన ప్రతిజ్ఞ. మనము గృహస్థాశ్రమమునందు ప్రవేశించినప్పుడు, మన కాళ్ళకు ధర్మసంకెళ్ళు తగిలించుకొన్నప్పుడు, సాంఘిక ధర్మములముందు మన శిరస్సును వంచునప్పుడు, జీవన భారము దాని తాపత్రయములు మనతలపై బడునప్పుడు, ఇటువంటి పవిత్ర సంస్కార సమయములందు మనము గాంభీర్యముతో మన ధర్మము నెరవేర్ప వలసియున్నది. మన పిల్లలిటువంటి కఠిన వ్రతము నవలంబించునప్పుడు మన మానందోత్సవములోను, వేడుకలలోను, మునిగిపోవుట ఎంత విచారకరము? వారట్టి భారమును వహించుచుండగా మనము నాట్యరంగమునందు మగ్నుల మగుచున్నాము. దౌర్భాగ్యవశమున యిప్పటికి యీ దురాచారమును ఆచరణలో పెట్టి మనముకూడ దానికి దాసులము కావలసినదేనా? చదువుకొని నాలుగు సంగతులు తెలిసిన మనవంటివార మిటువంటి మూర్ఖులను సంతోషపెట్టుట ప్రధానముగా చూచుకొనరాదు."

గోపాలశాస్త్రి తిరిగి ఆలోచనా సముద్రమున మునిగిపోయెను. కృష్ణశర్మ వచనము లాతనికి సబబుగానే తోచుచుండెను. కాని ఆచారము ముందు న్యాయము, సత్యము, కర్తవ్యము, అన్నియు కూడ తీసిపోవును. వైద్యనాథము దీనికి తగిన సమాధానము చెప్పలేడని అతడూహించెను. కాని అతడోడిపోవుట కొప్పుకొనక "మీరెల్లాగేనా వకీళ్ళుకదా? మీతో వాదించగల సమర్థులమా మేము? కాని సనాతనముగా వచ్చుచున్న ఆచారమును, అది ఉచితమైనను, అనుచితమైనను దానిని నిరసించిన మనకు తప్పక చెడ్డపేరు వచ్చును. మన పూర్వులు అంత మూర్ఖులు తెలివి తక్కువవారు కారుకదా? దీనిలో ఏదో మంచి యుండబట్టే దీనిని ఆచారములో పెట్టియుంటారు."

గోపాలశాస్త్రికి మొదట నీ యుక్తి తోచిందికాదు. వైద్యనాథము మాటలు వినగానె చాల సంతోషముతో సన్మానపూర్వకముగా

అటువైపు జూచుచు "మన పూర్వులుపెట్టిన ఆచారములో తప్పక ఏదో గూఢార్థముండకమానదు. మనము దానియర్థ మిప్పుడు ఊహింపలేకపోవచ్చును. ఇప్పటికాలపు నవనాగరికులు యీ ఆచారములను రూపుమాపుటే తమ గౌరవమని తలచుచున్నారు. మనము చెప్పిన వారికి ఎంతమాత్రమునచ్చదు. మనకలవడిన జ్ఞానము, విద్య, సద్విచారము, ఆచారవ్యవహారములు మనపూర్వుల సంచితార్థములని వీరు తెలుసుకొనలేకున్నారు. యజ్ఞోపవీతమువలన ఏమిలాభమని యొకడంటాడు, పిలక తీసివేయుట కొకడు సిద్ధపడతాడు. పంచములకు శూద్రులకు అగ్రజాతులకు ఏమి భేదమని యింకొకడంటాడు. విధవావివాహముల కీర్తిని రాగాలాపనజేయుచు నింకొకడు తిరుగుతాడు. ఇంకా కొంతమంది మహానుభావులు జాతిమతములను నాశనము చేయుటకు ప్రయత్నించుచున్నారు. కాని వైద్యశాస్త్రం గాదూ! యివన్నియు మనం ఒప్పుకుంటామా? వాళ్ళ కర్మం వాళ్ళది. మనం మన పూర్వాచారప్రకారం నడుచుకుంటే ఉత్తమం. దేవుని దయవల్ల అప్పటివరకు బ్రతికివుంటే యీ కిరస్తానీ ఆచారాలెలా ఫలిస్తాయో చూదాము? మన పూర్వుల వ్యవసాయము మన్నిటికన్న ఉత్తమమైనదని శెలవిచ్చియున్నారు. కాని ఖండాంతరములకు వెళ్ళి చూచి వచ్చిన మన యువకులు మిల్లులకు మిషీనులకు దాసులగుచున్నారు. చివరకు యూరపుఖండస్థులకే తెలివితెచ్చుకొని యీమిల్లులు మిషనులు వదలించి వ్యవసాయముచేయు సమయము రాకపోవునా? స్వాతంత్ర్యం కృషికులకు ఈ మిల్లు కూలీలకు స్వామ్యమెక్కడ? పైనుండి తినుబడివస్తువులు రాకపోతే ప్రజలు మలమల మాడి చావవలసిన దేశమది. ఇటువంటి అసందర్భములతో కూడుకున్న దేశము మనకు ఆదర్శప్రాయము కాజాలదు. వీరు మనవారి తెలివితక్కువను జూచి చౌకరకం మిల్లుబట్టలు, మిషీను వస్తువులు మనకు అంటగట్టి భాగ్యవంతులగు

వున్నది. అన్నయ్యా! రామవరమునందు మేకలు మేపువారి సంఖ్య ఏ తీవరకుండును? కొన్ని వేలుండవచ్చుననండి. ఐతే మీ యుద్దేశములో వీరియందు దరిద్రకృషికులు ఎంత మందుందురు? భూస్వాము లెంత యుందురు?

వైద్య—వ్యవసాయదారులే చాలావరకుంటారు. భూస్వాములు రెండుమూడు వందలకంటె నెక్కువ యుండరు.

కృ. శ—ఐతే ఆ వ్యవసాయదార్లు మేళము జూచుటకంటె బట్టలు దొరికిన ఎక్కువ సంతోషించెదరని మీ రొప్పుకొనెదరా?

వైద్య—లేదు లేదు. నేను దాని నొప్పుకోను. చాలమంది వ్యవసాయదార్లు ఇవి పుచ్చుకొనుట కొప్పుకోరు. వారు మేళము జూచుటకే వచ్చెదరు. మేళము లేకపోయిన వారికి చాల నిరాశ కలుగును.

ఈ అడ్డవాదనవలన కృష్ణశర్మకు చాల చికాకుగా నుండెను. తన వాద మింకొక విధముగా మార్చదలచి "బజారునందు ఏ వస్తువులకు గిరాకీ ఎక్కువగానుండిన ఆవస్తువులను వర్తకులు ఎక్కువగా తెప్పించెదరనియు, కొనువా రెక్కువైనకొలదియు వస్తువుల ధర ఎక్కువ యగుననియు మీ రొప్పుకొనెదరా?" అని కృష్ణశర్మ ప్రశ్నించెను.

వైద్య—నిస్సంకోచముగా నొప్పుకొనెదను.

కృ-శ—బజారుకు ఎవరువచ్చినను వస్తువులు కొనుక్కొనుటకే వచ్చెదరు. మాంసం కొనువారు రానియెడల బజారువారికి మేకలను జంపు అవసరమే మున్నది?

మరియొక వాదనలోనికి దింపి తనవాదన నిలువబెట్టుకొనుటకు చూచుచున్నాడని భయపడుచు, అతని మాటల యర్థమును బోధపరచుకొనలేక ఏమన్న ఏమి వచ్చునో యని సంకోచించుచు "కానివ్వండి" అని వైద్యనాథ మనెను.

కృ-శ—ఇది యీరొప్పుకున్నారు కదా! సరే, వేశ్యలను పిలుచు వారు వారికి ధనమిచ్చి, వారి సుఖవిలాసములకు తగిన సామగ్రిని సమకూర్చు చున్నారు. వారాడంబరముగా జీవితమును గడుపుకొనుటకు తగిన వారినిగా జేయుచున్నారు. వీరు మేకలను కోయువారి కంటె తక్కువ పాపాత్ములా? వకీళ్ళయొక్క బాబు దర్పములు పైకి కనబడకపోయిన నేనిప్పుడు వకీలు నయ్యెదనా!

వైద్య—(నవ్వుచూ) శర్మగారూ! మీరు త్రిప్పి త్రిప్పి మా వాదమును నిలువబెట్టుకొనుచున్నారు. కాని మీరు చెప్పిన మాటలన్నియు నిజమే.

కృ-శ—వందలకొలది స్త్రీలు తమ మానమర్యాదలను నష్టపరచుకొని వేశ్యలగుచున్నారు. వారి జీవితనాశనమునకు మనమే కారకుల మనుటకు సందేహమేమున్నది? మరియు వందలకొలది యువకులు వీరి సంపర్కము వలన భయంకరమైన సుడియందు పడి నాశనమగుచున్నారు. దేవుని దర్బారు నందు యిట్టి ఘోరకృత్యములకు మనమే జవాబుదారులము. ఏ దురాచారము వలన నిన్ని నష్టములు సంభవించుచున్నవో దాని త్యజించుట అనుచితమా? అసంభవమా?

శాస్త్రి యీమాటలన్నియు చాలా శ్రద్ధతో వినుచుండెను. సమాజ సంబంధమైనట్టియు, నైతిక సంబంధమైనట్టియు విషయముల గురించి స్వతంత్రముగా ఆలోచించి తనయుద్దేశములను తెలుపునంతటి విద్య ఆయనకు లేదు. అర్థము తెలిసి వాదించునంతటి చాతుర్యముకూడ లేదు. ఆతడు నవ్వుచు వైద్యనాథముతో "అయ్యా! వైద్యనాథం గారూ! దీనికి మీరేమనెదరు? ఈ వాదమున నెగ్గుటకు మన కేదైన నుపాయమున్నదా?" యనెను.

వైద్య—(నవ్వుచు) నాకు కూడ యేమియు దారి కనబడుటలేదు.

గో-శా—ఐతే, మరియొక యుక్తిలోనికి దిగండి.

వైద్య—ఇక స్త్రీ దరిచేరినా చెడవాలి. అంతేకాని మరి దారి కన బడదం లేదు. (కృష్ణశర్మతో) మీరే నా స్థితిలో నుంటే యేమి జవాబు చెప్పెదరు?

కృ-శ—(నవ్వుచు) సబలంగా వున్నా లేకపోయినా ఏదో వాడి స్థానము కాని మాను కానా?

గో-శా—ఈ మోహముల వలన మనస్సు చలించునని నేను నిశ్చయముగ చెప్పగలను. నేను వయస్సులో నున్నప్పుడిటువంటి మోహము లనుభవించిన, కొన్ని నెలలవరకు వేశ్యయొక్క హావభావములు, హావ విలాసములు మరుపునకు వచ్చేవి కావు. స్నేహితులను కలుసుకొన్నప్పుడు వారి శృంగార చేష్టలగురించే చెప్పి చుకొనుచుండెడి వారము.

వైద్య—అయ్యా శాస్త్రిగారు! శర్మగారి యిష్ట ప్రకారమే చెయ్యండి. వీరి సంతు బీదవాళ్ళకు బట్టలు తప్పకుండా పంచిపెట్టాలి.

గో-శా—నయ్యో త్రవిస్తే ఎల్లకాలం పేరుండి పోతుంది. ఈ దురాచారమును పడగొట్టి నూతిని ప్రారంభించెదను.

## ౩౧

వర్షాకాలముగుట వలన ఆరోజు ఆకాశమంతయు మబ్బుచే ఆవరింపబడి యుండెను. రామనాథము గోదావరియొడ్డున పడవకై నిరీక్షించుచుండెను. ఆ తను చాల గ్రామములు తిరిగి, తిరిగి విష్ణువర్ధనము వద్దనున్న యొక గ్రామములో నొక మంచి సంబంధమున్నదని తెలిసి, అక్కడకే యిప్పుడు పోవుచుండెను. తిరిగి ఆ కోటనే అతడు రామవరము వెళ్ళవలసిన పనియుండెను. పడవ ఎంతకు రాలేదు. కృటుబాధి చిరాకు పడుచుండెను. ఎంత అరదినము వచ్చేవారు ఇతర

ప్రయాణీకులను ఎక్కించుకొను సందడిలో నీ తని మాటను వినిపించు కొనకుండిరి.

అంతలో రామనాథము వైపునకొక సాధువు వచ్చుచుండెను. అతడు నిండి ఘట్టిగా నుండెను. ఎఱ్ఱనికళ్లు, పెద్దవక్షస్థలమ్ము, తలనిండ జడలు, మెడయందు రుద్రాక్షమాలలు, ఒక చేతియందు చిలుము గొట్టమ్ము, రెండవచేతియందు లోహపుదండమ్ము, వీపుమీద ప్రశాంతి సము శోభిల్లుచుండగా ఆ సాధువు వచ్చి సరియొద్దన నిలచెను. అతడు కూడ ఆ కడవమీదనే రేవు దాటుటకై అక్కడకు వచ్చెను. రామనాథమునకు పూర్వమీ తనిని ఎచ్చటనో జూచినట్లు తోచుచుండెను. కాని ఎక్కడ జూచెనో మాత్రము జ్ఞాపకమునకు రాకుండెను. అతని జ్ఞాపకశక్తికి ముందొక తెరవేసి నట్లుండెను.

అకస్మాత్తుగా ఆ సాధువు రామనాథము వైపు జూచి వినయముతో అతనికి నమస్కరించి "అయ్యా! యింటివద్ద నందరు క్షేమముగా నున్నారా! తమ రిక్కడ కెందుకు దయచేసినారు?"

రామనాథము కళ్లముందర తెర తొలగిపోయి పూర్వపు సంగతి జ్ఞాపకమునకు వచ్చెను. మనము రూపమును మార్చుకొనగలముగాని స్వరమును మార్చుకొన జాలము. ఈ తడు కమల పెనిమిటి రామప్రసాదు.

కమల వివాహమైన తర్వాత రామనాథము ఆతనిని తిరిగి చూడలేదు. రామప్రసాదు ఈ విధముగా మారిపోవుట జూచి రామనాథమునకు చాల ఆశ్చర్యము కలిగెను. తాను పొరబడితినేమో యని భయపడుచు, సంశయ నివృత్తి కొరకు "తమ నామధేయ మేమని" అడిగెను.

సాధు—పూర్వపు పేరు రామప్రసాదరావు. ఇప్పటి పేరు రామానందస్వామి.

రామనా—ఆహా, అలాగా అందువలన మిమ్మలి నెక్కడనో జూచినట్లు వున్నను పోలిక పట్టలేకపోయినాను. మీా వేషమును జూచిన చాల ఆశ్చర్యముగా నున్నది. కుటుంబ మెక్కడ నున్నది?

రామస్వా—ఇప్పుడా మాయజాలమునుండి ముక్తుడ నైనాడను.

రామనా—కమల యెక్కడ ?

రామస్వా—నాః వీధిలో మేడయందు.

రామనాథ మాశ్చర్యపడుచు, రామానందునివైపు జూచి సిగ్గుతో తల వంచుకొనెను. (ఒక్కక్షణమైన తర్వాత) "ఇది ఎట్లు జరిగినదో నా కేమియు బోధపడకుండా యున్న" దనెను.

రామస్వా—ప్రపంచములో సాధారణముగ ఎట్లు జరుగుచున్నదో అట్లే జరిగినది. నా మూర్ఖత, నిర్దయ, కమలయొక్క చంచలత్వము, భోగవిలాసముల యందలి కోరిక, ఇవి యన్నియు కలసి, మమ్ముల నిద్దరను సర్వనాశనము జేసివైచినవి. ఇప్పుడా మాటలు తలచుకొన్న పెద్దయింటి పిల్లను పెండ్లిచేసికొని, చాల తప్పుపని చేసితినని నాకు తోచుచున్నది. పెండ్లి యైనతర్వాత ఆమెను తగిన రీతిని ఆదరించక పోవుట మరియు పొరబాటు, నిర్ధనుడను. అందువలన నా ధనాభావ మునకు బదులు ప్రేమానురాగములతో పూర్తిచేయవలసి యుండెను. కాని దానికి వ్యతిరిక్తముగా నే నామెను నిర్దయతో జూచితిని. చివరి కన్నవస్త్రములకు కూడ ఆమెను కష్టపెట్టితిని. వంట జేయుట, యిల్లు సవరించుట ఆమెకు తిన్నగా రాకుండెను. ఐననూ ఆ పను లన్నియు ఆమెచేతనే జేయించుచు, కొంచెము తప్పుజేసినను మిక్కిలి కోపపడుచుంటిని. ఆమె యింటినుండి లేచిపోవుటకు నేనే కారకుడ నని యిప్పుడు నాకు బాగుగ బోధపడినది. ఆమె సౌందర్యమునే ప్రేమించుచుండెడిది. నాయందామెకంత ప్రేమ లేకపోయినప్పటికి నన్ను భక్తితో చూచుచుండెడిది. అప్పుడు నేను గ్రుడ్డివానివలె

నుంటిని. దరిద్రుడు ధనమును పొంది దాని విలువను తెలిసికొనలేక ఏ విధముగా పాడుచేయునో ఆ విధముగానె నేను సౌందర్యవతిని పొంది, సంశయభ్రమలకు లోనై, యిరువురి జీవితములను నాశనము జేసితిని. నాకప్పుడు కమలపై అపనమ్మకము కలుగసాగెను. ఆసంగతి స్పష్టముగా జెప్పక, నేనామెను కఠినముగా జూచుచు, ఆమె మనస్సునకు చాల దుఃఖము కలిగించితిని. అయ్యో! అప్పుడామెను పెట్టిన బాధలను తలచుకొన్నను, నా క్రూరకృత్యములను తలచుకొన్నను విషము త్రాగి చచ్చిపోవలెనన్నంత దుఃఖము కలుగుచున్నది. ఇప్పుడా యత్యాచారములకు ప్రాయశ్చిత్తము జేసికొనుచున్నాను. ఆమె లేచిపోయిన తర్వాత మూడు నాలుగు రోజులవరకు నాకు మైకము క్రమ్మినట్లుండెను. కాని ఆ మైకము దిగిపోగానె, సంసారముపై విరక్తి కలిగి తిరిగి యింటిముఖమైనను జూచుటకు బుద్ధి పుట్టినదికాదు. ఒక దేవాలయమునందు నివసించి ఆ దేవుని పూజించుచు కాలము గడుపుచున్నాను. అక్కడకు నిత్య మిద్దరు ముగ్గురు సజ్జనులు వచ్చుచుందురు. వారితో కలసి పురాణకాలక్షేపము జేయుచుంటిని. అప్పుడప్పుడు మహాత్ములయొక్కయు సాధువులయొక్కయు సత్సహవాసము కూడ కలుగుచుండును. వారి జ్ఞానబోధనలు వినుట వలన నా అజ్ఞాన మిప్పుడిప్పుడు తొలగుచున్నది. నేను మీతో నిప్పుడు నిజము చెప్పుచున్నాను. మొదట నేను దేవాలయములో ప్రవేశించి నప్పుడు నాకు దేవునియందు కొంచమైనను భక్తిలేదు. కేవలము ఉదరపోషణ నిమిత్తమే అక్కడ చేరితిని. తర్వాత ధర్మ కథాకాలక్షేపము వలనను, జ్ఞానోపదేశము వలనను, నామనస్సునందు భక్తి ప్రేమ లుదయించినవి. మహాత్ముల సత్సహవాసము వలన, నా భక్తి వైరాగ్యముగా మారినది. ఇప్పుడు దూరదూర తిరుగుచు నా చేతనైనంత సహాయ మితరులకు చేయుచున్నాను. తమ రిప్పుడు

కి శ్యామపురమునుండే వచ్చుచున్నారా?

రామనా—లేదు. నేనిప్పు డీ దగ్గరగ్రామమునుండే వచ్చుచున్నాను. కమల కొక చెల్లెలున్నది కదా. ఆమె వివాహవిషయమయ్యే యిప్పుడు తిరుగుచున్నాను.

రామస్వా—ఈమెకైనను మంచి సంబంధము చెయ్యండి.

రామనా—మంచి వరులకు లోపము లేదుకాని అట్టివారిని కుదుర్చుటకు నాకు సామర్థ్యమెక్కడ? కమల నిమిత్తము మాత్రము నేనేమి తక్కువ ప్రయత్నించితినా?

రామస్వా—తగిన సంబంధము చేయవలెనంటె యెంతకట్నమివ్వవలసి యుంటుంది?

రామనా—తక్కినఖర్చు లలావుండగా, ఒక్క కట్నమునకే వేయి రూపాయ లుండవలెను.

రామస్వా—మీరు మంచి సంబంధము జూచి నిశ్చయపర్చండి. దేవుని దయవల్ల నేనా రూపాయలను సమకూర్చి మీ కిచ్చెదను. ఈ ఆశ్రమము స్వీకరించిన తర్వాత నితరులకు సహాయము చేయగల శక్తి నాకు కలిగినది. తిరిగి మూడు నాలుగురోజులలో మీ యింటి వద్దనే మిమ్ములను కలుసు కొనెదను.

ఇంతలో పడవ రేవులోనికి వచ్చినది. వీరిద్దరూ కూడ పడవ నెక్కిరి. రామానందస్వామి పడవవారితో మాట్లాడుచుండెను. కాని రామనాథము కమల నాశనమునకు నేనే కదా కారకుడనని చింతించుచూ ఒకమూల కూర్చుండెను.

రామనాథము సుశీలను మోహనరావున కిచ్చుటకు నిశ్చయుపరచి పసుపుకుంకుమ నిచ్చి వచ్చెను. రామానందస్వామి సహాయము చేయునన్న సంగతాతడు తన భార్యతో చెప్పలేదు. ఒకవేళ ఆసంగతి తెలిసిన తన కొమార్తెల విషయమై ఆసొమ్ము ఖర్చుపెట్టమని ఆమె యెక్కడ పట్టు పట్టునోయని ఆతని భయము. ఆతడెంత నచ్చ జెప్పినను లాభములేదు. ఆమె యన్నమాట జరుగవలసినదే.

వేయిరూపాయల కట్న మిచ్చెదనని జెప్పి ఆత డీ సంబంధమును నిశ్చయపరచెను. తక్కిన ఖర్చులకు వేయిరూపాయలైనను నుండ వలెను. ఈ సొమ్ము జతపరచుట కాతని కేయుపాయము తోచ కుండెను. కాని సుశీలకు మంచి సంబంధము కుదర్చగలిగితినని యు, అందు వలన ఆమె సుఖపడుననియు, తాను జేసిన యీ మంచిపనికి తన చెల్లెలు జగదాంబయొక్క ఆత్మ ప్రసన్నమగుననియు, ఆతడు సంతోష పడుచుండెను. "వివాహ మింకను మూడు నెల లున్నదికదా? అప్పటికి సొమ్ము జతపడిన బాధలేదు, లేనియెడల లాంఛనములు వెనుక పెట్టెదను. ఎవ్వ రేమన్నను సరే. పుస్తె మూడుముళ్ళు పడిన తర్వాత పెళ్ళివారికి కోపము వచ్చిన నేమి చేయగలరు? నన్ను నలుగురు నాలుగుమాటలు అంటారు. అంతేకదా! ఏలాగో యొకలాగ పెళ్ళి అయిపోతుంది. సుఖపడుతుంది. కావలసిన దదేకదా" యని నిశ్చయపరచుకొనెను.

నరసింహారావు జైలునుండి వచ్చి యొకవార మయ్యెను. కాని యింతవర కాయనతో యీ వివాహవిషయమై మాట్లాడుటకు వీలు చిక్కినది కాదు. నరసింహారావు ఎదుట పడుటకే ఆతడు సిగ్గుపడు చుండెను.

నరసింహారావు స్వభావ మిప్పుడు చాల మారిపోయినది. మునుపటి గాంభీర్యమునకు బదులు మోటుతనము వచ్చెను. ఆతని కిప్పుడు సంకోచ మన్న మాటయే లేదు. ఆతనికి శరీరము నీరసించినను, దాని యందేదో క్రొత్తశక్తి కలిగినట్లుండెను. ఆతడు రాత్రులయందెల్లప్పుడు దీర్ఘనిశ్వాసములు విడుచుచున్నట్లు వినబడుచుండును. అర్ధరాత్రులయందు నిశ్శబ్దముగా నున్నప్పు డాతడు మంచముపై నిటునటు దొర్లుచు "నిప్పంటుకొని సుందరభవనము కాలిపోయినది. కట్టెకాలి బొగ్గయినది. బొగ్గుకాలి బూడిదయైనది. పాపాత్ముడను. నేను బొగ్గయితిని కాని బుగ్గి కాలేదు." అని అర్థము నిచ్చు పాటను పాడుచుండును. ఆతని కండ్లయందొకవిధమైన అశాంతి కనబడుచుండెను. అందువలన కామేశ్వరమ్మ ఆతనియెదుట పడుటకైనను భయపడుచుండెను. చలికాలమందు వ్యవసాయదారులస్త్రీలు సంతకు కూలిపనుల నిమిత్తము పోవుచుందురు. నరసింహారావు కూడ సంతకు పోయి వారితో పరిహాసము లాడుచుండును. ఇతని హాస్యములు, ఓర చూపులుచూచి, వారు సిగ్గుచేతను భయముచేతను ఆతనిని తప్పించుకొనుచు నీసంగతిని కామేశ్వరమ్మతో చెప్పుకొనుచుందురు. నిజముగా నరసింహారా విప్పుడు కామాతురుడుగ నుండెను.

రామవరమునందు చదువుకొన్నవారు, పెద్దమనుష్యులు చాల మంది లేరు. కాని యాతడు వారి సహవాసము చేయక నీచజాతి వారి జట్టులో జేరి, వారితో చుట్టలు కాల్చుచు, తన జైలు అనుభవములను వర్ణించి చెప్పుచుండును. ఆతని నోటినుండి ఎప్పుడును మోటుమాటలు, నీచపుమాటలు వచ్చుచుండును.

ఆ గ్రామమునందు రామనాథము నందరు గౌరవముతో జూచుచుందురు. అతడు తన బావమరిదియొక్క నీచచేష్టలను జూచి సిగ్గుపడుచు ఆత డిక్కడనుండి పోయిన బాగుండునని దేవుని ప్రార్థించుచుండెను.

నిజముగ నిప్పుడు సుశీలకు కూడ తన తండ్రియెదుట పడుటకు భయమును, సంకోచము కలుగుచుండెను. ఆ యూరి స్త్రీలు కామేశ్వరమ్మతో తన తండ్రి కష్టములు చెప్పి అతనిని నిందించుచున్నప్పుడామెకు చాల దుఃఖము కలుగుచుండెను. "మాతండ్రికి ఏమి వచ్చినది? అతడెంత గంభీరస్వభావుడు? ఎంత దయామయుడు? ఎంత సత్పురుషుడు? అట్టి యతని యంతయు నిప్పుడు దురాచారుడైనాడే. శరీరము శరీరమే. కాని ఆ యాత్మ ఏమై పోయినదో?" అని విచారింపసాగెను.

ఈ విధముగ ఒక నెల గడచెను. రామనాథము మనస్సులో చిరాకు పడుచు "తన కూతురు వివాహ మైనప్పటికి యీతడు నిశ్చింతగా తిరుగుచున్నాడు. నే నింత కష్టపడుటకు నాకు మాత్ర మేమి పట్టినది? ఒకచోటకు వెళ్ళి నాలుగుడబ్బులు సంపాదించుకొనడం సరే కదా తిని కూర్చొని అక్కరలేని జట్టీలను తెస్తూ తను చెడిపోవడమే కాకుండ నాకు కూడ చెడ్డపేరును దెచ్చుచున్నాడు." అని మండిపడుచుండెను.

ఒకనాడు రామనాథము నరసింహారావుసహచరులతో, "ఇక ముందు మీ రితనితో కూర్చుని కాలక్షేపము చేసినను, చుట్టలు కాల్చినను మీపని పట్టించెదను. జాగ్రత్త." అని గట్టిగా జడిపించెను. రామనాథ మనిన నా యూరిలో నందరకును హడలే. వా రందరును భయపడి, మరునాడు నరసింహారావు తమవద్దకు వచ్చినప్పుడు అతనితో, "మహారాజా! ఇక మీరు మా దగ్గరకు రాకండి. మా మీద రామనాథంగారికి కోపము తెప్పించకండి. ఆయనకు కోపము వచ్చిన ఏదో యొక తగాయిదాను లేవనెత్తి మమ్ములను [illegible] చంపివేస్తారు." అని చెప్పిరి.

నరసింహారావు కోపముతో రామనాథమువద్దకు వెళ్ళి "నే నిక్కడ యుండుట చిరాకు కష్టముగా నున్నది కాబోలు!"

రామ——ఇది మీ యిల్లే. మీ యిష్టము వచ్చినన్నాళ్లు మీ రిక్కడ నుండవచ్చును. కాని నీచులసహవాసముచేసి మీ మర్యాదయు, నా మర్యాదయు కూడ పోగొట్టవద్దని మాత్రము వేడుచున్నాను.

నర——ఐతే నే నెవ్వరి సహవాసము చెయ్యను? ఇక్కడనున్న పెద్దమనుష్యులలో నెవ్వరు నా సాంగత్యమును చేయుట కిష్టపడుదురు? అందరునూకూడ నను నీచముగా జూచెదరు. నే నసహించజాలను. ఐతే ఈ పెద్దమనుష్యులలో నొకరైనను సత్పురుషులు లరని మీరు చెప్పగలరా? నా యుద్దేశముతో నందరుకూడ కోరులే. బీదలయొక్క రక్తమును పీల్చు కత్తిరాత్ములే. వ్యభిచారులె. వారికంటె నేనధముడను కాను. నేను నా పాపములకు తగి ఫలమును అనుభవించి వచ్చితిని. వారి కింకను అట్టి అనుభవము కాలేదు. వారికి నాకును గల భేద మేమనగా వా రొక పాపమును దాచుట కనేక పాపములను జేయుచున్నారు. ఇందువలన వారే నాకంటె పాపాత్ములు. ఇటువంటి కపటాత్ముల యొద్ద నేను పోజాలను. ఈ యవస్థయందుకూడ నన్నాదరించుచు, నీచకులజు నన్నుత్తమునిగా దలచుచు కాళ్ళైనను హాసలుగా నటింపనట్టివారి సహవాసమును నేను జేయుచున్నాను. ఈ నా ప్రవర్తన మీకు గౌరవలోపముగా నుండిన నేను బలవంతముచేసి మీ యింటిలో నుండజాలను.

రామనా——నే నా యుద్దేశముతో వారి సహవాసము చేయవద్దని చెప్పలేదు. ఈ సంగతిని నేను ఈశ్వర సాక్షిగా జెప్పుచున్నాను. నే నధికారులలో తిరుగుచున్నాను. మీ రట్టి సహవాసము జేసిన నాకు వారిలో తలవంపులుగా నుండును.

నర——ఐతే అధికారులతో నరసింహారా వెంత చెడిపోయినను మీ కంటె నుత్తముడే యని చెప్పుండి. నేను కూడ నొకప్పు డధి

కారినే. అధికారులయొక్క నడవడి నాకు తెలియును. వారందరు వట్టి దొంగలు. అట్టి వారి ఉపదేశములు నరసింహారావు వినదలచు కొనలేదు.

రామనా—మీ కధికారులన్న లక్ష్యము లేదు. కాని నా జీవితము వారిమీదనే యాధారపడియున్నది. అటువంటి వారిని నే నెట్లు నిర్లక్ష్యపెట్టవలెను? మీరు పోలీసినస్పెక్టరుగ పనిచేసి యున్నారు. ఇక్కడ పోలీసుద్యోగి మిమ్ములను కనిపెట్టుచున్నట్లు మీ రెరుగరా? మీరు నీచసహవాసము జేయుచున్నట్లాతడెరిగిన, మీపై తప్పక రిపోర్టు చేయును. అప్పుడు మీతో నా జీవితము కూడ నాశనమగును. ఈ పోలీసువారి నెవ్వరు నమ్మగలరు?

నర—ఇక్కడ పోలీసుద్యోగి ఎవ్వరు?

రామనా—అబ్దుల్ ఖాన్.

నర—వాడా? ఆ దుష్టుడీ ప్రపంచమునంతను నాశనమును జేయగల పాపాత్ముడు. వాడు నాక్రింద హెడ్ కనిస్టేబుగా పని చేసినాడు. ఒకసారి వాడిని నేనే జైలునుండి తప్పించినాను. వా డిక్కడకు రాని వ్వండి ఈ వందతిని జ్ఞాపకముచేసి, వాడి గర్వ మణుస్తాను.

రామనా—ఈ గడబిడలో నన్ను మాత్రము చేర్చకండి. మీ కేమియు లభ్యము లేకపోయినను మధ్య నేను నలిగిపోతాను.

నర—మర్యాదా పోతుందని మీరు భయపడుచున్నారు. నా మర్యాద పోనే పోయింది. ఇక నా కేమి భయము? మీ మర్యాదా చాలా బాగున్నది. పోలీసువారికి దళారీ కుదుర్చువారికే ఇంత మర్యాదా గర్వమా? ఇదే మీ ధర్మనిష్ఠ కాబోలు?

రామ—ఔను. సరే నేనధముడను. ధూర్తుడను. దళారిని. పాపాత్ముడను. కాని మీ విషయమై నేను పడిన కష్టములను తెలిసి కొనిన మీ రిట్లనరు.

నర—మీరు చేసిన నిర్వాకమువలననే నా యిల్లు నాశనమైనది. ఇంకా నిర్వాకము చేసితినని పదేపదే యనుటకు మీకు సిగ్గులేదా? మీరు చేసిన నిర్వాకము గురించి అంతా నేను విన్నాను. నీవే నా భార్య చావునకు కారకుడవు. నా పెద్దకుమార్తెను ఎవడో అప్రాజ్ఞుడికి ముడకు కట్టిపెట్టినావు. రెండవదానిచేత నౌకరిదానివలె చాకిరీ చేయించుచున్నావు. అమాయకురాలగు నీ చెల్లెలు నాశ చూపించి, కే నమ్మ వంక జెప్పి సొమ్మంతయు కాజేసినావు. వారిని నీయింటికి తీసుకొని వచ్చి అనేకబాధలు పెట్టితివి. దీనికేనా నిర్వాకమని గొప్పగా చెప్పుచున్నావు.”

అభిమానముగల మనుష్యునకు కృతఘ్నతవలన మిక్కిలి దుఃఖము కలుగును. తానుపకారమును జేసి, దానివలన కృతజ్ఞత పొందవలె నను ఆశ లేకపోయినను, తాను చేసిన యుపకారము తలపునకు వచ్చిన, వానికి మిక్కిలి ఆనందము కలుగును. రామనాథము తనలో “ఈప్రపంచ మెంత కుటిలమైనది? కాళ్ళరిగిపోవునట్లు కచ్చేరీలకు చెడతిరిగినాను. పక్కీళ్ళ యనుగ్రహము సంపాదించుట కెంత కష్ట పడితిని? ఉద్యోగస్థులచే నన్ని చీవాట్లను దింటిని? ముగ్గురు మనుష్యులను సంవత్సరముల తరుబడిని పోషించితిని. కమల వివాహముకొరకు అనేక తంటాలు పడితిని. ఇప్పుడు సుశీల వివాహము నిమిత్తము తిరుగలేక కాళ్ళు పొక్కు లెక్కిపోవుచున్నవి. ఈపెండ్లికి సొమ్ము ఎట్లు జతపెట్టగలనా యని కొట్టుకొనిపోవుచున్నాను. దాని కంతకిదియా ప్రతిఫలము? ఆహా! ఏమి మాయాప్రపంచము? పుణ్యమునకు బోయిన పాప మెదురుగా వచ్చినది.” అని ఇట్లు తలచుకొని కండ్ల నీరు పెట్టుకొనుచు, నరసింహారావుతో “బావగారు! నేను చేసినదంతయు మంచి దనుకొనియే చేసినాను. కాని అందులకు కీర్తినిపొందు అదృష్టము నాకు లేకపోయినది. నేను

చేసినదంతయు మట్టిపాలు కావలసినదని ఈశ్వరేచ్ఛ కాబోలు! నే నేమి చేసెదను! మీ సొమ్మంతయు నేనే తినివేసితి నని అనుకొనుడు. మీ యిష్టము వచ్చినట్లు నన్ను శిక్షించుడి ఇంతకన్న నే నేమి చేయగలను?" అనెను.

"జరిగిపోయినదేదో జరిగిపోయినది. ఇంక నన్ను బాధపెట్టకుడి. సుశీల వివాహము విషయమై మీరే చూచుకొనుడు." అని చెప్పి వేయవలెనని రామనాథమునకు బుద్ధి పుట్టెను. గాని ఈకోపములో అతడు సుశీలను ఎక్కడకు తీసుకొని పోవునో, పిల్లనేమి బాధపెట్టునో యని భయపడి, నోరు మూసుకొని ఊరకొనుటయే యుత్తమమని తలచెను. దుర్బలక్రోధము ఉదారహృదయమునందు కరుణను బుట్టించును శిక్షకుని నోటినుండి వచ్చు తిట్లను విని కూడ సత్పురుషుడైన వా డూరకుండక మరి ఏమిచేయగలడు?

రామనాథముయొక్క సహవాసము నరసింహారావును కూడ శాంతి పరచెను. వారొకరితో నొకరు మాటలాడుకొన లేకపోయిరి. రెండు కుక్కలు దెబ్బలాడి ఒకదాని కెదురుగ నొకటి ఎట్లుకూర్చొనునో అట్లే వారు మౌనముగా కూర్చుండిరి. రామనాథము తనలో, "నేనూరకొనుటయే మంచిపని యైనది. లేకపోయిన నలుగురు నన్నే నిందించెదరు." అని అనుకొనుచుండెను. నరసింహారావు తనలో, "నేను చాల తప్పుచేసితిని. జరిగిపోయిన దానిని అనవసరముగ పైకి తీసినాను. అనుచితకోపము నామనస్సును చెడిపి వేసినది" అని అనుకొనుచుండెను. నరసింహారావునకిప్పుడు తనకర్తవ్యము బోధపడుచుండెను.

సాయంత్రము పడిన తరువాత నరసింహారావు రామనాథముతో "సుశీల కెక్కడనైనను సంబంధము కుదిరినదా" అని యడిగెను-

రామ—విష్ణువర్ధనము నందలి గోపాలశాస్త్రిగారి కుమారున కిచ్చుటకు స్థిరమైనది.

నర—గొప్ప సంబంధమువలె కనబడుచున్నది. ఎంత కట్నమునకు నిశ్చయించినారు!

రామనా—వెయ్యి నూట పదహార్లు.

నర—తక్కిన ఖర్చు మరియొక వెయ్యి అగును.

రామనా—ఔను. కావా!

నర—(ఆశ్చర్యపడుచు) ఇంత సొమ్మెక్కడ జతపడును!

రామనా—దైవమే ఏదోవిధముగా గట్టెక్కించును. ప్రస్తుతము ఒక వెయ్యి నా వద్ద యున్నది. తక్కిన సొమ్ము ఎట్లు జత కూరుచుదునా యని ఆలోచిస్తూయున్నాను.

నర—(అతివిచారముతో) నా స్థితి మీరు జూచుచునే యున్నారు కదా! (యని చెప్పుచు కండ్ల వెంట నీరు కార్చెను.)

రామనా—మీరేమియు విచారించకండి నేనే ఆతంటాలన్నియు పడెదను.

నర—దైవము మీకు దీనికి తగినఫలమును ఇచ్చుగాక! బావ గారు! నా అపరాధములను క్షమించండి. ఇప్పుడు నేను నా స్వాధీనములో లేను. ఈ కఠిన యాతన నన్ను వెఱ్ఱివానిగ జేసివేచినది. అది నా యాత్మను పీల్చి పిప్పిచేసినది. నేను ఆత్మద్రోహినైతిని. దేవతలు సహితం మీ నరకములో పడిన రాక్షసులుగుదురనుటలో సందేహము లేదు. ఈ భారము వహించుటకు నా కిప్పుడు సామర్థ్యమెక్కడ? మీరే నన్ను రక్షించి గట్టెక్కించు చున్నారు. కాని ఇంతభారము మీపైన బెట్టి నేను సోమరితనముగ కూర్చుండుట న్యాయముకాదు. నాకు సెలవిచ్చిన, ఎక్కడకైనను వెళ్లి నాలుగు డబ్బులు సంపాదించుటకు ప్రయత్నించెదను. ఇక్కడ చాలమంది తెలిసినవారు రుండుటవలన వారివద్ద నేపనియు చేయజాలను రేపే బయలుదేరి కళ్యాణపురము వెళ్ళవలెనని అనుకొను చున్నాను. కమల వాళ్ళు ఏ వీధిలో నున్నారో!

రామనా—(తెల్లపోయి) వివాహ మయ్యేవరకు మీ రిక్కడే యుండండి తరువాత మీ యిష్టము వచ్చినచోటకు వెళ్లి పని సంపాదించుకొనవచ్చును.

నర—లేదు. నన్ను రేపే వెళ్ళమన్నారండి. పెళ్లి వారము దినము లున్నదనగా వచ్చెదను. కమలగారి యింటిలో నాలుగు దినములుండి పనికి ప్రయత్నించెదను. వారేవీధిలో నున్నారు?

రామనా— నాకు బాగుగ జ్ఞాపకములేదు. అదిగాక నేను చాల రోజులైన అక్కడకు వెళ్లలేదు. పట్నములలో ఎవ రెక్కడ ఉండెదరో తెలిసికొనుటెట్లు? తరుచుగ అక్కడివారు ఇండ్లు మార్చివేయుచునే యుంటారు. ఇప్పుడు వారు ఏవీధిలో నున్నారో నాకు తెలియదు.

రాత్రి భోజనముచేయుచున్నప్పుడు నరసింహారావు సుశీలను కమలయొక్క చిరునామాను అడిగెను. సుశీల రామనాథముయొక్క సంజ్ఞ కనిపెట్టలేక కమలయొక్క చిరునామాను చెప్పివేసెను.

మొదటి భాగము

ఇంతటితో సరి.

---

సేవాశ్రమము రెండవ భాగము

వెల రు 1—8—0

౧

కళ్యాణపురపు మ్యునిసిపాలిటీయందు పదునెనమండ్రు సభ్యులుకలరు. వీరిలో చదువుకొన్నవారి సంఖ్య ఎక్కువగా నుండుటవలన వేశ్యలను ఊరిబైటకు పంపివేయు తీర్మానము నెగ్గునని శర్మకు చాలా నమ్మకముగా నుండెను. ఆయన ఇదివరకే సభ్యుల నందరను కలుసుకొని

# ఆయుర్వేద యోగ ముక్తావళి

గ్రంథకర్త — పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

ఇందులో, కషాయాలూ, చూర్ణాలూ, ఘృతాలూ, తైలాలూ, లేహ్యాలూ, కజ్జలిఔషధాలూ, వంటఔషధాలూ, ఆసవాలూ, అరిష్టాలూ వీటికి సంబంధించిన ముఖ్యయోగాలన్నీ కూర్చబడ్డాయి. ఒక్కొక్క ఔషధానికి కద్దర్దైన గ్రన్థాల పాదుకలో వుండిన ఒక్కొక్క యోగమే పొందుపరచబడ్డది. శ్రీ శాస్త్రిగారు, తమ గంధర్వఫార్మసీలో ఔషధాలు తయారుచెయ్యడంలో 30 సంవత్సరాలుగా ఆర్జించిన అనుభవం అంతా యిందులో క్రోడీకరించారు. తెనుగుభాషలో, ఇంత వరకూ, ఇంత ఉపయోగకరమైన వైద్యగ్రంథం మరొకటి లేదు. శ్రీ శాస్త్రిగారి రచనామాధుర్యం తెలిసినవారికి వారి టీక ఎంత సులభం గానూ, ఎంత సరళంగానూ వుంటుందో వేరే చెప్పనక్కరలేదు. 300 పేజీల గ్రంథం, కాలికోబైండు. వెల 4—0—0 మాత్రమే.

---

# వైద్యక పరిభాష

ఇదిన్నీ పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించినదే.

ఆయుర్వేదవైద్యానికి సంబంధించిన పరిభాషాపదాలు ఎన్నో ఇందులో చక్కగా వివరింపబడ్డాయి. ఇది చెంత ఉంచుకున్నవారు ఎలాంటి గొప్ప వైద్యగ్రంథం అయినా సులువుగా బోధపరుచుకోవచ్చు. ప్రతీ వైద్యునకూ ఇది మిక్కిలీ అగత్యమైనది. అచ్చులో నున్నది.

---

# గృహదహనం

శ్రీ శరచ్చంద్రచటర్జీ బంగాళీమూలం అనుసరించి, సాహిత్య శిరోమణి శ్రీ పిలకా గణపతిశాస్త్రిగారు ఆంధ్రీకరించిన నవల యిది. శరచ్చంద్రుని గొప్ప రచనలలో ఇదొకటి. ఎక్కడికక్కడే ఆవేశం కలిగించే ఘట్టాలిందులో ఎన్నో వున్నాయి. రెండు సంపుటాలు 4—0—0

విడిగా, ఒక్కొక్క సంపుటం 2—0—0

---